# Raghuvamsa Kathanamu.

## ( Part I )



AUTHOR
BANDARU TAMMAYYA
AMALAPURAM.

# ప్రకటనము.

**Text Book for.**

| | | | |
|---|---|---|---|
| Complete book | Andhra University | 1934 | B. A. (Group V) |
| ,, | ,, | ,, | Ubhaya Bhasha Praveena. (A.B.C. Groups) |
| ,, | Madras University | 1936 | Vidvan. (B Group) |
| Part I | ,, | 1936 | B. A. |
| ,, | ,, | 1937 | Intermediate. |
| Part II | ,, | ,, | B. A. |
| Part I | Annamalai University | 1938 | Intermediate. |

వలయువారికీగ్రంథము మొత్తముగను ప్రథమ ద్వితీయఖండములు వేర్వేఱుగను కూడ లభించును.

—: వెలలవివరము :—

| | మొత్తపుగ్రంథము | ప్రథమఖండము | ద్వితీయఖండము |
|---|---|---|---|
| విద్యార్థులకు పుస్తకవిక్రేతలకు | 1-4-0 | 0-12-0 | 0-12-0 |
| ఇతరులకు | 1-8-0 | 1-0-0 | 1-0-0 |

*For Copies apply to the*
AUTHOR,
AMALAPURAM.
[East Godavari Dt.]

Approved for School use by the Text Book Committee.
Vide page 231 of Part 1-B of the Fort Saint George
Gazette dated 8-4-1930.

ఓం

శ్రీమదుమామహేశ్వరాభ్యాం నమః

# రఘువంశకథనము

(ప్రథమ ఖండము)

గ్రంథకర్త

బండారు తమ్మయ్య

అమలాపురము.

రెండవకూర్పు 1000 ప్రతులు.


వామరాజు చంద్రమౌళిగారి

శ్రీమారుతి ముద్రానిలయమున

ముద్రితము.

అమలాపురము.

1936

# కృతిసమర్పణము

సీ॥ ఏజగన్నుతుకీర్తి ♦ యెల్ల దిక్సతులకు
శాశ్వతిచందన♦చర్చ యయ్యె
నేజ్ఞానధను విద్య ♦ విజ్ఞానవినయాది
గుణకోటికిని బరా♦కోటి యయ్యె
నేరసజ్ఞుని వాణి ♦ భారతలోకైక
జాతీయతకుఁ బరం♦జ్యోతి యయ్యె
నేధన్యతము దివ్య♦హృదయమ్ము పార్వతీ
పరమేశులకుఁ గేళి♦భవన మయ్యె

గీ॥ నెవనిచరణమ్ము లఖిలక♦వీంద్రహృదయ
వనజపీఠముల కధిదై♦వతము లయ్యె
నట్టి కవికులగురునకు ♦ నతుల సుకవి
తావిలాసుఁడౌ **శ్రీకాళిదాసునకును**॥

గీ॥ ప్రణతులను జేసి తత్పాద♦పద్మములకు
సంకితమొనర్తు దీని న♦త్యంతభక్తి
నాంధ్రగీర్వాణముల నాలు♦గక్షరములు
నేర్చికొన్నట్టి ఋణమును ♦ దీర్చుకొఱకు॥

గీ॥ పరమకృపతోడ ధాన్యసం♦పదల నొసఁగు
నీశ్వరున కేమి మరల న♦ర్పింపగలము
అవ్వియే మార్చి భక్ష్యభో♦జ్యాదులుగను
శుద్ధమతిని నైవేద్యమి♦చ్చుట యెగాక।

గీ॥ కాన కవికులేశ్వరుఁడు లో♦కంబునకును
సంస్కృతశ్లోకఫణితి నొ♦సంగినట్టి
కృతివచనముగ నాంధ్రీక♦రించి యిట్లు
పేర్మి నతనికె మగుడ న♦ర్పించినాఁడ॥

# గీతాంజలి

సుకవిమణి కాళిదాసుని ♦ సుద్దులేడ
ముగ్ధుఁడను నేను నామంద ♦ బుద్ధి యేడ
భవ్యగుణపేటి రఘువంశ ♦ కావ్య మేడ
నెలమి దాని నేనాంధ్రీక ♦ రించుటేడఁ

దలఁచియును నిట్లు, తత్కృతి ♦ తనమనోజ్ఞ
సద్గుణంబులఁ బ్రేరేపఁ ♦ జాపలమును
నడఁచుకొనలేక యీరీతిఁ ♦ గడఁగినాఁడ
నంతియెగాని తగిన వ♦లంతినవుటఁ

గాదు కానయో విబుధాగ్ర ♦ గణ్యులార !
పరిహసింపఁగఁబోక యీ ♦ పనికి నన్ను
సాదరంబుగ నీకృతిఁ ♦ జదివి యందు
నొక్కటైనను గుణలేశ ♦ ముండెనేని

మెంచి దానినే దయను గ్ర♦హింపుఁడయ్య !
భక్తితో మీదు సహృదయ♦త్వమున కేను
వందనము చేసి సమధికా♦నందమునను
నర్పణ మొనర్తు నాదు గీ♦తాంజలులను.

# విజ్ఞప్తి.

జగమెఱింగిన బ్రాహ్మణునకు జందెముక్క యేల యనునట్లు జగమెఱింగిన కాళిదాసమహాకవినిగూర్చిగాని తత్కృతిరత్నములఁగూర్చిగాని ప్రశంస లవసరము లేదు. ప్రపంచమందలి కవిశేఖరులలోఁ గాళిదాసున కుత్తమోత్తమస్థానమును సకలదేశీయులు నొసంగుచున్నారు. ఆతని కృతులు వేనికవి సాటిలేని ప్రత్యేకరత్నములయినను, నాటకములందు శాకుంతలమును గావ్యములందు రఘువంశమును గురుతరములని పలువురు ప్రాచ్యపాశ్చాత్యపండితుల యభిప్రాయమైయున్నది. రఘువంశకావ్యమొక యితిహాసమువంటిది. ఇందు దిలీపుఁడు మొదలుకొని యగ్నివర్ణునివఱకుఁగల సూర్యవంశరాజుల చరిత్రములను మన మహాకవి యసాధారణనైపుణ్యముతో వర్ణించియున్నాఁడు. వేర్వేఱు రాజులచరిత్రములలో బహువిధములయిన వేర్వేఱు సందర్భములను వర్ణింపవలసివచ్చుటచే నాకవివరుని యప్రమేయకవితాప్రతిభాప్రదర్శనమున కిందెక్కువగ నవకాశము కలిగినది. ప్రపంచవాఙ్మయమునందలి యిట్టి యుత్తమ కావ్యరత్నమును స్పృశించుటకయినను నధికారము చాలని నావంటి బాలుఁడు దానినాంధ్రీకరింపఁగడంగుట సాహసాతిసాహసమని చెప్పకతీఱదు. ఆంధ్రగీర్వాణములను నేను గురుకులవాసమొనర్చి నేర్చినవాఁడనుగాను. లోకమెల్ల నతిలోకరమణీయమని కొనియాడు కాళిదాసుని కవితాసౌందర్యమును గొంతవఱకయినఁగాంచి యానందించుటకే నేను సంస్కృతభాషను స్వయంకృషితో నించుక నేర్వఁగడంగి ప్రప్రథమమున రఘువంశమునే యారంభించితిని అట్లు చదువునప్పుడే యా కావ్యసౌందర్యమున సమ్మోహితుఁడనయి స్వశక్తి నెఱుంగకయే యాగ్రంథమును వచనముగ నాంధ్రీకరించిన బాగుండునని

తలంచి చాపలమునడంచుకొనలేక యెట్టకేలకు 1915 సంవత్సరమున నక్కార్యమునకుఁగడంగి తీఱిక యున్నప్పుడెల్లఁ గొంతకొంతవ్రాయుచు రెండుమూఁడుసంవత్సరములలో దీనిని బూర్తియొనర్చితిని. గ్రంథ రచనమున నాకిదియే ప్రథమ ప్రయత్నము.

## ఇతరకృతులు.

నేనెఱిఁగినంతవఱకుఁ బూర్వకవులలో నీగ్రంథమును బ్రబంధ శైలిలోఁ బద్యరూపమునఁ దెలిఁగించినవాఁడు, అవుదూరి కిచ్చయ్యా యను కవియొకఁడు. నామిత్రులు బ్రహ్మశ్రీ మానవల్లి రామకృష్ణకవి గారు ప్రకటించిన ప్రబంధమణిభూషణమను సంధానగ్రంథములో రఘువంశశ్లోకములకుఁ దెనుఁగుసేఁతలనఁదగు పద్యములుగొన్ని కాన్పించినవి. అందుచేఁ గిచ్చయ్యకుఁ బూర్వముకూడఁ గొందఱుకవులీ కృతి నాంధ్రీకరించినట్లు కాన్పించెడిని. ఇఁక నాధునికులలోఁ గీర్తిశేషులు బ్రహ్మశ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు దీనిని గీతపద్యములుగఁ గొంతవఱ కాంధ్రీకరించిరని వినియుంటిని. తరువాత బ్రహ్మశ్రీ ఆదిపూడి సోమనాథరావుగారు గీతపద్యములలోనే దీనిని సరసముగ నాంధ్రీకరించి ప్రకటించియున్నారు. అందుచేఁ బద్యాంధ్రీకరణము చర్వితచర్వణప్రాయమయి ప్రయోజనకరము కానేరదనియెంచి వచనాంధ్రీకరణమునకే నేనుద్యమించితిని. అప్పటికి నావిన్నంతలో నీకావ్యమునకున్న వచనాంధ్రీకరణము నామిత్రులు బ్రహ్మశ్రీ పాలెపు వేంకటసూర్యగోపాలముగారి కృతియొక్కటియే అదికొంతమాత్రమే రచింపఁబడి విద్యావినోది శ్రీ పసప్పాకం అనంతాచార్యులుగారి వైజయంతీ పత్రికలోఁగొంతవఱకుఁ బ్రకటితమయినట్లు తెలిసినది. నేనిదియారంభించిన తరువాత నామిత్రులు బ్రహ్మశ్రీ పేరి సుబ్రహ్మణ్యశాస్త్రులుగారు సంగ్రహముగ దీనినాంధ్రీకరించియుండిరి. కాని యది ముద్రితమయినట్లు కానరాదు. ఇఁక బ్రహ్మశ్రీ చిలకమర్తి

లక్ష్మీనరసింహకవిగారు రఘుకులచరిత్రమను పేరితో నొకయాంధ్రీకరణమును దమ మనోరమాపత్రికలో ముద్రించి తరువాతఁ బుస్తకరూపమునఁగూడఁ బ్రకటించియున్నారు. మఱియు వావిళ్లవారి ప్రచురణపట్టికలో నెవరోరచించిన రఘువంశకథయను గ్రంథముయొక్క నామముగూడ వినవచ్చినది.

ఈసుప్రసిద్ధకావ్యమునకు వ్యాఖ్యానములు హేమాద్రి, చారిత్రవర్ధనుడు, వల్లభుఁడు, సుమతివిజయుఁడు, దినకరమిశ్రుఁడు, విజయగణి, మల్లినాథుఁడు మున్నగు పండితప్రకాండులు పలువురు రచించియున్నారు. అన్నిటనుగడపటివాఁడగు మల్లినాథునిసంజీవనీవ్యాఖ్యయే యుత్తమమయి యిప్పుడు విశేషవ్యాప్తిలోనున్నది. పూనావాస్తవ్యులు G. R. Nandargikar పండితులు విశేషపరిశ్రమముతోఁబూర్వవ్యాఖ్యాతలవ్యాఖ్యానములనుగూడ సంతరించి విశేషపాఠములను, భావములను దెలియఁజేయుచుఁ దమ యాంగ్లానువాదముతో విద్యార్థుల కత్యంతోపయుక్తముగ నొక యుద్గ్రంథమును (Third Edition Revised & Enlarged) బ్రకటించియున్నారు. నాయీగ్రంథరచనమునందా పండితవర్యుఁడు తనగ్రంథమునఁ బ్రకటించిన Notes ను, విశేషాంశములును నాకెక్కుడుగ నుపయోగించుటచే నామహనీయునకెంతయు నాకృతజ్ఞతాభివందనముల నర్పించుచున్నాను. ముఖ్యముగ నేనీగ్రంథమును విద్యార్థుల యుపయోగార్థమే యుద్దేశించి వారికుచితమగు శైలిలో దీనిని రచించితిని. ఆంధ్రీకరణము మక్కికిమక్కిగ నుండక స్వేచ్ఛానువాదమయి విశేషాంశములతో మూలమునకించుక వ్యాఖ్యాప్రాయముగనుండును. ఆవిషయము మూలముతోఁబోల్చి చూచినవారికిఁ దెలియఁగలదు. ధనాభావముచేతను, ఇతరకృతులిన్ని వెలువడినప్పుడు దీనిప్రయోజనమేమియనెడి యుపేక్షాభావముతోడను దీనినింతవఱకు ముద్రింపక మూలఁబడవైచియుంచితిని. కాని

యితరాంధ్రీకరణములను దీనినిగూడఁ బరికించిన మిత్రులు కొందఱు నాయీగ్రంథప్రకాశమునకుఁగూడ నవసరమున్నదని హెచ్చరించుటచే వారిప్రోత్సాహమున నేఁడిట్లు ప్రకటింపసాహసించితిని. ఆంధ్రసోదర సోదరీమణులలో నొక్కరయిన నీగ్రంథమువలనఁ గాళిదాసమహాకవి కవితామృతమహార్ణవములో నొకబిందు వేనిక్రోలఁగలిగినచో నా యీప్రయత్నము వ్యర్థముకానేరదని తలంచెదను. గుణదోషవిషయమున క్షీరనీరవిభాగన్యాయము ననుసరింప విద్వద్రాజహంసములకుఁ గయిమోడ్పులర్పించెదను.

ఈగ్రంథరచనమున వలయునప్పుడెల్ల నాకుఁదగిన సాయమొనర్చుచుండిన నామిత్రులు బ్రహ్మశ్రీ ఇవటూరి సుందరయ్యగారికిని, దీని వ్రాఁతప్రతిని నోపికతో సరిచూచిన బ్రహ్మశ్రీ వడ్డాది సుబ్బరాయఁడుగారికిని నాకృతజ్ఞతాభివందనములర్పించుచున్నాను. ఈగ్రంథము నెప్పటికప్పుడు సాపువ్రాసియిచ్చుచు నాకెంతయుఁ దోడ్పడుచుండిన నాప్రియమిత్రులు బ్రహ్మశ్రీ ఈదరపల్లి రామమూర్తిగారు దీనిప్రకటనము చూడకమునుపే కీర్తిశేషులగుట నాకెంతయు సంతాపమును గూర్చినది. పరమేశ్వరుఁడు వారియాత్మకు శాంతిని బ్రసాదింపఁ బ్రార్థించెదను. ఇతరవిధములఁ దోడ్పడిన నామిత్రులందఱకును, గ్రంథముద్రణమున శ్రద్ధవహించి నన్నాదరించిన మారుతిముద్రానిలయాధ్యక్షులు శ్రీ వామరాజు చంద్రమౌళిగారికిని నావందనములు.

అమలాపురము<br>
శుక్లసంవత్సర జ్యేష్ఠము

ఇట్లు విధేయుఁడు,<br>
బండారు తమ్మయ్య.

# రెండవకూర్పు పీఠిక.

నేనీగ్రంథమును బ్రకటించినతరువాతఁ గాళిదాసునందలి గౌరవముచేనయిననేమి, గ్రంథమందలి గుణములచేనయిననేమి తమ యున్నతపాఠశాలలలో శ్రీ తూర్పుగోదావరిజిల్లాబోర్డువారు 1932, 1933, 1934 సంవత్సరములలో దీని ప్రథమ ద్వితీయఖండములను అయిదవఫారమునకును, శ్రీ తునిరాజుగారు నాలుగైదు ఫారములకును బఠనీయముగ నిర్ణయించినారు. శ్రీ ఆంధ్రవిశ్వవిద్యాలయమువారును, మదరాసు, అణ్ణామలై విశ్వవిద్యాలయములవారును ముఖపత్రమున వివరించినప్రకారము పట్టపరీక్షలకును, విద్వత్పరీక్షలకును బఠనీయముగ నిర్ణయించి దీనిని గౌరవించిరి. విద్యాధికారులిట్లు ప్రకటించిన గౌరవాదరణములకయి వారికి నాకృతజ్ఞతాభివందనముల సమర్పించుచున్నాను. సహృదయత్వముతో గ్రంథమునుగూర్చి సదభిప్రాయములొసంగిన పండితులకుఁ బత్రికాధిపతులకు నాప్రణామములు. షేక్స్పియరు నాటకములవలెనే, ద్రాక్షాపాకమునఁ గూర్పఁబడిన కాళిదాసుని కృతులుగూడ "నీటికొలఁది తామర" యనునట్లెవరి శక్తిబుద్ధులకుఁ దగినట్లు వారు చదివి యానందింపఁదగియున్నవి. అందుకువలయువిధముననే దీనిని రచించితినని నాయభిప్రాయము. కావున సంస్కృతభాషయందువలెఁదెలుఁగుబాసలోఁగూడఁ దరగతిభేదములేక విద్యార్థులెల్ల నీగ్రంథమును జదివి కాళిదాసుని కవితామృతమును గ్రోలునవకాశమొసంగి, విద్యాధికారులుగ్రంథమునకితోధికప్రచార మనుగ్రహింతురుగాక యని ప్రార్థించుచున్నాను.

ఈరెండవకూర్పులో నేను గణింపఁదగిన మార్పులేమియునొనర్పలేదు. కొందఱు గ్రంథమున సంస్కృతపుఁబాలు కొంత తగ్గించిన బాగుండుననిరి. మఱికొందఱున్నతెన్నే మంచిదని తలంచిరి. లోకము

భిన్నరుచికలదగుటచే నేనావిషయమున నుదాసీనత వహించితిని. నాలుగవ సర్గమందలి "ఛాయామండలలక్ష్యేణ" అను శ్లోకవిషయమున నామిత్రులు శ్రీమాన్ గొడవర్తి జగన్నాథస్వామి M.A.L.T. గారు సూచించిన పాఠభేదమునననుసరించి యాశ్లోకమునకు వేఱొక యనువాదమునుగూడ నిప్పుడొసంగితిని. ఇందులకు వారికి నేనెంత యుఁగృతజ్ఞుఁడను.

అమలాపురము
10-5-1936

విధేయుఁడు,
బండారు తమ్మయ్య.

---

# పండితాభిప్రాయములు.

బ్రహ్మశ్రీ మహాకాళి సుబ్రహ్మణ్యముగారు B. A., L. T.

*Madras Educational Service (Retired), Ex-chief Examiner in Telugu, S. S. L. C. Board.*

మీరుపంపిన రఘువంశకథనమందినది. మిగులఁగృతజ్ఞుఁడను. గ్రంథశైలి హృదయరంజకముగనున్నది. పఠనీయగ్రంథములకుండ వలసిన లక్షణములన్నియు నున్నవి. గనుక మీపుస్తకమును S. S. L. C. బోర్డువారు అంగీకరింతురని దృఢముగ నమ్ముచున్నాను.

రాజమండ్రి.
20-1-30.

(Sd.) M. SUBRAHMANYAM.

బ్రహ్మశ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు M. A.

*Formerly Superintendent Vernacular Studies Maharaja's College Vijayanagaram, Chairman Vidwan Examination Board, and Now Lecturer in Telugu Madras University.*

తాముదయతోఁ బంపిన రఘువంశకథనమును వచనగ్రంథము నతికౌతూహలముతోఁ జదివి యానందించినాను. కవికులతిలకుండగు కాళిదాసుని నాటకములలో శాకుంతలమునకువలె నాతని కావ్యములలో రఘువంశమునకు విశేషప్రాముఖ్యముగలదనుట సర్వవిదితమే. కాళిదాసుని కవితామహత్త్వమునుబట్టియేగాక, యిందలి చారిత్రిక విషయములనుబట్టియుఁ గూడ నీరఘువంశకావ్యము మిగుల నాదరపాత్రమగుచున్నది. ఇందలికథాంశములనుమాత్రమే సంగ్రహముగఁ దెలుపనుద్దేశింపక, కాళిదాసుని కవితావిశేషములను, భావకల్పనాదులనుగూడ నాంధ్రలోకమునకు సుబోధంబగునటులు చేయవలయునను తలంపుతో మీరీకావ్యము నాంధ్రవచనరూపము నొందించినట్లగపడుచుండుటచే, నాంధ్రలోకమునకు మీరు మహోపకారంబొనర్చినవారైతిరని తలంచుచున్నాను. శైలిసరళంబయ్యును, పటుత్వముకలదై ధారాళంబైనదగుటచే విద్యార్థిబృందమున కవశ్యపఠనార్హంబయియున్నది.

Madras.<br>15-1-30. (Sd.) K. RAMAKRISHNAYYA.

బ్రహ్మశ్రీ జయంతి రామయ్యపంతులుగారు B. A., B. L.

*Retired Deputy Collector, President Telugu Academy aud Ex-chairman Board of Studies Andhra University.*

Dear Sir,

I have gone through portions of your Telugu prose version of Kalidasa's Raghuvamsam and think it is well done on the whole. I return the manuscript herewith.

Muktiswaram.<br>14-11-1922. (Sd.) J. RAMAYYA.

బ్రహ్మశ్రీ భమిడిపాటి రామచంద్రుఁడుగారు B. A. L. T.

*Deputy Inspector of Schools, Amalapuram.*

మీచేరచింపబడిన రఘువంశకథనమును ఆంధ్రగద్యకావ్యమును

కొంతవఱకు పఠించితిని. సంస్కృతరఘువంశమున కాళిదాసుచేకూర్ప బడిన భావములు ఆంధ్రవిద్యార్థులకు సుబోధకమగునట్లు వ్యక్తీకరింపబడినవి శైలియు నాతికఠినమును నాతిపేలవమును నైయున్నది. ఆంగ్లమహానాటకములను గద్యలోవ్రాసి గ్రంథకర్తల యున్నతభావములు బాలురకు బాల్యమునుండియు తెలియునట్లు పఠనీయగ్రంథములుగా నిర్ణయించినట్లే భారతీయమహాకవుల భావములగూడ దేశభాషలలో గద్యరూపమున ప్రకటించు నిట్టిగ్రంథములుకూడ పఠనీయములుగానుంచినచో విద్యార్థులకు విశేషలాభము గలుగగలదని నాయభిప్రాయము.

కాళిదాసాదిమహాకవుల యితరకావ్యములలో మఱికొన్నిటిని గూడ నిట్లే ఆంధ్రీకరించి విద్యార్థిమండలికి మహోపకారమొనర్ప గలరని నమ్ముచున్నాను.

అమలాపురము 22-1-30. } (Sd.) భ॥ రామచంద్రుఁడు.

మహారాజశ్రీ నిడమర్తి జలదుర్గాప్రసాదరాయఁడుగారు B. A.

***Formerly Chief Examiner in Telugu Madras University.***

మీరుపంపిన రఘువంశకథనప్రతి యందినది. చదివితిని. ఈవచనకావ్యము సరసమగు సులభశైలినివ్రాయఁబడి యింపొనర్చుచున్నది. అంశము మహాపావనరఘువంశచరితము. మూలకర్త మహాకవి కాళిదాసకవిత. ఇఁక దీని వేఱెయెన్న నేల ? మీకృతిసమర్పణములోని చివరి రెండుపద్యములు చదివినవారు కాళిదాసునభిప్రాయము తెలుఁగున వెలయింప మీరుసమర్థులని యెంచి తుదముట్ట మీగ్రంథమును జదువకపోరు. చదివి యానందమొందకుండరు. ఇట్టిగ్రంథములు పాఠశాలలఁ బఠనీయములుగ నియమించిన యధికారులు విద్యార్థులకు మహోపకారమొనర్చినవారగుదురు.

Rajahmundry. 18-1-30. } (Sd.) నిడమర్తి జలదుర్గాప్రసాదరాయఁడు.

మహారాజశ్రీ "కవిశేఖర" వడ్డాది సుబ్బరాయుఁడుగారు.

*Retired Telugu Pandit Government Arts Collage,*
*Rajahmundry.*

రఘువంశకథనమను భవదాంధ్రీకృతగ్రంథము నామూలాగ్రముగాఁ జదివితిని. వచనము ధారాళమయి సలక్షణమైన రచనగల్గి పండితుల కాహ్లాదముగలిగించునదిగానున్నది. ఈవచనగ్రంథము చదువుచున్నప్పుడు కొన్నికొన్నిచోట్ల రసవంతమయిన కల్పనలు కన్నుల నానందబాష్పములొలికించుచు వచ్చినవి. కాళిదాసమహాకవి కావ్యమున కనువాదమయిన యీగ్రంథమువలన నట్టి యానందముగలుగుట సహజమేగదా! కేవల మాంధ్రభాషాపరిజ్ఞానముకలవారికిఁ గూడ నిట్టి మహానందము సులభముగావించు నీగ్రంథ మాంధ్రులకెల్ల నాదరణీయమని సంతోషపూర్వకముగాఁ దెలుపుచున్నాను. దీనివలన భాషాజ్ఞానమేగాక విశేషప్రపంచజ్ఞానముగూడఁ గల్గుటకుఁ జాలనవకాశమున్నది. ... ... ... ... విద్యాశాఖాధికారులు దీనిని బాఠశాలలయందును బరీక్షలందును బఠనీయముగ నేర్పఱిచి కవిగ్రంథరచనాపరిశ్రమమును ఫలవంతముగావింతురు గాకయని కోరుచున్నాను.

రాజమండ్రి.
27-10-29.

(Sd.) వడ్డాది సుబ్బరాయుఁడు.

మహారాజశ్రీ వల్లూరి నరసింహరాయుఁడు పంతులుగారు B.A., L.T.

*Retired District Educational Officer,*
*Ex-chief examiner in Telugu S. S. L. C. Board.*

Dear Sir,

Your "Raghuvamsa Kadhanam" is a valuable publication. The language is both simple and dignified and

the presentation of the subject matter is throughout interesting. I hope it will be found suitable for study in the upper forms of secondary schools.

Rajahmundry. }
22-1-30. } (Sd.) V. NARASIMHARAYADU.

మహారాజశ్రీ ఉమర్ అలీషాకవిగారు, పిఠాపురము.

మ॥ సరసోద్భాసిత కాళిదాస రఘువంశంబాంధ్రగద్యన్ మనో।
హరలీలన్ రచియించి కాన్క నిడె; విద్యార్థుల్, కవుల్, పండితుల్ ।
పరమోత్సాహముతో సెబాసనఁగ మా బండారు తమ్మయ్య బం।
ధురపాండిత్య నిదర్శనంబిది జగత్పూజ్యంబుగాకుండునే ॥

(Sd.) ఉమర్ అలీషా.

మహారాజశ్రీ ఇవటూరి సుందయ్యగారు.

*Senior Telugu Pandit.*

Board High School, Amalapuram.

జగత్ప్రసిద్ధమగు కాళిదాసుని రఘువంశమహాకావ్యమందలి భావవిశేషాదు లిదివఱ కాంధ్రవిద్యార్థిసంఘమున కలభ్యములు. రఘువంశకథనము శ్రీ బండారు తమ్మయ్యగారి వచనకావ్యమువలన నాకొఱఁత యిప్పుడుతొలఁగినందుల కెంతయు సంతసించుచున్నాను. ఈగ్రంథము నేనామూలాగ్రముగఁ జదివినాఁడను. కాళిదాసుని భావవిశేషాదులను బ్రస్ఫుటముగఁ బ్రకాశింపఁజేయుచు మృదుమధురగంభీరనిగుంభితమగు శైలితో విరాజిల్లు నీకావ్య మాంధ్రవిద్యార్థుల కవశ్యపఠనీయమని నేను దలంచుచున్నాను. ఇట్టిగ్రంథములు చదివినఁగాని విద్యార్థులకు సరియైన భాషాజ్ఞానమును, మనోహరమగు శైలియు నలవడనేరవని నాయనుభవమునుబట్టి దృఢముగఁ జెప్పుచున్నాను.

షేక్స్పియర్ మొదలగు హూణమహాకవుల భావవిశేషములు విద్యార్థులకు బాల్యముననే తెలియుటకై వానిని వచనరూపమున వెలయించి యున్నతపాఠశాలలలో బఠనీయములుగ నిర్ణయించుచున్నారు. అట్లే భారతీయమహాకవుల యుత్తమకావ్యమందలి భావవిశేషము లిట్లు సువ్యక్తమొనర్చు వచనగ్రంథములుకూడ విద్యార్థులకుఁ బఠనీయములుగ నిర్ణయించుటెంతయు నావశ్యకమని భాషాభిమానులు తలంపకపోరు. భావము సువ్యక్తముచేయుచు నిమిడికగా వాక్యమునురచించు శక్తినిగలిగించు పోకడ లీగ్రంథపఠనముమూలమున బాలకులకుఁ దప్పక యలవడఁగలవు. కావున విద్యాశాఖాధికారులు చిన్నయసూరి నీతిచంద్రికవలె నీగ్రంథమును గూడ నాదరించి పఠనీయముగ నిర్ణయించి విద్యార్థిలోకమునకు మహోపకార మొనర్తురుగాక.

(Sd.) ఇవటూరి సుందరయ్య.

10-8-29.

బ్రహ్మశ్రీ ఏలూరుపాటి రామభద్ర చయనులుగారు,
సారస్వతి సర్వస్వపత్రికాధిపతి.

ఎవ్వానిశీలము సర్వజనానుసరణయోగ్యమై పరఁగెనో, యెవ్వానినామము ముక్తిప్రదమని యాస్తికులచే భావింపఁబడుచుండెనో యట్టి శ్రీరామచంద్రుని జననముచేఁ బవిత్రమయిన సూర్యవంశమున వాసికెక్కిన లోకోత్తరపురుషుల జీవితములను దెలుపు "రఘువంశకథనము" అను నీసద్గ్రంథమును కాళిదాసమహాకవి రఘువంశమను పేర రచించి గీర్వాణభాషాయోషామణికిఁ జూడామణిగ సమర్పించుకొనియుండె. తత్కావ్యరసలోలురగు సాహితీరసవేత్తలు తమతమ బాసలలోని కామహాకావ్యమును దీసికొనియుండిరి. భావలందులెస్స యనఁబరఁగు తెలుఁగుబాసలో నింతవఱకుఁ బద్యకావ్యములుగఁ

గొందఱు రచించియుండినను సర్వజనసామాన్యగ్రహణమగుటకు వచనరచన నీమహాకావ్యమును వెలువరించిన కవిశిఖామణి శ్రీ బండారు తమ్మయ్యగారు. ఇంతవఱకీకావ్యమును వచనముగఁ గొందఱు వ్రాసినను, తత్కావ్యమందలి యవ్యాజభక్తిచే నీరచనకు వీరుపూనుకొనవలసినవారైరి. వీరి రచనాధోరణి మనయాంధ్రలోకమునకు సుపరిచితమే. ఈరఘువంశకథనము యథామాతృకముగ రసపోషణమున సులభశైలి నొప్పుచున్నదని నానమ్మకము. ఇట్లే వారింకను కావ్యరత్నముల వెలువరచుటకుఁ దగినయవకాశమును భగవానుఁడు ప్రసాదించుఁగాక. ఈకావ్యరత్నమును విద్యార్థులకుఁ బఠనీయగ్రంథముగఁజేసి కవిగారిని ప్రభుత్వమువారుకూడఁ బ్రోత్సహింతురని నేను నమ్ముచున్నాను.

తాళ్లపూడి.
25-1-1930 } (Sd.) ఏలూరుపాటి రామభద్రచయనులు.

వేదతీర్థ, కావ్యతీర్థ, స్మృతితీర్థ, ధర్మాచార్య, సాహిత్యవిశారద,
విద్యారత్న, విద్యానిధి బిరుదాంచితులు, శివశ్రీ పండిత
చిదిరెమఠము వీరభద్రశర్మగారు.

***Now Principal Sankar Sanskrit College Yadagiri.***

"ప్రాజ్ఞులారా!"

"నిర్గతాసు న వా కస్య । కాళిదాసస్య సూక్తిషు ।
ప్రీతిర్మధురసార్ద్రాసు । మంజరీష్వివజాయతే ॥"

(శ్రీబాణభట్టః)

***"Kalidasa is the Brightest star in the Firmament of Indian Artificial Poetry"***

***(Professor Lassen)***

విశ్వవిఖ్యాతుఁడగు, కాళిదాసమహాకవియొక్క సుందరకవితామృతమును మనుష్యమాత్రుఁడు గ్రోలవలసియున్నది. తదీయకృతి

రత్నములు 'భగవద్గీత' వలెఁ బ్రచారణీయములనుట సువిదితము. కావున నాంధ్రభాషాభారతీపదసేవాభిరతులగు రసికబుధు లకార్యము నెక్కువగఁ గైకొనుట పరమావశ్యకమని తలంతు.

కాళిదాసుని సమస్తకృతులు హిందీ, బంగాళీభాషలలోఁ బ్రశస్తమగు గద్యతో ననువదింపఁబడి ప్రకటితములైనవి. భారతవర్షమున మూఁడవభాషయగు నాంధ్రమున నీ 'రఘువంశకథనము' తోఁ గాళిదాసగ్రంథములయొక్క సక్రమమగు గద్యానువాదకార్యమును ప్రారంభింపఁజేసిన శ్రీ బండారు తమ్మయ్యగారు ప్రశంసార్హులు. కాళిదాసమహాకవి గ్రంథములనిఁక మీఁదఁ బ్రాజ్ఞులీవిధముగ ననువదించి తెలుఁగుఁబలుకుఁ దల్లికిఁ గర్ణభూషణములనిడుపనికిఁ బూనుదురుగాక !

'రఘువంశకథనము'ను దశమప్రకరణముదనుక నచ్చటచ్చట మూలముతోఁ బోల్చి చూచినాను. మూలభావములు బాగుగఁ బ్రకటింపఁబడి వన్నెచిన్నె లమర్పఁబడినవి. రచనాపద్ధతి సౌష్ఠవముగను, శైలి యించుక సంస్కృతపదభూయిష్ఠముగను శోభించుచున్నది. సంస్కృతగ్రంథానువాదములకు నీశైలి యాదర్శముగ నుండనోపును.

సంస్కృతానువాద మాంధ్రభాషయందు రాణించినట్లు మఱే పలుకునను రాణించదు. అందుకనియే శ్రీనాథమహాకవి క్రీడాభిరామమందు "జనని సంస్కృతంబు సకలభాషలకును, దేశభాషలందుఁ దెలుఁగు లెస్స" యని సెలవిచ్చినాఁడు శ్రీనాథకవి మార్గానువర్తనులగు శ్రీతమ్మయ్యగారును తమ యీప్రథమకృతిని లెస్సగు తెనుఁగుభాషయందే ప్రకటించి కృతకృత్యులైరి.

పూనానగరస్థ సుప్రసిద్ధపండితులు శ్రీగోపాలరఘునాథనందర్గికర్ గారి రఘువంశమునందలి చారిత్రకవిశేషాంశములనుసంగ్రహించి తమ్మయ్యగారు తమగ్రంథమునఁగూర్చి విద్యార్థిలోకమునకుఁ జాల మేలొనర్చినారు. కాళిదాసుని రఘువంశామృతమును జవిచూడఁ

దలంచు నాంధ్రసోదరులకు నీయాంధ్రరఘువంశ మెక్కు_వగ నుపకరింపఁగలదు.

సంస్కృతకావ్యములందు నొక్క_దానినైనను, సమగ్రముగ ననువదించిన యాంధ్రవీరశైవులలో నాదికవీంద్రుఁడగు నన్నిచోడఁడు ప్రథముఁడు. తరువాత నేటివఱకు నాంధ్రవీరశైవులలో మఱెవ్వరైన ననూదితకావ్యకర్తలగుదురేని వారు బండారు తమ్మయ్యగారే యనఁబరఁగుదురు !

తమ్మయ్యగారు సారస్వతమందుఁ బ్రవేశించి కడునిపుణముగ నుపయుక్తములగు ననేకరచనలను ప్రచురించుచు నాంధ్రవీరశైవలోకమున విశేషస్థానమాక్రమించి శోభించుచున్నారు.

సమర్థమగు వీరి లలితలేఖిని యింతకంటె నత్యుత్కృష్టరచనాప్రచురణములతో నాంధ్రభాషకును, విశేషముగ నాంధ్రవీరశైవులకును సేవఁగావించి ధన్యతను మాన్యతను నధికముగ సంపాదించుఁగావుతమని యభిలషించు.

కాశి.
శ్రీవిశ్వారాధ్యవిద్యాపీఠము.
శుక్లసం॥ పుష్యశు ౫
భానుపుత్రవారము.

ఆంధ్రవీరమాహేశ్వరుఁడు,
చిదిరెమఠము వీరభద్రశర్మ.

శ్రీ

పార్వతీపరమేశ్వరాభ్యాంనమః

# రఘువంశకథనము

:0:

## ప్రథమ ప్రకరణము.

వాగర్థంబులవలె నన్యోన్యము గూడియున్నవారును, శబ్దార్థమయులును, లోకమునకు మాతాపితలును నగు పార్వతీపరమేశ్వరులను వాగర్థవిజ్ఞానార్థము నమస్కరించుచున్నాను. సూర్యుఁడు వంశకర్తగాఁగల వంశమేడ! స్వల్పవిషయగ్రహణ సమర్థంబగు నాశేముషి యేడ! జంబుకమేడ! జంభారిలోకమేడ! ఆహా! అజ్ఞానవశంబున దుస్తరమహాంబునిధి నత్యల్పనౌకాసాహాయ్యంబున దాఁటఁగోరుచున్నాఁడ. అశేషశేముషీధురంధరులు వాల్మీకి చ్యవనాది పూర్వమహాకవులీ సద్వంశవర్ణనంబునఁ గాంచిన కవియశమును మందబుద్ధినగు నేనుగూడఁ బడయఁగోరి యున్నతపురుషలభ్యమగు ఫలమును వాంఛించి బాహువులుసాఁచు వామనునివలె నత్యంతము నగుబాటునొందనున్నాఁడ. ఆశకుఁజొరరాని చోటులు లేవుగదా! అట్లయినను వారిచే నొనర్పఁ

---

కాళిదాసమహాకవి వాగర్థవిజ్ఞానార్థము పార్వతీపరమేశ్వరుల నమస్కరించుటకుఁ బ్రధానకారణమును విజయగణిపండితుఁ డిట్లు వివరంచియున్నాఁడు.

శ్లో॥ శివా శబ్దమయీ ప్రోక్తా శంభుశ్చార్థమయస్స్మృతః।
అతశ్శబ్దార్థనిష్పత్తి సిద్ధయే తౌ నతౌ మయా॥

ఈభావమే మూలమునలేని శబ్దార్థమయులను విశేషణముచేత సూచింపఁబడినది విజ్ఞులు క్షమింతురుగాక!

బడిన వాగ్ద్వారముగల యీవంశమునందు వజ్రవిద్ధంబగు రత్నమునందు సూత్రమునకుంబోలె, నాకును బ్రవేశముకలదని నాయుద్యమమున కుపపత్తిని గల్పించుకొనుచున్నవాఁడ.

నేవర్ణింపఁబోవు నయ్యినకులతిలకులు సర్వసంస్కారసంపన్నులగు నాజన్మశుద్ధులు. ఫలసిద్ధియగుదనుకఁ గార్యదీక్షవహించు ధీరోదారులు. సప్తసముద్రముద్రిత సర్వంసహాచక్రమును శాసించుసార్వభౌములు. నాకలోకపర్యంతము రథగమనముగల శౌర్యనిధులు. విధివిహితముగ నగ్నిని వేల్చు నిష్ఠాగరిష్ఠులు. యాచకావళివాంఛల ననుసరించి సత్కరించు దానశీలురు. అపరాధుల నపరాధానుగుణము గశిక్షించు ధర్మమూర్తులు. కాలమునతిక్రమింపక బ్రాహ్మముహూర్తమునందు మేల్కొని విధ్యుక్తవిధులనాచరించు కర్మపరాయణులు. వారు ధనమునార్జించుట సత్పాత్రదానమునకుఁగాని స్వప్రయోజనార్థముగాదు. మితభాషణశీలము వహించుట యసత్యభయంబునఁగాని యన్యతిరస్కరణార్థముగాదు. విజిగీషాపరులై యుండుట యశోధనసంపాదనార్థముగాని కేవలార్థసమార్జనార్థముగాదు. గృహమేధిధర్మము నుస్వీకరించుట సంతానప్రాప్తికిఁగాని కామోపభోగముల కొఱకుఁగాదు. మఱియు వారు శైశవమందు విద్యాభ్యాసమొనరించి, యౌవనమునందు విషయసుఖముల ననుభవించి, వార్ధకంబున మునివృత్తి నవలంబించి యంత్యదశయందుఁ బరమాత్మధ్యానంబున భౌతికదేహంబును ద్యజించు చతురాశ్రమధర్మపరిపాలనాశీలురు. ఈక్షత్రియకుల భూషణుల యేవంవిధగుణగణంబులు నాకు వినవచ్చుటచే నల్పవాగ్విభవాన్వితుఁడనయ్యుఁ జాపలప్రచోదితుండనై తద్వంశవర్ణనమునకుఁ గడంగుచున్నాఁడను. నాగ్రంథమును వినుటకు దోషాదోషవివేచనాదక్షులగు విచక్షణులే యర్హులు. జాతరూప పారిశుధ్యమాలిన్యంబులు జాతవేదోముఖంబుననగదా వ్యక్తమగుచున్నవి !!

మనీషిలోకమాన్యుండై, వేదములకుఁ బ్రణవమువలె, మహీపాలురకెల్ల నాద్యుండై వైవస్వతుఁడను మనువొకండు ప్రసిద్ధిఁజెంది యుండెను. శుద్ధిమంతమైన యామనువంశమందు శుద్ధిమత్తరుఁడైన దిలీపుఁడను రాజచంద్రుఁడు పాలసముద్రమునఁ జంద్రుఁడు వోలెనుదయించెను. విశాలవక్షస్స్థలంబును, వృషస్కంధమువంటి స్కంధమును, సాలవృక్షౌన్నత్యంబును, దీర్ఘబాహువులును గలిగి యారాజశ్రేష్ఠుఁడు క్షాత్రధర్మము నిజకర్మాచరణచణంబగు దేహమును ధరించినదోయన విలసిల్లుచుండెను. స్వశరీర తేజోబలౌన్నత్యంబుల నాతఁడు సర్వభూతములను మించి భూమండలము నాక్రమించి రెండవమేరు పర్వతమువలె మెఱయుచుండెను. రూపమునకుఁ దగిన ప్రజ్ఞయుఁ బ్రజ్ఞకుసమంబగు శాస్త్రవిజ్ఞానంబును, జ్ఞానానురూపంబులగు ప్రారంభములును బ్రారంభానుగుణంబులగు ఫలప్రాప్తియు నానృపచంద్రునకొప్పియుండెను. మకర తిమింగిల ప్రముఖ క్రూరజలచరంబులను, అనర్ఘరత్నజాలంబులను ధరించిన రత్నాకరుండువోలె నాగుణరత్నాకరుండు తేజోబలముఖ్య *భయంకరగుణంబులను, కులశీలాది ♦మనోహరగుణంబులను గలిగి యాశ్రితజనంబుల కనభిగమ్యుండును నభిగమ్యుండునుగూడనై యుండెను. సమర్థుఁడగు సారథినడుపు రథమురొక్కచక్రపుటంచు నలిగినదారినించుకంతయు మీఱనట్టులామహారాజు శాసించుప్రజలెల్లరును మనుచక్రవర్తికాలమునుండియు క్షుణ్ణమైయున్న ధర్మమార్గమునుండి రేఖామాత్రమైనను జలింపకుండిరి. సహస్రగుణం

* భయంకరగుణములు:— తేజము, బలము, సత్త్వవత్వము, ప్రభావము, ప్రాప్తకాలత్వము అనునవి. (చూడుఁడు. బృహస్పతీయము.)

♦ మనోహరగుణములు:—కులము శీలము, దయ, దానము, ధర్మము, సత్యము, కృతజ్ఞత, సూక్ష్మదర్శిత్వము, ఉత్సాహము, ఔచిత్యము, స్థూలలక్షత్వము, వినీతత్వము, ధార్మికత్వము అనునవి. (చూడుఁడు. కామందకుని నీతిసారము.)

బుగ మగుడనొసంగుటకు సహస్రకరుండు జలంబుల గ్రహించుకరణి నాయినకులభూషణుఁడు ప్రజలయభ్యుదయార్థమే వారివలన షష్ఠాంశమైన కరమును గ్రహించుచుండెను. వంశకర్తలమార్గమున ననుసరించుట కులవర్ధనుల నిసర్గలక్షణముగదా! విమలధిషణాధురంధరుండును, వీరపురుషాగ్రేసరుండును నగు నాభూపాలోత్తమున కకుంఠితశాస్త్రవిజ్ఞానంబును, గనయంబునఁగూర్పఁబడిన గొనయంబును మాత్రమన్యోన్యసహాయంబులై సకలార్థసాధకంబులయ్యెను. తత్కారణంబునఁ జతురంగబలంబు లాదోర్వీర్యైకనిర్జితశాత్రవునకు ఛత్రచామరాద్యుపకరణంబుల కరణిఁ గేవలరాజచిహ్నప్రయోగంబులై యుండెను. రహస్యరాజకార్యాలోచనుఁడగు నామహీవరుండు శోకహర్షాది సూచకములగు భ్రుకుటీముఖరాగాదికములను, హృద్గతభావవ్యంజకంబులగు చేష్టితంబులను నిగూఢములు చేసి చతురుపాయములఁ బన్నుటఁ జేసి యాప్రారంభములు పూర్వజన్మవాసనలుంబోలెఁ గార్యసిద్ధినిబట్టి మాత్రమే యూహింపఁదగియుండెను. భయరహితుఁడయ్యు నాభూరమణుండు ధర్మసాధనార్థము శరీరమును రక్షించుకొనెను. "శరీరమాద్యం ఖలు ధర్మసాధనమ్మ"ని యార్యులు వచింతురుగాదె! అనాతురుండయ్యు నాధర్మరతుండు ధర్మము నాచరించెను. కాంక్షారహితుఁడయ్యు సత్పాత్రవినియోగార్థమాత్యాగపరాయణుఁడు ధనసంగ్రహణమొనర్చెను. * అనాసక్తుఁడయ్యు నానిర్జితేంద్రియుఁడు తత్పరతలేక యుక్తకాలంబున భోగంబులననుభవించెను. మఱియు నాయనంతాకాంతుండు పరవృత్తాంతజ్ఞానాన్వితుండయ్యు మౌనము వహించియుండెను. సామర్థ్యమున్నను బరులొనర్చు నపకారములను బ్రతీకారమొనర్పక సహించెను. సంతతవితరణశీలుండయ్యు వికత్థనవిముఖుండయ్యెను

* శ్లో॥ 'సేవేత విషయాన్ కాలే ముక్త్వా తత్పరతాం వశీ' అను కామందక సూక్తి యిచ్చట ననుసంధింపఁబడినది.

కావున సహజముగఁ బరస్పరవిరుద్ధంబులయ్యు జ్ఞానమౌనములు, క్షమాశక్తులు, త్యాగస్తోత్రాభావంబులు, అను భిన్నగుణద్వయంబులు వైరంబువీడి యాధీరోదాత్తునియందుఁ దోఁబుట్టువులువోలె నన్యోన్య సౌహార్దముతో విలసిల్లుచుండెను. విషయములందు వైరాగ్యమును, వేదవేదాంగాది విద్యలయందపారవైదుష్యమును, ధర్మాచరణమునం దాసక్తియు మొదలగు వృద్ధత్వలక్షణంబులు కలిగియు నారాజోత్తముండు నిండుజవ్వనంబున నొప్పారుచుండెను. ప్రజలను నిజప్రజలవలె నాజగన్నేత శిక్షించి సన్మార్గప్రవర్తకులుగఁజేసి యాపదలఁ బొరయకుండ రక్షించి యన్నపానాదులొసంగి సర్వవిధములఁ దానే జనకుఁడుగా వర్తించుటచే వారికిఁ దల్లిదండ్రులు పేరికిమాత్రమే జనకులుగానుండిరి. మఱియు నావిద్వాంసుఁడు లోకప్రతిష్ఠార్థము దండ్యులను దండించి సంతానముఁబడయుటకొఱకు దారపరిగ్రహణమొనర్చి ధర్మమును బాలించుటంజేసి యర్థకామములు రెండునుగూడ నాతనికి ధర్మసాధనార్థమే యుపయోగపడుచుండెను. దేవసంతుష్టికై యజ్ఞములనొనర్చుటకా రాజేంద్రుఁడు భూలోకమునందుఁ బన్నులను గ్రహించెను. ఆయజ్ఞహవిర్భాగంబుల సంతృప్తుఁడై యిలాతలమందలి సస్యములు వృద్ధిచెందుటకింద్రుఁడు స్వర్గమునుండి వర్షముల ననుకూలముగఁగురిసెను. ఇట్లీమర్త్య స్వర్గలోకాధినాథులిరువురు నన్యోన్యసంపద్వినిమయంబున నుభయలోకంబులను బోషించిరి. మఱియు భయంకరశాసనుండగు నాదిలీపసార్వభౌముని రాష్ట్రమందుఁ జౌర్యము ప్రజలధనములనుండి మరలి రూపుమాసి కేవల శబ్దసిద్ధమై యుండెను. కావునఁ బ్రజారక్షకుఁడగు నారాజోత్తముని దివ్యకీర్తియందు లేశమైన నితర రాజన్యులు పడయఁజాలరైరి. అధర్మరతునకు శత్రుఁడైనను సజ్జనుఁడు రోగికౌషధంబుబలె సమ్మతుఁడును, మిత్రుఁడైనను దుర్మార్గుఁడు సర్పదష్టాంగుళికరణిఁ బరిహరణీయుఁడునయ్యె. వేయేల!

పంచభూతముల కారణసామగ్రినే సేకరించి ప్రజాపతి యాప్రజాపతిని సృజించెనని ఘంటాపథముగాఁ జెప్పవచ్చును. కావుననే యాతనిగుణ గణంబులన్నియుఁ బరప్రయోజనార్థమముఖ్యముగ వినియుక్తములగు చుండెను. సముద్రకూలంబులే ప్రాకారంబులుగను, సాగరంబులేయగడ్తలుగను గలిగి యనన్యశాసనంబైన యనంతావలయంబెల్ల నాసార్వభౌముఁడనాయాసంబుగ నేకపురింబోలెఁ బాలించెను. దాక్షిణ్యంబున రూఢమైన సుదక్షిణయను నామంబుగల మగధవంశసంజాత యారాజేంద్రునకు యజ్ఞనామక గంధర్వునకు దక్షిణయను నప్సరసవలె సహధర్మచారిణిగానుండెను. అంతఃపురకాంతాజనంబు లెందఱున్నను నిజచిత్తానువర్తినియగు సుదక్షిణాదేవిచేతను వసుమతీరాజ్యలక్ష్ముల చేతనుమాత్రమే తాను గళత్రవంతుఁడనయితినని యావసుధాధిపుఁడు భావించుకొనెను. అనురూపమైన యాసుదక్షిణాదేవివలనఁబుత్రుఁ బడయఁగోరి యాపుడమిఱేఁడు మిక్కిలి యువ్విళ్లూరుచుండెను. కాని యాఫలంబుగలుగక యాతనికి రిత్తయాసలతోనే కాలము గడచిపోవుచుండెను. సకలసంపదాఢ్యులగు రాజన్యమూర్ధన్యులకైనను బిడ్డలు లేని బ్రదుకు లేబరముగదా! తుదఁకు బుత్రార్థము వ్రతానుష్ఠానము చేయఁగోరి యాదిలీపసార్వభౌముఁడు తనభుజముల నధివసించిన భూభారమునెల్ల సచివసత్తములకప్పగించెను. తరువాత నా రాజదంపతులు నియమవ్రతులై, పుత్రేచ్ఛమై భక్తితో విరించి నారాధించి, స్నిగ్ధగంభీర నిర్ఘోషమగు నేకరథమును, వర్షాకాలమేఘమును విద్యు *దైరావతములువలె నధిష్ఠించి కులగురుండగు వశిష్ఠమహాముని యాశ్రమంబునకుఁ బ్రయాణమైరి. ఆశ్రమంబులకు సమ్మర్దము గలుగకుండఁ బరిమితపరివారమునే వారు వెంటఁగైకొనిరి. కాని వారినావరించి యుండు తేజోవిశేషమే వారికి వేయిసేనలపెట్టుగానుండెను. మంద

* ఐరావతమనఁగా నొకవిధమైన యింద్రధనుస్సు.

మలయానిలుఁడు మెల్లమెల్లన వృక్షపంక్తులను గదల్చుచు, మనోహ
రసురభిళకుసుమపరాగముల వెదఁజల్లుచు, సర్జతరునిష్యంద గంధవ
హుఁడై సుఖస్పర్శముల వారిని సేవించుచుండెను. రథనేమిధ్వనులను
మేఘగర్జనంబులని శంకించి మయూరసంతతులు శుద్ధవికృతిభేదంబుల
ద్విధా భిన్నంబులై షడ్జస్వరసదృశంబులగు మనోహరకేకారవంబుల
వారికి శ్రవణానందమొనర్చుచుండెను. హరిణమిథునంబులు మార్గ
మునుండి యించుకతొలంగి యారాజదంపతులు తమయందుఁ బరస్ప
రాక్షిసాదృశ్యమును గనుంగొని యానందించునటులు స్యందనంబునం
దదృష్టులు సారించి వారిని విలోకించుచుండెను. స్తంభరహితములైన
తోరణమాలికలోయన గగనతలంబున బారులుతీరి యేఁగు సారస
వారంబులు కలకూజితంబుల వారినెడనెడ నున్నమితానములుగ నొన
ర్చుచుండెను. తురగఖురోద్ధూత పరాగంబు లాదంపతుల యలకాక్ష్ణి
పంబులకుఁ దగులకుండు వితమున గంతవ్యదిగభిముఖుండై యనుకూ
లముగ వీచుచు మందానిలుఁడు కార్యసిద్ధిసి వారికి మునుముంద సూ
చించుచుండెను. సరస్సులందలి యరవిందబృందములు తన్నిశ్వాసము
లననుకరించు తరంగసంక్షోభ శీతలామోదంబులచే నాజాయాపతు
లకు ఘ్రాణేంద్రియామోదమొసంగుచుండెను. ఆరాజదంపతులొసం
గిన యూపస్తంభచిహ్నితాగ్రహారముల యజ్వశ్రేష్ఠులు వారికర్ఘ్యా
దికములొసంగి యమోఘాశీర్వచనంబులఁ గావించుచుండిరి. అంతహై
యంగవీనంబులతో నేతెంచిన వృద్ధగోపకుల నాయావన్యవృక్షముల
నామంబులనడిగి తెలిసికొనుచు, శిశిరావసానమునఁ జైత్రపూర్ణిమ
యందుఁ బ్రకాశించు చిత్రానిశాకరులవలె నుజ్జ్వలనైపథ్యవిశేషం
బుల ననిర్వాచ్యశోభావిరాజితులయి యారాజదంపతులు ప్రయాణ
మును సాగించుచుండిరి. ప్రియదర్శనుండును వస్తుపరిజ్ఞానంబున బుధ
సన్నిభుండును నగు నాదిలీపభూవిభుఁడు మార్గమందలి యాయావిశే

షంబుల నిజపత్నికిఁ గనఁబఱుచుచుఁ జాలదూరము దాఁటివచ్చినసంగతికూడ నెఱుఁగఁడయ్యెను. రథాశ్వములు మార్గాయాసఖిన్నములగుడు సాయంసమయమునకు మహిషీసహితుండయి యనన్యలభ్యయశుండా రాజచంద్రుఁడు నియమవంతుఁడైన వసిష్ఠమహర్షి యాశ్రమంబును జేరెను.

ఆసమయంబున వనాంతరమునుండి సమిత్కుశఫలంబులఁగొని తేరనేఁగి తిరిగివచ్చుచున్న తాపసుల దృశ్యములయి త్రేతాగ్నులు ప్రత్యుత్థానమొనర్ప నాశ్రమంబును జేరుచుండిరి. మునిపత్నులచే నిజాపత్యంబులువోలె గారామునఁ బెంపఁబడి నీవారభాగధేయంబుల కలవాటుపడినవగుట హరిణజాలంబులు మూఁగుచుఁ బర్ణశాలాద్వారంబుల నిరోధించుచుండెను. ఆశ్రమవృక్షమూలములకు నీళ్ళుపోసి మునికన్యకలు తదాలవాలాంబువులఁ ద్రాగు విహంగంబులకు విశ్వాసముగలుగునటులు వెంటనే వానినివిడిచి పోవుచుండిరి. ఎండపోయినపిమ్మట నుటజాంగణంబులఁ బ్రోవుచేయఁబడిన తృణధాన్యంబుల మీఁదఁబరుండి కురంగకుణకములు నెమరువేయుచుండెను. పవమానోద్ధూతంబులై ప్రజ్వలిత హోమాగ్నిసూచకంబులై యాహుతిసౌరభంబుల వెదఁజల్లుచు ధూమంబులాశ్రమోన్ముఖులగు నతిథిజనంబులఁ బవిత్రముసేయుచుండెను. తదనంతరమామహారాజు రథాశ్వముల శ్రమము నివారింపుమని సారథి కాజ్ఞయొసంగిఁ భార్యను దేరినుండి దింపి తరువాతఁ దానును దిగెను. అంతట నాయాశ్రమమందలి సభ్యులు నిర్జితేంద్రియులునగు మునీశ్వరులు, రక్షకుఁడును శాస్త్రములే లోచనములుగాఁగలవాఁడును నగు నాదిలీపునిఁ బత్నీసహితుని సమ్యగ్విధిని బూజించిరి. సాయంకాలోచిత జపహోమాద్యనుష్ఠానానంతరము పతివ్రతామతల్లియగు నరుంధతీదేవిచే నుపాసితుఁడైన తపోనిధి నావశిష్ఠసంయమీంద్రుని, "స్వాహాదేవిచేఁ బూజితుండగు

హవ్యవాహనునింబోలె నా రాజశ్రేష్ఠుఁడప్పుడు మాగధియు రాజ్ఞి యునగు సుదక్షిణాదేవితోఁగూడ సందర్శించి యాదంపతుల చరణారవిందములకు సాష్టాంగనమస్కారమొనర్ప, వారిరువు రా రాజదంపతుల సంతోషపూర్వకముగ నాశీర్వదించిరి. అనంతర మాతిథ్యక్రియలవలన రథక్షోభపరిశ్రమమునుండి శాంతినందిన యా రాజ్యాశ్రమమునిని, దిలీపుని వశిష్ఠమునీంద్రుఁడు రాజ్యమందలి కుశలమునుగూర్చి ప్రశ్నించెను. శత్రుపురవిజేతయు, మహావక్తయు నగు నాయర్థపతి యంత నథర్వణవేదపారగుండగు గురునెదుట నిలువంబడి యర్థవంతములగు వచనంబుల నిట్లు సవినయముగఁ జెప్పఁదొడంగెను.

"గురువరా! సర్వజ్ఞుఁడవగు నీకగోచరంబేమికలదు. జల, హుతాశన, వ్యాధి, దుర్భిక్ష, మరణంబులను పంచవిధ దైవికదుఃఖంబులకును, మంత్రి, చోర, శత్రు, రాజవల్లభ, రాజలోభంబులవలనఁ గలుగు పంచవిధ మానుషభయంబులకును నివారకుండవు నీవున్నంత కాలము నాసప్తాంగముల కెల్లఁ గుశలమే. మంత్రకర్తవగు నీమంత్రంబులు నాశత్రువుల నెల్లఁ బరోక్షమంద తెగటార్చి కేవలప్రత్యక్షలక్ష్యభేదనసమర్థంబులగు నాశరంబులను దోసిరాజనుచున్న వి కావున భవన్మంత్రసామర్థ్యంబు నవే నాపౌరుషము ఫలించుచున్నది. హోతవగు నీవు యథాశాస్త్రముగ నగ్నియందు వేల్చు హవిస్సువలన సస్యానుకూలముగ వర్షములు గురియుటచే నారాష్ట్రమం దవగ్రహాది బాధలు లేకున్నవి. ఈతిబాధలులేక నాప్రజలెల్ల భయవిరహితులై సంపూర్ణాయుష్మంతులై శతవత్సరంబులు సుఖంబున జీవించుచున్నారు. దీనికంతకు భవదీయ బ్రహ్మవర్చసమేకదా కారణము! పెక్కుమాటలేల? బ్రహ్మపుత్రుండవగు నీచే నాపదలఁబారయకుండ సర్వవిధముల రక్షింపఁబడు నాసంపదల కెన్నఁడైనను విచ్ఛిన్నత గల్గునే? వేవెలుంగు వేయికిరణంబుల వెలుంగుచుండ నంధకారములో

కమునావరింపఁగలదే? కాని యోతండ్రీ! ఈనీకోడలగు సుదక్షిణ వలన ననురూప పుత్త్రరత్నము గలుగనందున ద్వీపవతియు రత్నగర్భ యు నయ్యు నీమేదినీసతి నాకు సంతోషమును గూర్పకున్నది. నాయనంతరము నాపితృదేవతలు తమకుఁ బిండప్రదానము చేయువా రులేరను శంకచేత శ్రాద్ధకర్మములందు నేనొసంగు తర్పణములను సం తృప్తిమై భుజింపక కొంతమిగిల్చికొని ముందునకు సంగ్రహించుకొ నుచున్నటులు నిశ్చయముగఁ దోఁచెడిని. మఱియు వారు మదనంత రము తర్పణాంబువులు తమకు లభింపవనియెంచి నాయొసంగు తిలో దకంబుల దుఃఖజనిత నిశ్వాసంబుల మందోష్ణములుగ నొనర్చి పాన ముచేయుచున్నారని నేఁదలంచుచున్నాఁడ. కావున నేను యజ్ఞాద్యా చరణంబుల విశుద్ధాత్ముఁడనై దేవతలఋణముతీర్చి ప్రకాశించుచుం డినను, సంతానాభావంబున నిమీలితుండనై పితౄణవిముక్తుఁడను గామిఁ బ్రకాశింపక, సూర్యకిరణసంపర్కమున నంతఃప్రకాశముగలిగి బాహ్యాంధకారపరీతమైన లోకాలోకపర్వతమువలె నున్నాఁడను. తపోదానాదులవలనఁగలుగు సుకృతము కేవలాముష్మికసుఖప్రదంబ. శుద్ధవంశజాతసంతానమన్ననో యైహికాముష్మికసుఖంబుల రెంటిని ఘటించును. కావున నోవిధాతా! నీవు స్వయముగ నీరుపోసి ప్రోది చేసినను ఫలోదయమును గానని యాశ్రమవృక్షకంబువలె నున్న నన్నిట్లుగాంచియు డెందమునఁ గొందలమందకుంటివే? సమర్థుఁడవ య్యు నిట్లుపేక్ష సేయఁదగునే? మజ్జనరహితంబైన గజంబునకు బంధన శృంఖల మర్మభేదకంబగునటులు సంతానరహితుఁడనైన నాకంత్య మగు నీపితౄణము దురంతదుఃఖజనకంబగుచున్నది. కాఁబట్టి తండ్రీ! యీఋణమునుండి యెట్లు విముక్తుఁడనగుదునో నీవ చింతింపవలెను. ఇక్ష్వాకువంశజులకు దుర్లభంబులైన కార్యంబుల సాధించు సాధనము లెల్ల నీయధీనములుగదా?"

ఈవిధంబున దిలీపుఁడు విన్నవింప వశిష్ఠుఁడు ధ్యానస్తిమితలోచనుండై యించుకసేపు మీనములు నిద్రించుచున్న సరోవరంబువలె నిశ్చలత్వమును భజించెను. అంత నామునివతంసుఁడు ప్రణిధానంబున విశుద్ధచిత్తుఁడయి దిలీపుని సంతాననిరోధమునకుఁ గారణము నెఱింగి యాతనికిట్లు చెప్పఁదొడంగెను.

"వత్సా! పూర్వమొకప్పుడు స్వర్గలోకంబున నింద్రుని సేవించి తిరిగి భూలోకమునుగూర్చి పోవుచుంటివి. అప్పుడు నీమార్గమందుఁ గల్పతరుచ్ఛాయఁ గామధేనువు పరుండియుండెను. ఋతుస్నాతయైన నీభార్య నప్పుడభిగమింపనిచో ధర్మలోపంబగునను భయంబున నామెను దలఁపోయుచు నాతురతమైఁబోవుచుఁ బూజార్హమైన యావేల్పుమొదవునకుఁ బ్రదక్షిణాది సత్కారముల నాచరింపవైతివి. అందులకాకామగవి గినిసి "నీవిపుడేఫలంబునపేక్షించి పోవుచుంటివో యాసంతానఫలము నన్నుఁ దిరస్కరించి యేఁగుకారణంబున నాసంతతిని బూజించినఁగాని నీకుఁ గలుగకుండుఁగావుత" మని నిన్ను శపించెను. ఆసమయంబుననే వియద్గంగాప్రవాహంబున నొక మత్తదిగ్గజము కేళిసల్పుచు ఘీంకారమొనర్చుచుండెను. ఆధ్వనిమూలమునఁ దచ్ఛాపము నీకుఁగాని నీసారథికిఁగాని కర్ణగోచరము కాలేదు. కాఁబట్టి యాకామధేనువునకొనర్చిన యవజ్ఞయే నీకు సంతానప్రతిబంధకమైనదని గ్రహింపుము. పూజ్యులఁ బూజింపక తిరస్కరించుట శ్రేయోభంగకరము గాదె? అపరాధశాంతికై పోయి యాధేనువును బూజింతునన్న నీకిప్పుడది లభ్యము కాదు. పాతాళలోకంబున వరుణుఁడొనర్చుచున్న యొక దీర్ఘయాగమునకు హవిస్సును సేకరించుటయందది నియోగింపఁబడియున్నది. పాతాళద్వారమన్ననో క్రూరభుజంగనిరుద్ధమై దుష్ప్రాపమైయున్నది. కావున నాయొద్దనున్న దాని పుత్రికను దత్ప్రతినిధిగా నొనర్చి విశుద్ధచిత్తముతోఁ బత్నీసహితుండవై పూజింపుము. నీకోరికల సంతోషముతో నది ఫలింపఁజేయును"

ఈవిధంబున వశిష్ఠుఁడు వచించుచుండఁగనే యాతనికాహుతి సాధనమై పవిత్రమైన నందినీధేనువు వనమునుండి యాశ్రమమునకు మరలివచ్చుచుండెను. పల్లవస్నిగ్ధపాటలంబగు లలాటంబున నుదయించిన యాపద్వక్రశ్వేతరోమాంకంబున నూత్నచంద్రికతోడి సంధ్యవలెఁ బ్రకాశించుచు వత్సాలోకనప్రస్రుతంబును, అవభృథస్నానాధికపవిత్రంబును, కవోష్ణమును నగు క్షీరనిష్యందనంబున భూమిని దడుపుచుఁ గుండవంటి పొదుగుతో నా మొదవు వచ్చుచుండెను. ఆ ధేనుఖురంబుల నుద్ధూతంబులైన రజఃకణంబులు సమీపముననున్న యామహీజానిగాత్రంబును స్పృశించుచు నాతనికిఁ దీర్థాభిషేకజనిత పవిత్రత నొసంగుచుండెను.

శకునాభిజ్ఞుండును దపోనిధియు నగు వశిష్ఠుఁడు పుణ్యదర్శనమైన యా ధేనువును విలోకించి యమోఘమనోరథుఁడును దనకు యాజ్యుఁడు నగు దిలీపునితో "రాజోత్తమా! నామధేయకీర్తనకాలమునందే కల్యాణమూర్తియైన యీగోవు వచ్చియుండుటచే నీకార్యసిద్ధి త్వరలోనగునని తలంపుము. కావునఁ గందమూలఫలాదుల జీవించుచు మనోరథమీడేరుదనుక ననుగమించుచు, విద్యార్థి యభ్యాసవశంబున విద్యనుంబోలె, దీనిఁ బ్రసన్నఁగా నొనర్చికొనుము. ఈ సౌరభేయి వెడలునపుడు వెడలుచు, నిలుచునపుడు నిలుచుచుఁ గూర్చుండునపుడు కూర్చుండుచు, నీరుద్రావునపుడు నీరుద్రావుచు సర్వవిధముల ననుసరింపుము. నీసహధర్మచారిణియు భక్తిమతి నియమవతియునై గంధమాల్యాదులతో దానిని బూజించి ప్రాతఃకాలమున నాశ్రమమునుదాఁటి వెడలువఱకు వెంటనేఁగుచు సాయంకాలమది యాశ్రమోన్ముఖమై వచ్చునపుడెదురేఁగి తీసికొనివచ్చుచుండవలెను. ఏతద్విధంబున నా ధేనువునకనుగ్రహము గలుగుదనుకఁ దత్సేవాపరతంత్రుఁడవై యుండుము. నీకవిఘ్నసిద్ధియగును. నీతండ్రి

వలె నీవును సత్పుత్రవంతులలో నగ్రగణ్యుండవగుదువు." అని యాదేశించెను.

జ్వలనసన్నిధానమున హేమావసానమున నిట్లు శాసించు గురువరునకు దేశకాలజ్ఞుఁడైన యాసచ్ఛాత్రుఁడు భార్యాసమేతుఁడై సంప్రీతితో వినయపూర్వకముగఁ బ్రణామమొనర్చి వల్లెయని యాతని యాజ్ఞను నౌదలధరించెను. అంతఁ బ్రదోషకాలంబగుడు దోషజ్ఞుఁడును సత్యభాషణుఁడును బ్రహ్మపుత్రుండును నగు వశిష్ఠుండు స్థిరశ్రీయుతుండైన యామనుజేశ్వరునకు శయనింపుమని యానతిచ్చెను. తపోమహిమవలన రాజోచితములైన భోజనాదిసత్కారముల ఘటింప సమర్థుఁడయ్యు వ్రతచర్యాప్రయోగనిపుణుండగు నమ్మైత్రావరుణుండు నాఁటినుండియే గోసేవావ్రతమును శిష్యునిచే నవలంబింపఁ జేయఁదలంచి వన్యవస్తువులతోడనే యాతనికి భోజనశయనాదుల సమకూర్చెను. అవ్యాజవాత్సల్యధుర్యులగు గురువర్యులు శిష్యుల శ్రేయోఽభివృద్ధికిఁ గాలవిలంబమును సహింపరుగదా! అంతఁదేజోఽద్వితీయుండౌభూవరుండు ద్వితీయాద్వితీయుండై కులపతియగు గురువరునిచే నిర్దిష్టమైన పర్ణశాల నారాత్రినిద్రించి యపరరాత్రంబున నాశ్రమమందలి శిష్యజనంబులొనర్చు వేదపఠనము నిశావసానమును సూచింపఁ బ్రబోధితుండయి కుశశయనమునుండి లేచెను.

## —* ద్వితీయ ప్రకరణము *—

తెల తెల వేగుచుండెను. నిజకులదీపకుఁడగు దిలీపుని సంతాన వ్రతదీక్షను గనుఁగొని వచ్చుట కినుఁడు పనుపఁగా రాగమున వేంచేసిన వేగులోయనఁ బూర్వదిశను సంజకెంజాయలు నేత్రపర్వమొనర్చుచుండెను. దిలీపుని సంతానాభావంబుకతన విచారసాగరమగ్నుఁడైన లోకబాంధవునకు సమాసన్నంబగు నామహారాజు సుపుత్రోదయంబును వచించుచున్నవోయన శకునసంతతులు శ్రవణపేయముగఁ గలకూజితములొనరించుచుండెను. తచ్ఛుభశకునాకర్ణనంబున నాప్రభాకరుండు రాగాధికుండయి పట్టరానిసంతసంబునఁ బొడుపుఁగొండ నెక్కి, నిజవంశంబింకఁ దరింపఁగలదను నాస మనంబున మల్లడిగొనఁ దానింక లోకంబునఁ దలయెత్తి తిరుగవచ్చునని ముచ్చటపడి లోకప్రయాణోన్ముఖుండగుచుండెను.

అంత వశిష్ఠుని హోమధేనువును సుదక్షిణాదేవి గంధమాల్యాదులతోఁ బూజించెను. యశోధనుండగు దిలీపమనుజేశ్వరుండును దూడను బాలుద్రావించి కట్టివేసి, తనభార్యయొసంగు సపర్యను దయతోడ స్వీకరించిన యాగోవును వనమునకుఁ బోవిడిచెను శ్రుత్యర్థము ననుసరించు మన్వాది స్మృతివచనమువలె నంత నపాంసులాగ్రగణ్యయగు నమ్మానవేశ్వరుని ధర్మపత్నియు నాధేనువు ఖురన్యాసంబులఁ బవిత్రపాంసువయిన మార్గముననుగమించెను. అట్లాశ్రమసీమపర్యంతమేఁగినపిదప భార్యను వెనుకకుమరలించి, దయాళుండును యశోఽభిరాముండును నగు నారాజచంద్రుఁడు పయోధరీభూతచతుస్సముద్రయై గోరూపధారిణియైన ధారిణియోయన నొప్పు నాధేనువును గాపాడుచుండెను. వ్రతదీక్షమై నాగోవు ననుసరించి రక్షించు నాశౌర్యధుర్యుండు శేషించియున్న యనుచరవర్గంబునైనను స్వరక్షణార్థము

వెంటఁగొనక నివారించెను. అతనిశరీరపరిరక్షణ మొనర్ప నితరు లెవరు సమర్థులు? మనువంశసంభవు లెల్లకాలము స్వపరాక్రమరక్షితులు గదా! రసవంతములగు తృణకబళంబుల నొసంగుచుఁ గండూయనంబుల మేని కండూతి నపనయించుచు మీఁదవ్రాలు వనమక్షికంబుల నివారించుచు నాగోవున కప్రతిహతస్వచ్ఛందగమనంబులఁ గలుగఁ జేయుచు నాసార్వభౌముఁడు తత్సమారాధనయందాసక్తుఁడై యుండెను. గోపాలసన్నిభుఁడా భూపాలుఁడు కార్యార్థియై గోపాలుఁడగుట యబ్బురము కాదుగదా? ఆగోవు నిలిచినప్పుడు నిలుచుచుఁ జనునపుడు చనుచుఁ గూర్చుండునపుడు పద్మాసనమున స్థిరముగఁ గూర్చుండుచు జలములఁ గ్రోలునపుడు జలములఁగ్రోలుచు నాభూవరుండు దానిని నీడవలె ననుసరించుచుండెను. రాజచిహ్నముల నెల్ల విడిచియున్నను దేజోవిశేషంబున నాతఁడు రాజ్యలక్ష్మిని ధరించినట్లుండె మదజల రేఖలు బయటికిఁ గాన్పింపకున్నను నంతర్మదావస్థమగు భద్రద్విపేంద్రమువలె నొప్పుచుండెను. లతాప్రతానంబులఁ గేశబంధమొత్తికట్టి, విల్లెక్కుపెట్టి యాభూపాలోత్తముఁ డాహోమధేనువును గాపాడు నెపంబున దుష్టవన్యసత్వంబులఁ దెగటార్చువాఁడుంబోలె నాయరణ్యమున సంచరించుచుండెను. ఇట్లు పార్శ్వానుచరుల నెల్ల వీడి యేకాకియై చరించు నాపాశభృత్సమానునిఁ బార్శ్వములనుండు వృక్షసంతానములు మదోత్కటవిహంగవిరావంబుల "జయజయ! మహారాజ! అల్లన నావిశేషంబుల విలోకింపుము" మన్నగు శబ్దంబుల నాతని యనుచరులకు మాఱుగ సంబోధించుచున్నవోయనఁ గానవచ్చుచుండెను. వాయుసంచలితములైన బాలలతలు దమసమీపమున వాయుసఖుండగు నగ్నివలెఁ బ్రకాశించుచుఁ జనుచున్న యాపూజనీయుని మూర్ధముపైఁ బౌరకన్యకలు వాడుకప్రకారము లాజలుచల్లునటులు కుసుమవిసరంబులఁ జల్లుచుండెను. తమ నిర్భీతాంతఃకరణంబులే యా

మహారాజు దయార్ద్రభావంబును దెలియఁజేయుచుండ, హరిణీసముద యంబులు ధనుర్ధరుఁడై యున్నను నాతని సుందరవిగ్రహమును దమి మీఱ నవిలోకించుచు విశాలనేత్రములఁ గలిగియున్న ఫలము నాఁడను భవించెను. వాయుపూరిత రంధ్రంబుల మనోహరస్వనంబులు గావించు కీచకంబులు సుషిరవాద్యకృత్యము నాపాదించుచుండ, నికుంజముల నుండి వనదేవతలుచ్చైస్స్వనంబున శ్రవణపేయముగ నొనర్చు నిజ యశోగీతము లాయశోవిశాలునకు వినవచ్చుచుండెను. గిరినిర్ఝర శీకరంబులఁ జల్లనగుచు, ఆకంపితతరుపుష్పసౌరభంబులఁ గొల్లగొ నుచు మందమలయానిలము వ్రతార్థము ఛత్రరహితుండై సంచరిం చుట నాతపఖిన్నుండగు నయ్యాచారపవిత్రుని సేవించుచుండెను.

ఆలోకరక్షకుఁడు వనంబున నడుగువెట్టఁగనే దవాగ్నివర్షము లేకయు చల్లాఱెను. వన్యసత్వంబులలోఁగూడ బలవంతములగు వ్యా ఘ్రములు దుర్బలంబులగు కురంగాదులను హింసింపమానెను. సర్వ సమదృష్టిగల భూపాలోత్తముల పాలనంబున వ్యక్తిజీవనంబున న్యా యతాధిక్యములు వెలయనేరవుగదా? పల్లవరాగతామ్రములగు నా మహర్షి ధేనువును సూర్యకాంతియుఁదమసంచారములచే దిగంతములఁ బవిత్రములుగ నొనర్చి యంతట నిలయమునకేఁగ నారంభించెను. నిజక్షీరంబుల దేవపితృతర్పణంబుల నొనగూర్చు నాధేనువుననుస రించి యామధ్యమలోకపాలకుండును నేఁగుచుండెను. సాధుసంభా వ్యుఁడైన యామహారాజుతోఁగూడిన యాగోరాజము సాధుసమ్మత మైన విధితోఁగూడిన యాస్తిక్యబుద్ధివలె విలసిల్లుచుండెను. ఆసమయ మునఁ బడియలనుండి నిర్గమించు వరాహయూధములతోడను నిజా వాసవృక్షముల కభిముఖములై పోవు శిఖండిమండలములతోడను శాద్వలతలముల నధివసించిన కృష్ణసారములతోడను నొప్పుచు శ్యా మాయమానములగు విపినప్రదేశముల విలోకించుచు నారాజ

ముఁడరుగుచుండెను. ఆపీనభారమున నద్ధేనువును సమధికశరీరగౌరవమున నబ్బూరమణుఁడును మందమందముగఁ జనుచు సుందరగమనంబులతోఁ దామేఁగుతపోవనమార్గము నలంకరించుచుండిరి.

గురువరుని ధేనువు వెంబడి వనంబునుండి మరలివచ్చు నిజవల్లభుని, వనితామతల్లియగు సుదక్షిణాదేవి యుపవాసమొనర్చువారధికతృష్ణమై జలంబులఁగ్రోలుమాడ్కి నిమేషాలసపక్ష్మపంక్తులగు లోచనంబులతోఁ దమిమీఱ విలోకించెను. అట్లా దారిలో హృదయేశ్వరుముందట నేఁగుదెంచు నాధేనువున కభిముఖయై యావనితామణి యెదురేఁగెను. ఆదంపతులిరువురనడుమఁ బొలుచు నాగోవహోరాత్రిమధ్యగతమగు సంధ్యవలెఁ బ్రకాశించెను. అక్షతపాత్రి హస్తమున ధరించి పయస్వినియగు నామొదవునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి యప్పుడాసుదక్షిణాదేవి తన మనోరథసిద్ధిద్వారంబునుం బోలె దాని శృంగాంతరప్రదేశమును బూజించెను. దూడయొద్దకేఁగుట కధికోత్కంఠగలిగియున్నదయ్యు నాసౌరభేయి నిశ్చలయై యామె చేయు సపర్యను స్వీకరింప నాదంపతు లపరిమితానందమున నోలలాడిరి. ఏతాదృశమహనీయులప్రసాదచిహ్నములు భక్తవరులకుఁ బురోగతఫలప్రదంబులుగదా? భుజనిర్జితశాత్రవుం డాభూధవుండంత వశిష్ఠారుంధతుల పదపద్మముల కభివాదనమొనర్చి, సాంధ్యవిధులఁ దీర్చి, దోహావసానంబునఁ బరుండియున్న యాదోగ్ధ్రీవతంసమును మరలసేవించెను. కర్మపరాయణులగుధీరుల కుద్దిష్టకార్యేతరప్రవృత్తి కలుగనేరదుగదా? భార్యాద్వితీయుండై యానరపాలోత్తముఁడు నిషణ్ణయైయున్న యాధేనువుసమీపమున నుపహారంబులను దీపంబులను నుంచి దానిననుసరించి కూర్చుండి యాగోవు క్రమముగ నిదురింపఁగ నిదురించి ప్రభాతమగుడు మేల్కొని లేవఁగఁ దానును నిద్రచాలించి లేచెను. దీనజనావనపరుండగు నామహనీయయశస్కుండు మహిషీసమే

తుండై సంతానార్థ మిట్టిధంబున గోసేవావ్రతము నవలంబించి యిరువదియొక్క దినంబులు గడపెను.

యథాప్రకార మరణ్యమునకుఁ బోయినతరువాత నామఱునాఁ డా ధేనువు నిజానుచరుండగు నామానవాధీశ్వరు నిశ్చలభక్తిని బరీక్షింపఁగోరి గంగాప్రపాతసమీప దేశమున లేఁబచ్చికపట్టిన యొక హిమగిరికందరంబునఁ బ్రవేశించెను. పూజనీయమగు నద్ధేనువు ఘాతుకమృగంబులకు మనమ్మునన్నైనఁ జెనకరానిదని నెమ్మదిని నమ్మిన వాఁడగుట నమ్మేదినీవల్లభుఁడప్పు డాశీతనగశోభను దదేకదృష్టితో వీక్షించుచుండెను. ఆసమయంబున నారాజునకగపడకుండఁగనే యొక హర్యక్షము హఠాత్తుగ లంఘించి యాగోరాజమును బలాత్కారముగఁబట్టి యీడ్వఁగ నంబాయని యాధేనువొనర్చిన యాక్రందనము గుహానిబద్ధమై దిక్కులుపిక్కటిల్లఁ బ్రతిశబ్దముల నీనెను. ఆర్తరక్షకుఁడైన యామానవేంద్రున కాయార్తారవము వినవచ్చి నగేంద్రసక్తమైన యాతనిదృష్టిని బగ్గములుపట్టి యీడ్చినట్లు నిముసములో మరలించెను. ధనుర్ధరుండైన యాభూవరుండట్లు దృష్టిమరల్చి చూచునంతలో గైరికాదిధాతుమయమైన కొండనెత్తముమీఁదనుండు లోధ్రద్రుమంబువలె నానందినీధేనువుపై నొకకేసరి యాతనికి నేత్రగోచరమయ్యెను. మృగేంద్రగామియు, సాధుశరణ్యుఁడును, బలాత్కారమున వైరులఁబరిమార్చువాఁడును నగు నానరవరుం డుద్భూతపరాభవానలదహ్యమానుఁడై తత్క్షణమామృగేంద్రమును వధించుటకుఁ దూణీరమునుండి బాణమును దివియఁ బ్రయత్నించెను. కాని నఖప్రభారుద్ధకంకపత్రమైన సాయకపుంఖమునంద యంగుళులు సక్తమయి యాప్రహరణశీలుని దక్షిణహస్తము స్తబ్ధమై బాణమును దివియుచున్నట్లు చిత్రించినదానింబోలియుండెను. బాహుప్రతిష్టంభమునఁగోపము ప్రవృద్ధంబగుచు నప్పుడమిఱేఁడు మండిపడుచు, మంత్రౌషధరుద్ధవీర్యం

బగు భుజంగమునుబోలి సమీపస్థుఁడై యున్నను శత్రువును స్పృశింపఁజాలని నిజతేజంబుచేతనే లోలోన దహింపఁబడుచుండెను.

ఇట్టిభుజస్తంభనవృత్తివలన విస్మితుఁడై చూచుచున్న యాసింహబలుని, ఆర్యపక్షపాతిని, మనువంశకేతనుని గనుంగొని ధేనువునుబట్టిన యాసింహమాతఁడు మఱింతయక్కజపడునటులు మనుష్యవచనములతో నిట్లు పలుకదొరఁకొనెను.

"ఓమహీపాలా! శౌర్యనిధీ! నీయూపడ్డపాటుచాలుఁజాలు. ఏల వృథాశ్రమపడెదవు? నామీఁదఁ బ్రయుక్తమైనను నీశరమ్ము వమ్మగును. ప్రభంజనునివేగంబు పాదపంబుల నిర్మూలింపఁగలదుగాని శిలోచ్చయంబుల నించుకేనియుఁ జలింపఁజేయలేదుకదా! అష్టమూర్తికింకరులలో నొకనిగా నన్నెఱుంగుము. నాపేరు కుంభోదరుఁడందురు. పార్వతీదేవికి వాహనమైన నికుంభునకు సత్వమున సమానుఁడను. వెండికొండవలె వెల్లనైన వృషభమునెక్కునపుడు మహేశ్వరుఁడు నిజచరణార్పణపరిపారంబున నాపృష్ఠమును బవిత్రముసేయును. ముందటనున్న యీదేవదారువృక్షమును జూచితివిగదా! నందివాహనునిచే నిది పుత్రవాత్సల్యముతోఁ జూడఁబడుచున్నది. మఱియుఁ గుమారునివలె హైమవతీహేమకుంభస్తననిస్సృతపయోరసంబుల నీయగంబుగూడఁ గ్రోలియున్నది. ఒకప్పుడు వన్యగజంబొకండీచెట్టునఁ దన చెక్కిలిరాచుకొనుటచే దీనిపట్టయూడిపోయెను. అప్పుడు గిరిరాజకన్యక దీనినిజూచి రక్కసులకఱకుటమ్ములఁ గాసిలిన కార్తికేయునిఁ గాంచినట్లెంతయో చింతించెను. అప్పటినుండియు నడవియేనుఁగుల కడలుకలుగుటకయి సింహరూపముదాల్చి నాసమీపమునకువచ్చు సత్వంబులఁబట్టి పొట్టపోసికొనుచు నీశైలకందరంబునందుండ శూలపాణిచే నియోగింపఁబడితిని. కావున భగవన్నిర్దిష్టమైన కాలంబునకుఁ బ్రాప్తించిన యీధేనుశోణితపారణము క్షుద్బాధాపీడితుఁడనై యున్న

నాకు రాహువునకు సుధాంశుపీయూషంబువోలె లెస్సగా నాఁకలి పోకార్పఁజాలును. కాఁబట్టి యుపాయాంతరములేని నీవిఁక లజ్జపడక మరలిపొమ్ము. నీగురుభక్తిని నీవు బాగుగాఁ బ్రదర్శించితి మే యుంటివి. శక్యముకానిపనికి నీవేమిచేయఁగలవు? రక్ష్యవస్తువును శస్త్రసాహాయ్యమున రక్షించుట యశక్యమైనపుడంతమాత్రమున శస్త్రధారుల కీర్తికి లోపంబు గలుగదు. "యత్నే కృతేయది నసిధ్యతి కోఽత్ర దోష" యని యార్యులు వచింతురుగదా?"

ఇట్లుప్రగల్భంబుగ వచించు నామృగేంద్రుని వచనంబుల విని యామనుజేశ్వరుండు తన బాణశక్తి మహాదేవుని మహిమాతిశయంబుననే యరికట్టఁబడినదని యెఱింగి స్వవిషయకమగు నవమానదుఃఖమును విడనాడెను. ఇంతదనుకఁ బ్రతిబంధకమన్నమాట యెన్నఁడు నెఱుంగని బాణప్రయోగమునందు విఫలప్రయత్నుఁడై వజ్రాయుధమును బ్రయోగింపఁదలఁచి పురశాసనవీక్షణమున జడీకృతుండైన బలశాసనుంబోలు నాశూరాగ్రేసరుండా పంచాస్యమునకిట్లు మాఱు పలికెను.

"మృగేంద్రా! ఈవిధంబున వ్యర్థప్రయత్నుఁడనైన నేనేదివచించినను సామాన్యలోకంబునకది పరిహాసాస్పదంబయగును. కానిసమస్తప్రాణుల మనోగతభావంబుల నెఱుంగు సర్వజ్ఞసేవకుఁడవగు నీయెడ నట్లుగాదని నాహృద్గతభావముల నీకు విన్నవించుచున్నవాఁడ. స్థావర జంగమంబులకెల్ల సర్గసంరక్షణ సంహారహేతుభూతుండగు మహాదేవుఁడు నాకును బూజనీయుఁడే. అతనిశాసనము నాకుఁగూడ నవిలంఘ్యమే. కాని యాహితాగ్నియగు నాగురువరుని యీసర్వస్వము నాకనులయెదుట నశించుచుండఁగా నేనెట్టులు పేక్ష చేయఁగలను? పరమేశ్వరాజ్ఞానువర్తివై యంకగతప్రాణిహననంబున దేహధారణము చేసికొను నీవు ప్రతిభంగముకాకుండ నాదేహమును భక్షించి నీయుం

గదనపనయించికొనుము. దివసావసానంబగుడు నంబాయని యంగ లార్చుచు నీధేనువువత్సంబు దీనికొఱ కెంతయో యుత్కంఠతోనుం డును. తల్లి కాన్పింపనిచో నదికూడ నసురులవిడువఁగలదు కాఁబట్టి యీమహర్షి ధేనువును విడిచి పావనములగు రెండుప్రాణములఁ గాపాడినపుణ్యమునఁ బొమ్ము"

దిలీపుఁడు వచించిన యీపలుకులువిని మందహాసంబొనర్చి నిజదంష్ట్రామయూఖంబుల గిరిగహ్వరాంధకారంబును శకలంబులుగ నొనర్చుచు భూతేశ్వరపార్శ్వవర్తియగు నాసింహరూపుఁ డాయర్థపతితో మగుడ నిట్లనియె.

"నరేంద్రా! ఏకచ్ఛత్రమైన జగతీపాలనంబును, నూతనమైన యౌవనంబును, మనోహరంబగు దేహంబును నింకను నిట్టియనేకసుఖంబులను నీయల్పఫలమునకై విడువఁగోరు నీవు కార్యాకార్యవిచారమూఢుఁడవై కాన్పించుచున్నావు. తన్నుమాలిన ధర్మము, మొదలుచెడిన బేరము నున్నవే? ప్రజాపతీ! నీవు నిజముగ భూతదయాపరుండవైనచో నొక్కసంగతి బాగుగ విచారింపుము. నీప్రాణములనొసంగి యీగోవును రక్షించినచో నీయనంతర మీయొక్క జంతువే సుఖమైయుండును. అట్లుగాక సజీవుఁడవై యుంటివేని సమస్తప్రజల నాపదలనుండి వాపి జనకునివలెఁ గాపాడనోపుదువు. నీవులేనియెడల నెల్లజనులును మృతకల్పులేయగుదురు. కావున నేకప్రాణిరక్షణార్థమ నేకప్రాణ్యపాయంబు నాపాదింపఁ దలంపకుము. మఱియుఁ గొలఁదిధనముగలవారికి ధనహాని గడుంగడు దుస్సహంబగుటచేత నున్నయొక గోవును బోఁగొట్టితివని యపరాధమును సహింపక కృశానుసమానుండైన నీగురుండు ప్రచండకోపమున మండిపడునని తలంకెదుచోఁ గడవలవంటి పొదుగులుగల మొదవులఁ గోటానఁగోట్లొసంగి యామహర్షిని శాంతునిఁజేయ మహారాజునకు నీకు శక్యమేకదా! కాఁబట్టి

నాయుపదేశమును విని సమస్తశుభపరంపరల ననుభవించు నీబలిష్ఠదేహమును రక్షించుకొనుము. అట్లుగాక స్వశరీరరక్షణలోభమునc బవిత్రమైనగోవు నుపేక్షించుటచే నింద్రలోకసుఖములకు దూరుcడ నగుదునని విచారించెదవేని నట్టికొఱమాలినశంక నీకెంతమాత్రముc దగదు. ఏలయన సకలసంపదాస్పదమైనయఖండసామ్రాజ్యము భూతలసంబంధమాత్రంబున సించుక వేఱగుటcదప్ప నన్నివిధముల నింద్రపదవియేయని కోవిదులు వక్కాణింతురు. అట్టిమహాపదవి నీకుc గరస్థమైయున్నదిగదా! కావున నిట్టిసాహసకృత్యమునుండిమరలుము" అని వచించి యామృగేంద్రుcడు విరమింపcగనే గుహాగతుండైన యాతనిప్రతిశబ్దంపు వ్యాజంబున నగేంద్రుcడుగూడ నాయుపదేశమునే సంతోషంబుతో నుచ్చైస్స్వనంబున నామానవేంద్రునకుc గావించెను. మహాదేవానుచరుండు వచించిన యాపలుకులువిని యానరదేవోత్తముcడు సింహాక్రమణంబున భీతనేత్రయై యాతురతతోc దనవైపు దృష్టులు సారించు మహర్షిధేనువును జూచుచు మిక్కిలిదయార్ద్రుcడై సింహమునకిట్లు ప్రత్యుత్తరమొసంగెను.

"ఓమహానుభావా! ఉత్కృష్టమైన 'క్షత్ర' శబ్దము "క్షతము (నాశము) నుండి రక్షించునది" అను వ్యుత్పత్త్యర్థముచే రూఢమైయున్నది. అట్టి శబ్దార్థమునకు విపరీతముగ వర్తించువాcడు క్షత్రియనామమున కర్హుcడగునా? అట్టివానికి రాజ్యమేల? నిందామలినములైన ప్రాణములేల? ఉత్తమక్షత్రియవంశసంజాతుcడనైన నేనట్లుసంచరింపcబాడియే? మఱియు నన్యపయస్వినీశతంబుల నొసంగి వశిష్ఠమహర్షి ననునయింప నెట్లు వీలగును? గులకటాలు గుబ్బెcడైననొక మగటాలికి సమంబులగునా? ఈనందినీధేనువు సామాన్యపుగోవు కాదు. కామధేనువున కెంతమాత్రముc దక్కువదికాదని యెఱుంగుము. ఏతాదృశమహిమాన్వితయయ్యు నిది నీబారికి లోనగుట

యాఘాలాక్షుని శక్తిచేఁగాని నీస్వశక్తిచేఁగాదు. కావున నాయజాగ్రత్తచే నీగుహయందుఁ బ్రవేశించి నీబారికిలోనైన మద్గురువర పవిత్రహోమధేనువును దేహార్పణనిష్క్రయంబునన నీయొద్దనుండి విడిపించుకొనుట నాకు న్యాయము. ఇట్లయినచో నీపారణంబునకును భంగముండదు. పూజ్యుఁడగు వశిష్ఠమహర్షి హోమాదికర్మములకును లోపంబుకలుగదు. ఒకప్రభువును సేవించి స్వామికార్యపరతంత్రుఁడవైన నీకును నాచెప్పఁబోవు ధర్మమెఱుంగనిది కాదు. మహాదేవునానతిచొప్పున నీదేవదారువృక్షమును నీవత్యంతయత్నముతో రక్షించుచున్నవాఁడవుకదా? అట్లే గురుశాసనానువర్తినై యీగోవును సేవించు నాకిది యవశ్యము రక్షణీయము. రక్ష్యవస్తువును నాశమొందించి తానక్షతుఁడై స్వామియెదుట నిలువ సేవకునకు సాధ్యమగునా? అట్లుగాక యోదయానిధీ! అవ్యాజప్రేమంబున నెట్లయిన నన్ను రక్షింప నీకభిప్రాయమున్నచో నాభౌతికశరీరమందభిమానము మాని నాయశశ్శరీరమునందదయాళుండవుకమ్ము. నాయీదేహమును భక్షించి నాయశంబునే రక్షింపుము. రక్తమాంసస్నాయువసాది పంకిలమై వినశ్వరమైన యీభౌతికశరీరమందు నాబోంట్లకాస్థయుండదు. మానవంతులకు మరణముకంటె దుర్యశంబు దుస్సహవేదనాకరంబు. మఱియు సాంగత్యము సంభాషణైకసాధ్యంబని సజ్జనులు వాక్రుత్తురు. అట్టిసంబంధమీవనప్రదేశమున మనకిరువురకు ఘటిల్లినది. కావున నోభూతనాథానుచరా! మిత్రుఁడనైన నాప్రార్థనమును ద్రోసివేయుట నీకుఁ దగదు. సౌహార్దంబుననైన నావిన్నపంబును మన్నింపుము." ✓

ఇట్లుపలికినంతనే యాసింహము వల్లెయని నందినీధేనువునువిడిచిపెట్టెను. తత్క్షణమాదిలీపుఁడు బాహుస్తంభనరహితుఁడై శరమును బాఱవైచి నిజదేహమును మాంసపిండమువలె నామృగేంద్రమున

కుపాయనముగ నర్పించెను అధోముఖుండై శిరమున నుగ్రసింహ నిపాతమున కెదురుచూచు నారాజోత్తముని యుత్తమాంగముపై నాక్షణము దూకాశసంచారులగు పుష్పదంత జీమూతవాహనాదివిద్యాధరుల కరకమలములనుండి పుష్పవృష్టిగురిసెను. అంత "వత్సా! లెమ్ము" అని వినవచ్చిన యమృతోపమానమగు వచనంబున లేచి యానృపవరుండెట్టయెదుటఁ బాలు సేపుచున్న నందినీధేనువును నిజ జననింబోలె నవలోకించెను. సింహమాతని కెచ్చటను గానరాదయ్యెను. ఈయద్భుతవిధానమునకచ్చెరువంది చూచుచున్న యాయవనీపాలునిఁ గనుంగొని యాధేనువు "నాయనా! నీభక్తిని బరీక్షించుటకిదియంతయు నేఁగల్పించినయదియ కాని వేఱు కాదు. నీగురువరుని తపోగరిమంబుకతనఁ గాలాంతకుండైన నాదరిఁ జేరఁజాలఁడు. ఇఁక నడవిమెకములు నన్నేట్లు చెనకఁగలవు? నీగురుభక్తికిని నాయందలి వాత్సల్యమునకును సంతుష్టాంతరంగనైతిని. నీకుఁగావలసిన వరంబు వేఁడుము. నేను కేవలము రుచ్యంబులగు క్షీరంబులేగాక ప్రసన్ననైతినేని భక్తుల సమస్తకామితములు గురియఁజాలుదునని యెఱుంగుము" అని యాదేశించెను. నిజభుజబలంబునన వీరుఁడను విఖ్యాతినొందినవాఁడును యాచకావళిని సమ్మానించువాఁడును నగు నాసార్వభౌముఁడంతఁ గరకమలముల ముకుళించి, వంశకర్తయై శాశ్వతయశంబును గడించు పుత్త్రుని సుదక్షిణాదేవియందనుగ్రహింపుమని యాగోవును యాచించెను. అంత నాపాఁడియావు సంతానమునుగోరు నారాజేంద్రుని వాంఛను దీర్చుటకు వల్లెయని ప్రతిజ్ఞ చేసి "పుత్త్రా! నాపాలుపిదికి పత్త్రపుటముననుంచి పానముసేయుము," అని యాజ్ఞాపించెను. అందులకాతఁడమ్మా! దూడత్రావినపిదపను హోమాక్రియలు నెఱవేఱిన తరువాతను శేషించిన క్షీరములను గురువుగారియాజ్ఞనుబడసి, పాలితావనిషష్ఠాంశమునుంబోలె ననుభవింప నిచ్ఛగింతునని విన్నవింప

మఱింతసంతసించి యాధేనువాతనితో నాశీతనగబిలంబునుండి వెడలి యాశ్రమంబున వశిష్ఠునియాశ్రమంబునకుఁ జనెను.

అంత నానరేంద్రచంద్రుఁడు ప్రసన్నేంద్రముఖుఁడై తనసంతోషచిహ్నంబులవలననే యూహింపఁబడుచున్న యాగోవుననుగ్రహమును బునరుక్తమగునటులు నిజవచనంబుల గురువునకు నివేదించి తరువాతఁ దనహృదయేశ్వరికిఁ జెప్పెను. అనంతరము గురునాజ్ఞను బడసి సాధువత్సలుండగు నాయనిందితాత్ముఁడు వత్సహుతావశేషమైన యానందినీస్తన్యము నత్యాసక్తితో మూర్తీభవించిన విశుద్ధయశంబునుంబోలెఁ గ్రోలెను. అంత నామఱునాఁటి ప్రాతఃకాలమున యథోక్తగోసేవావ్రతమున కంగభూతమైనపారణను గ్రహించినపిమ్మట నారాజదంపతులకుఁ బ్రస్థానకాలోచితములగు నాశీర్వాదములనొసంగి వశిష్ఠసంయమీంద్రుఁడు వారిని రాజధానికిఁ బ్రయాణముచేసెను. అప్పుడు దిలీపుఁడు ప్రజ్వలితుఁడయిన హుతాశనునకును వశిష్ఠారుంధతులకును వత్ససహితయైన నందినీధేనువునకును బత్నీసమేతముగఁ బ్రదక్షిణములాచరించి తన్మంగళాచరణంబుల నుదగ్రతరప్రభావుండై తనరాజధానికిఁ దరలెను. శ్రోత్రాభిరామంబగు ధ్వనితోడనలరి మార్గమునఁ బాషాణాదులు లేకుంట నప్రతిహతసుఖంబులొసంగిన రథంబున, సఫలమయిన నిజమనోరథంబునఁబోలె నంత వ్రతాదిదుఃఖసహనశీలుఁడైన యానృపాలుఁడు ధర్మపత్నితోఁగూడనేఁగి తన పురంబును జేరెను.

ఇంతదనుక నదర్శనుఁడై ప్రజానిమిత్తవ్రతాచరణంబునఁ గృశించిన శరీరముతో నూతనోదయంబందిన యారాజేందుని నోషధీనాథునింబోలెఁ బ్రజలెల్ల నప్పుడత్యంతౌత్సుక్యమున నెంతకును దనివినొందని నయనంబుల నవలోకించిరి. జయజయధ్వనులొనర్చి పౌరజనము లభినందింప నాపురందరశ్రీయుతుం డున్నమితపతాకంబుల విల

సిల్లు పురంబును బ్రవేశించి భుజగేంద్రసమానబలంబగు నిజభుజంబున మగుడ భూభారమును వహించెను. అత్రిమహాముని నయనోదితుండయిన చంద్రుని దివియును, వహ్నిచే విడువఁబడిన మహేశ్వరతేజమును సురవాహినియు ధరించినకరణి దిలీపకులభూత్యర్థ మంతఁ గొంతకాలమున కాతనిరాజ్ఞి లోకపాలురమహత్తరతేజములచే ననుప్రవిష్టమయిన గర్భమును దాల్చెను.

---

## —* తృతీయ ప్రకరణము *—

:0:

ఆనంతరము సుదక్షిణాదేవి యిక్ష్వాకుకులసంతతికి మూలకారణమును, సఖీజననేత్రచకోరములకుఁ జంద్రికాప్రారంభమును, భర్తృమనోరథంబునకుఁ బ్రాప్తఫలంబును నయిన గర్భచిహ్నమును ధరించెను. కార్శ్యము, ఛర్ది, దోహదము మున్నగు * గర్భిణీలక్షణంబు లామెయందుఁ గ్రమక్రమంబుగఁ బొడగట్టఁజొచ్చెను. దేహము కృశింపఁ బరిమితభూషణంబుల ధరించి లోధ్రసుమంబువలె వెల్లనయిన మొగంబునఁ దనరు నామహారాజ్ఞి, యచ్చటచ్చటఁగాన్పించు నక్షత్రములను బ్రకాశహీనుఁడయిన చంద్రునిఁగలిగి యించుమించుగఁ దెల్లవాఱుయామినివలె వెలుఁగొందెను. వేవిళ్లుపొడసూప నామె మృద్భక్షణము సేయఁదొడంగెను. ఆకారణంబున మృత్సురభిళమైన యామెవదనంబును దిలీపసార్వభౌముఁ డేకాంతమున నాఘ్రాణించుచు,

* గర్భిణీలక్షణములు:— (1) కార్శ్యము, (2) ఛర్ది, (3) దోహదము, (4) ప్రసేకము, (5) జృంభ, (6) సదనము, (7) మూర్ఛ, (8) సుఃఖస్వభావత, (9) స్తనపీనత్వము, (10) కృష్ణచూచుకత్వము, (11) కుక్షిగరిమ, (12) రోమరాజీ ప్రకాశనము, (13) అరోచకము అనునవి. (చూడుఁడు బాహటము,)

గ్రీష్మావసానమున వానచినుకులుపడినంతనే యడవులందలి పడియల నుండి వెడలు పరిమళమును మూర్కొను కరీంద్రమువలె నెంతకును దనియకుండెను. తనకుదయించు నందనుఁడు సార్వభౌముఁడై యింద్రుఁడు స్వర్గమునుబోలె భూతలంబెల్ల ననుభవింపఁగలఁడని సూచింపఁగాఁబోలు సుదక్షిణాదేవి ప్రప్రథమమున భూసంబంధాభిలాషము నందె మనస్సుగలిగియుండెను. అట్లుగాకున్న భోగ్యవస్తువులు పెక్కులుండ నామె వానినన్నిటి విడనాడి మృత్తికయందే మోహముంపఁగారణమేమి? మాతృజనవాంఛితంబులు పుత్రలక్షణసూచకంబులు గదా ?

ఆయుత్తరకోసలాధీశ్వరుండు తనప్రాణేశ్వరి చెలికత్తెలను బిలిచి "మీ దేవి సిగ్గుచేఁ దనకోరికల నాకుఁదెలుప నిచ్ఛగింపదు. ఆమె కేయేవస్తువులందుఁ గోర్కెగల్గునో యెప్పటికప్పుడు నాకుఁ దెలుపుచుండుఁడు." అని మాటిమాటికి నాదరంబునఁ జెప్పుచుండెను. దేవి వేవిళ్లచే నేదికోరిన నాసూడిదయెల్ల నామహారాజామెకుఁ దెచ్చియిచ్చుచుండెను. అధిజ్యశరాసనుండయిన యావీరవరేణ్యునకు స్వర్గమునుండియైనను లభింపనివస్తువు లేదుగదా! అంత సుదక్షిణాదేవి క్రమంబుగ దోహదశ్రమముగడచి, యవయవపుష్టిఁజెంది కారాకులురాలినపిదపఁ బ్రత్యగ్రపల్లవంబుల మనోహరమగు లతవలెఁబ్రకాశించెను. దినములుగడచినకొలఁది నామెకుచములు ముక్కులు నలుపెక్కి వలుఁదలయి తుమ్మెదలుపొదివిన చొక్కంపుఁదమ్మిమొగడల చక్కందనమును ధిక్కరించుచుండెను. అంతర్వత్నియగు నాపట్టపుమహిషినప్పుడు దిలీపనరేంద్రుఁడు రత్ననిధుల గర్భమందిడుకొనిన వసుమతివడువునను, అంతరంబున వహ్నినివహించు శమివిధంబునను, అంతర్వాహినియగు సరస్వతీనదికరణిని దలంచెను. అంత నాధీరుఁడు భార్యయందలి తనయనురాగమునకును దనయౌదార్యమునకును భుజ

బలంబున దిగ్విజయ మొనర్చి యార్జించిన తనసంపదలకును బుత్రిలాభమగునను సంతోషమునకును దగునటులు మహావైభవముతోఁ బుంసవనము, అనవలోభనము, సీమంతోన్నయనము నను శుభకర్మంబుల యథాక్రమంబుగ జరిపించెను. అష్టదిక్పాలుర యంశములచే నాశ్రితంబైనగర్భంబుభరించు నామహారాజ్ఞి హృదయేశ్వరుఁడు గృహమున కేతెంచునప్పు డాయాసముచే నతికష్టమున నాసనమునుండి లేచుచు బడలిక చెందిన కరంబులతో గౌరవార్థమై యంజలులొనర్చి యాతనిని బారిప్లవవీక్షణంబుల విలోకించుచుండెను. ఈలక్షణంబుల కాన రేందుఁ డెంతయు సంతోషించుచుండెను. బాలచికిత్సాసంబంధి యగు కౌమారభృత్యంబను నాయుర్వేదాంగంబునఁ గుశలులును దక్షులును నగు భిషజ్ఞులరావించి యామెగర్భరక్షణవిషయమున జాగరూకతవహింప నారాజేంద్రుఁడు నియోగించెను. అంత నవమాసములు నిండఁ బదియవ నెలవచ్చెను. అప్పుడు హర్షితస్వాంతుఁడై ప్రసవోన్ముఖియైన ప్రియాంగన నాతఁడు గ్రీష్మావసానమున మేఘాచ్ఛాదితమైన దివినింబోలె వీక్షించెను.

అనంతరము శచీదేవితో సమానురాలగు నాసుదక్షిణాదేవి రవి కుజ గురు శుక్ర శని గ్రహంబులైదును గ్రమంబుగ మేష, మకర, కర్కాట, మీన, తులారాశిగతంబులై (యుచ్ఛస్థానములం దుండి) భాగ్యసంపదను సూచించు శుభముహూర్తంబునఁ బ్రభుమంత్రోత్సాహోత్పాదితంబగు శక్తి యక్షయంబగు నర్థంబునుం బోలె దేవసమానుండగు పుత్రునిఁ గనెను.

అప్పుడు సమస్తదిశలు ప్రసన్నములయ్యెను. వాయువులుసుఖకరముగ వీచెను. హవ్యవాహనుఁడు ప్రదక్షిణజ్వాలలతో నాహుతుల స్వీకరించెను. వేయేల! ఈవిధంబుగనన్నియు శుభసూచకంబులే యయ్యెను. మహాత్ముల జననమొందుట లోకాభ్యుదయార్థమేగదా?

శుభోదయుండగు నా బాలుని తేజము పురిటింటియందలి సెజ్జచుట్టు వ్యాపించి యందలి నిశీథదీపములనన్నిటిని దిరస్కరింపఁగా నా దీపములు తటాలున వెలవెలఁబాఱుచుఁ జిత్రపటమున వ్రాయఁబడిన వానివలెఁ దనరారెను. అమృతసమ్మితాక్షరమగు కుమారజనన సమాచారమును దనకుఁ జెప్పవచ్చిన యంతఃపురజనంబులకప్పుడు దిలీపమహారాజు తనచేతికందిన వస్తువులెల్ల బహుమానములుగ నొసంగెను. ఆసమయంబున నా దానశీలునకుఁ జంద్రికాప్రకాశమానంబగు ఛత్రంబును, ఉభయపార్శ్వముల వర్తించు వింజామరలు రెండును-మూఁడుమాత్రమే యీయఁదగనివయ్యెను. వాయుసంచలనరహితప్రదేశమునందలి యరవిందములకరణి నిశ్చలములగు నేత్రములతోఁ గుమారునిసుకుమారవదనంబును దిలకించు నా గుణరత్నాకరుని సంతోషపూరము లోనిముడశక్యముకాక చంద్రదర్శనమున నుప్పొంగు సముద్రజలములవలె వెల్లివిరిసెను.

అనంతరము తపోవనమునుండి యిక్ష్వాకుకులపురోహితుండును దపోనిధియు నగు వశిష్ఠమహర్షి విచ్చేసి బాలకునకు జాతకర్మసంస్కారమును సమగ్రముగ నెఱవేర్చెను. తత్ప్రభావమున నా బాలుఁడు తేజోధికుండై గనియందుద్భవించి సానపెట్టఁబడిన మణివలె నత్యంతము వెలుఁగొందుచుండెను. అప్పుడా మాగధీశ్వరుని గృహంబుననే గాక యాకాశపథమందును వారాంగనాప్రమోదనృత్యసహితంబుగ శ్రవణపేయంబులగు మంగళవాద్యధ్వనులు విజృంభించెను. భయంకరశాసనుండగు నా నరేంద్రుని పాలనమున నేరముచేసి బంధీకృతుఁడయిన వాఁడే లేకుండుటచేఁ బుత్రజననహర్షమున నెవనినైన బంధమునుండి విడుపింతునన్న నట్టివాఁడా రాజ్యమున నొకఁడును లేఁడాయెను. అందుచేనతఁడు తనకుఁదానే పితౄణాభిధానబంధనమునుండి విడుదల నొందెను. శబ్దార్థవిదుండగు నా పార్థివేంద్రుఁడు తనకుమారుఁడు శాస్త్ర

ములపారముతోపాటు యుద్ధమందు శత్రురాజుల పారమునుగూడఁ గాంచఁగలఁడని యూహించి గాఁబోలు "లఘి" యను ధాతువునకున్న "గమనము" అను నర్థమును గ్రహించి యాబాలకునకు "రఘువు" అని నామకరణమొనర్చెను.

సకలసంపత్సమగ్రుండగు తండ్రిప్రయత్నంబులవలన నాబాలుఁడు శుభలక్షణసమగ్రంబులగు శరీరావయవంబులతో, సూర్యకిరణప్రవేశమువలన బాలచంద్రుఁడువోలె, దినదినప్రవర్ధమానుండగుచుండెను. పార్వతీపరమేశ్వరులు కుమారస్వామిని జూచికొనియు, శచీపురందరులు జయంతునిఁగాంచియు నానందించుకరణి వారితో సమానులగు నాసుదక్షిణాదిలీపులు తత్కుమారజయంతసదృశుండగు నిజకుమారునిఁ జూచికొని సంతోషమున నోలలాడుచుండిరి. జక్కవకవకుంబోలెఁ బరస్పరహృదయాకర్షకంబైన యాదంపతులయవ్యాజానురాగం బీయేకసుతునిచేఁ బంచుకొనఁబడినదైనను నెంతమాత్రముఁదఱుగక వారికన్యోన్యము మఱింతవృద్ధియేయయ్యెను. ఆహా! సంతానసంపదయం దెంత మహత్తరప్రభావంబున్నది? భార్యాభర్తల యనురాగలతకు సంతానప్రాప్తియేకదా ప్రాకుఁగొమ్మ. ఆబాలుఁడు దాది మునుముందుపలికినమాటలను వెనువెంట నుచ్చరించుచుండెను. ఆమె యంగుళినిబట్టుకొని నడుచుచుండెను. ఆమె నమస్కారమొనర్చుట నేర్పఁగా నమ్రుఁడగుచుండెను ఈదృశబాల్యచేష్టలన్నియు నతనితండ్రి కింపు నింపుచుండెను.✓ ఆబాలకుఁడు శరీరస్పర్శనంబుల నొసంగు సుఖంబులఁ ద్వగింద్రియముమీఁద నమృతపుసోనలు గురియుచున్నటులుండ దిలీపమహారాజతనిని దొడపై నెక్కించుకొని యర్థనిమీలితలోచనుండై యానందంబున మైమఱచి నేఁటికింతకాలమునకు సుతస్పర్శసౌఖ్యరసం బనుభవింపఁగలిగెను. ప్రజాపతి తనమూర్తిభేదంబవహించి సత్వాదిగుణాగ్రసరుండగు విష్ణుమూర్తివలన దన

సృష్టియంతయు నిలుకడగాంచినదని యానందించుచందమునఁ జిరకాలానుశ్రితములగు మర్యాదలనెల్లఁ బాలించు నాప్రజాపతి యుత్కృష్టజననుండగు నత్తనయునివలనఁ దనవంశమంతయు స్థితిమంతమైనదని తలంచెను. అంత మూఁడవయేఁడురాఁగ నబ్బాలునకు యథావిధిగఁ జౌలకర్మమును జరిగించిరి. తదనంతరమతఁడు సవయస్కులును జలించు కూఁకటులుగలవారును నగు మంత్రిపుత్రులతో యథావిధిగా నక్షరాభ్యసనమొనర్చి, నదీముఖమున మహార్ణవమునుంబోలె వాఙ్మయమునందుఁ బ్రవేశమునొందెను. పదునొకండవయేట దిలీపమహారాజు కుమారునకు యథాశాస్త్రముగ నుపనయనసంస్కారమును జరిపించెను. గురుభక్తితత్పరుండగు నావటువును విద్వత్ప్రకాండులగు గురువులు సమస్తవిద్యలయందు శిక్షితునిగ నొనర్చిరి. గురువులుపడిన కష్టమెల్ల నా బాలునియందు సఫలతగాంచెను. సత్పాత్రమందు వినియోగింపఁబడిన క్రియ ఫలవంతముగాకపోదుగదా! ఉదారధీసమన్వితుండా రఘువు, శుశ్రూషా, శ్రవణ, గ్రహణాది * ధీగుణవిశేషంబులఁజతురుండై క్రమంబుగఁ జతుస్సముద్రోపమానంబులగు ♦ చతుర్విద్యలను దిరస్కృతవాయువేగంబులగు వారువంబులచే సప్తాశ్వుండు చతుర్దిశలనుంబోలె నధిగమించెను. అంత నాతఁడు పవిత్రమైన కృష్ణాజినమును ధరించి సమంత్రకముగ సమస్తాస్త్రములను దండ్రియొద్దననేర్చికొనెను. దిలీపనరేంద్రుఁడు సార్వభౌమత్వమందేగాక ధనుర్విద్యాకౌశలమందును నద్వితీయుండుగదా! శైశవానంతరము యౌవనమంకురింపఁగ రఘువు క్రమంబుగ మహావృషభత్వమునొందు కోడెమూడ్కొని, గజేంద్రభావంబునుగాంచు కలభంబువలెను జాపల్యముతీఱి

* ఆదిశబ్దముచే గ్రహింపఁదగినవి:— ధారణము, ఊహ, అపోహ, అర్థవిజ్ఞానము, తత్త్వవిజ్ఞానము అనునవి.

♦ ఆన్వీక్షికి, త్రయి, వార్త, దండనీతి.

గోముగఁ బెరుఁగు శరీరమున విరాజిల్లుచుండెను. అంత దిలీపుఁడు కుమారునకుఁ గేశాంతమనుకర్మము జరిపించి తరువాత వివాహమొనర్చెను. దక్షప్రజాపతి కుమారికలగు సప్తవింశతితారకలు తమోవిదారకుఁడగు హిమాంశుని వరించినకరణి రాజకన్యకలు పెక్కురారఘువును సత్పతినిగాఁబడసి శోభిల్లిరి. జవ్వనపుసిరి నివ్వటిల్లి కాఁడులవలె నిడుదలగు బాహువులను, మాంసలములగు నంసములను, కవాటముంబోలు విశాలవక్షమును, విరివిగల కంధరంబును గలిగి దేహంబు పెంపున నారఘునందనుఁడు తండ్రికంటె నున్నతుఁడయ్యు వినయంబున సన్నతుఁడయి చూపట్టెను. అంత దిలీపమహారాజు చిరకాలము తాభరించిన నితాంతప్రజాపాలనభరమును గొంత తగ్గించుకొనఁగోరి, స్వభావసంస్కారముల రెంటిచేతను వినీతుండైన కుమారుని యౌవరాజ్యాభిషిక్తునిగఁ జేసెను

సౌరభాదిగుణముల నభిలషించు కమలాసతి తనకాణాచియగు పంకజగేహమునుండి తత్సమీపమున నవీనముగ వికసించిన కైరవమునందొక యంశముచేత నెలకొనునట్లు, వినయాదిగుణముల నాశించు రాజ్యలక్ష్మియు దిలీపుపేరి మూలస్థానమునుండి తదంతికమున యువరాజసంజ్ఞఁదనరు రఘునామకనూత్నస్థానమందును నొకయంశముచే నిరవుకొనెను. పరాక్రమవంతుఁడగు కుమారునితోఁ గూడిన దిలీపసార్వభౌముఁడు, శరత్కాలవిశిష్టుండగు ప్రభాకరునిఁ, బ్రభంజనసహితుఁడగు వైశ్వానరుని, గండస్థలమదంబుతోడి గంధకరిఁబోలి వెనుకటికంటె నత్యంతము దుస్సహతరుండయ్యెను.

అనంతరము శతముఖసన్నిభుం డాదిలీపభూవిభుండు ధనుర్ధారియైన కుమారునిఁ దోడిరాకుమారులను దోడిచ్చి, మఖవాజిరక్షణమున నియోగించి యొకటితక్కువగ నూఱశ్వమేధయాగముల నవిఘ్నముగ నెఱవేర్చెను.

విధివిహితముగఁ గ్రతువుల నాచరించిన యారాజర్షి కొఱఁతవడిన యాయొక్క సవనమునుగూడఁ బూర్తిసేయసమకట్టి యథాప్రకారము మఖాశ్వము ననర్గళంబుగ విడిచిపెట్టెను

అంత ధనుర్ధరులై వేయికనులతో రక్షకులు కాపాడు నాగుఱ్ఱమును బ్రత్యక్షముగ దొంగిలించుటకోడి కాఁబోలు సహస్రాక్షుఁడు దాని నదృశ్యరూపమున నపహరించెను.

ఇట్లాకస్మికంబుగ యాగాశ్వమదృశ్యమగుటకుఁ గారణమరయ నేరక రఘుమహారాజు సైనికులందఱు నివ్వెఱపడి యేమిచేయుటకుఁ దోఁపక నిశ్చేష్టులై యుండిరి. అంత దిగంతవిశ్రుతప్రభావయగు నందినీధేనువు నిజప్రసాదజనితుఁడగు రఘువునందలి యవ్యాజానురాగమునఁ దత్క్షణమచ్చటికివిచ్చేసి వారికిఁ బ్రత్యక్షమయ్యెను.

అంత సజ్జనసంపూజ్యుఁడును విబుధపూజానిరతుండును నగు నాదిలీపనందనుఁడా ధేనువునకుఁ బ్రదక్షిణమాచరించి పవిత్రమగు నాగోవుపంచితమునఁ * దననేత్రములఁ గడిగికొని వెంటనే యింద్రియాతీతములగు పదార్థములఁగూడఁ జూడఁగల దివ్యదృష్టినిబడసెను. అంత నాతఁడు మాటిమాటికిఁ దప్పించుకొనిపోవుటకుఁ బెనఁగులాడు సైంధవమును, దానియౌద్ధత్యమును వారించి యరదపుఁబగ్గములతో బంధించు నింద్రసారథి మాతలిని, పూర్వదిశకు దానిని గొనిపోవు పర్వతపక్షచ్ఛేదకుని మహేంద్రుని విలోకించెను. యాగాశ్వమునుగొనిపోవు నప్పురుషుఁడు దేవేంద్రుఁడని తెప్పపాటులేని నేత్రశతంబుల

---

* ఇచ్చట "తదంగనిష్యందజలేన" అని మూలము. 'నిస్పందజలేన' అని పాఠాంతరముగూడఁగలదు. మల్లినాథుఁడు నిష్యన్ద, నిస్పన్ద శబ్దములకు "ద్రవము" అని యర్థము వ్రాసి నిష్యన్దజలమునకు "మూత్రము" అను ఫలితార్థమును వ్రాసియున్నాఁడు. చారిత్రవర్ధనాదులు మఱికొందఱు వ్యాఖ్యాతలీశబ్దమునకు "స్వేదము" అని యర్థము వ్రాసినారు. మల్లినాథుని భావమే సమంజసమని నాయభిప్రాయము. పాఠకులు తమకిష్టమువచ్చిన యర్థమును గ్రహింతురుగాక.

వలనను, హరిద్వర్ణభాసురంబులగు వాసవంబుల మూలమునను నెఱింగి రఘువాతనిని వెనుకకు మరల్చువానివలె మిన్నుముట్టు పేరెలుంగున నిట్లు హెచ్చరించెను.

"మహేంద్రా! మఖాంశభాక్కులగు దేవతలందెల్ల నీవ యగ్రగణ్యుండవని మనీషిజనంబులు వక్కాణింతురు. అట్టి మహనీయుఁడవు నీవే నిరంతరయాగదీక్షానియతుఁడగు మజ్జనకుని యాగక్రియల కేల విఘ్నమును బ్రతిపాదింపఁ బ్రయత్నించుచున్నాఁడవు? రాజే యధర్మమునకుఁ గడంగినచో శిక్షించువారెవరు? తల్లియ విషము వెట్టిన శిశువులఁబోషించువారెవరు? దివ్యదృష్టిసనాథుఁడవు, త్రిలోకనాథుఁడవు నీవకదా మఖంబులకు విఘ్నంబుల నాపాదించుశత్రువుల శిక్షింపనర్హుఁడవు. అట్టినీవే ధర్మమార్గానుచరులొనర్చు పవిత్రకర్మములకు స్వయముగ విఘ్నకారకుఁడవైనచో నిఁకలోకమందు విధులెల్ల నశించినట్లేగదా? కావున నామనవిని బాలించి నాతండ్రియొనర్చు మహాధ్వరమునకుఁ బ్రధానాంగమయిన యీతురంగరాజమును విడిచిపెట్టుము. వైదికధర్మరక్షకులగు మహాపురుషులు మలినమార్గముల ననుసరింపరుగదా?"

ఇట్లు రఘుమహారాజు వచించు ప్రగల్భవచనంబులవిని స్వర్నాథుండు సవిస్మయుండై రథంబును మరల్చి యాతనికిట్లుప్రత్యుత్తరమొసంగెను. "ఓరాజన్యకుమారా! నీవు వచించినదెల్ల నిజమే; కాని, యశోధనులగు మాబోంట్లు శత్రువులనుండి యశంబును రక్షించుకొనవలసియున్నది. జగంబంతట వెలుఁగొందు నాయశంబునెల్ల నీ యాగమూలమున హరించుటకు నీతండ్రి యుద్యమించియున్నాఁడు. "తన్నుమాలిన ధర్మము శేద్ర"ను నార్యోక్తిని నీవుమాత్రమెఱుంగవా? పద్మాక్షునొక్కనినే పురుషోత్తముఁడనియు, ఫాలాక్షునొక్కనినే మహేశ్వరుఁడనియు నుతించునట్లు మునీశ్వరులెల్ల నన్నొక్కనినే

శతమఖుండని వక్కాణింతురు. ఈశబ్దములుమూఁడు మాకుఁవ్వరకే రూఢములు. వానిలో దేనిని రెండవవాఁడెవఁడును జెంద నేరఁడు. కావున నీతండ్రి నూఱవమఖాశ్వమును నేనపహరించితిని. ఈయశ్వరక్షణమునుగూర్చి నీప్రయత్నమునిఁకఁ గట్టిపెట్టుము వృథాశ్రమము వలనఁ బ్రయోజనమేమి? కపిలమహామునిననుకరించు నాపట్ల నీవిఁక సగరచక్రవర్తిపుత్త్రులు త్రొక్కినదారి త్రొక్కకుము.”

ఈమాటలకుఁ దురంగరక్షణదీక్షావహుండా దిలీపనందనుండు మందహాసమొనర్చి నిర్భీకుఁడై పురందరునకిట్లు మాఱువలికెను.

“నిర్జరేంద్రా! అశ్వమును విడువకునికియే నీనిశ్చితాభిప్రాయమైనచో శస్త్రమునుబూనుము. ఈదిలీపనందనుని రఘువును నిర్జించినఁగాని నీప్రయత్నమునఁ గృతార్థుఁడవు కాఁజాలవు.”

ఈవిధంబుగఁ బల్కి పురుహూతుని మ్రోల నున్ముఖుఁడై నిలిచి యాలీఢమనుస్థానభేదమున మిక్కిలి శోభించు దేహౌన్నత్యమున నామేరునగధన్వియగు పరమేశ్వరుని విడంబించుచు రఘువు వింటియందు బాణమును సంధించెను. ఆరాజకుమారుఁడాడిన తిరస్కారభాషణంబులు ములుకులవలె నాతని హృదయంబునుభేదింప నానగభేదిరోషకషాయితలోచనుండై త్రోలుమొగులగుముల కిసుమంతసేపు గుఱుతగు తనధనుస్సునందు వమ్ముగాని యమ్మును సంధించి యాతని మీఁదఁ బ్రయోగించెను. భీకరులగు మ్రుక్కడిరక్కసుల నెత్తురులఁ గ్రోలుటయందలవాటుపడిన యాశిలీముఖము రఘుమహారాజు విశాలవక్షఃప్రదేశమున గాటముగనాటి యంతకుఁబూర్వమెన్నఁడు చవిచూచియెఱుంగని మానవరుధిరమందలి కుతూహలముననోయన నాతని శోణితమును బానమొనర్చెను.

బీరమునఁ గుమారునకీడగు నాదిలీపకుమారుఁడును వెనుదీయక యైరావతగజంబును దాటించుటచేఁ గఠినములైన యంగుళులఁ

దనరుచు శచీదేవి కపోలములందలి మకరికాపత్రవిశేషంబులఁ జిహ్నితంబైన మహేంద్రునిభుజంబున నిజనామాంకితంబగు బాణమును నాటి మయూరపత్త్రములుగల మఱియొకశరమున నాతని మహాశని ధ్వజమును విఱుగఁగొట్టెను.

ఇందుచే దివిజేంద్రుఁడా మానవేంద్రనందనుఁడు తన స్వర్లోకరాజ్యలక్ష్మిని బలాత్కారముగఁబట్టి యామె కేశపాశమును ఖండించినట్లుగ నవమానమునుజెంది మండిపడుచు నాతనిపై మఱింతక్రోధము వహించెను.

గరుత్మంతములగు నురగములకరణి వెఱపుగొలుపుచుఁ గ్రిందికి మీఁదికిఁబోవు వివిధశరంబుల నొండొరులపైఁ బఱపికొనుచు నావీరవరేణ్యులిద్దఱును సంకులసమరంబొనర్చిరి. దివమునందలి సిద్ధులును రఘుమహారాజుసైనికులును దగ్గఱనుండి యాఘోరసంగరమును వెఱఁగుపడి వీక్షించుచుండిరి. నిరంతరాయముగ శరవృష్టిని గురిసియు నాలోకపాలాగ్రసరుండు నిజాంశసంభూతుండగు నారఘుకుమారుని దుస్సహతేజంబును నించుకయు శమియింపఁజేయఁ జాలడయ్యె. నిజగర్భజనితంబైన యశని తేజంబును శరంబులు గురిసియుఁ జల్లార్పవలాహకము వలంతి కాదుగదా!

అంతట రఘువు హరిచందనాంకితమైన బిడౌజుని ముంజేతియందు విలసిల్లుచుఁ బ్రమథితంబగు మహార్ణవంబువలె గంభీరముగ మ్రోయు నల్లెత్రాటిని నొక్కయర్ధచంద్రబాణమునఁ దెగవ్రేసెను.

అంత నప్పాలోమజాధవుండు మితిమీఱిన కోపానలంబున మండిపడుచు నాచాపంబును బాఱవైచి, కార్యముఘుప్రతిమించుచున్నదని యెంచి యొక్కవ్రేటునన బల్లిదుండగు నప్పగతునిఁ దెగటార్పఁ దలంచి గట్టుల చట్టుపల దెగఁగొట్ట నలవాటుపడిన బెట్టిదంపుటాయుధంబును, మెఱుంగులు తుఱంగలించు వజ్రంబును గైకొని శక్తిఁగొలఁది నాతనిపై విసరెను.

అది యురమ్మునఁ దీవ్రమ్ముగనాట రఘుమహారాజా ప్రేటుతో నొక్క పెట్టున నిజసైనికుల నయనకోశములనుండి కాలువలై పాఱు నశ్రుజలములతోపాటు నేలపై వ్రాలెను. కాని యావీరాధివీరుండు నిమేషమాత్రంబులో నాభిమర పాతవ్యథ నపనయించుకొని లేచి తిరిగి యింద్రునిపైఁ బ్రయోగించుటకుఁ బాణమును గైకొనెను. వెంటనే యాతనిసైనికులెల్ల నధికహర్షంబున సింహనాదముల నొనర్చిరి.

అమోఘమైన తన వజ్రాయుధపాతంబును లక్ష్యపెట్టక శస్త్రప్రయోగనిష్ఠురమగు శత్రుభావమునింకను దనయెడ నెఱపుచున్న యారఘుమహారాజు పరాక్రమాతిశయమున కాసునాసీరుఁడెంతయు సంతసించెను గుణంబులు శత్రుమిత్రభేదంబులేక సర్వత్ర ప్రశంసింపఁబడునుగదా !

అంత నింద్రుఁడు రఘువుతో "వత్సా ! గిరులను నఱుకుట యందుఁగూడ నకుంఠితమగు నాయీభయంకరాయుధము ప్రహారంబును సహింపఁగలిగినవాఁడు నీవుదక్క మఱియెవ్వఁడును గానరాలేదు. నీయసామాన్యపరాక్రమమున కెంతయు సంతుష్టహృదయుండనైతిని. కావున నీహయంబుతప్ప నీవేమికోరుదువో చెప్పుము" అని స్పష్టముగ నుడివెను.

ఇట్లు సురలోకనాథుఁ డానతిచ్చునప్పటికిఁ దూణీరమునుండి యించుకపైకిఁదీయఁబడి స్వర్ణపుంఖద్యుతులఁ దనయంగుళులఁబ్రకాశింపఁజేయుచున్న బాణమును వెనుకకు మరల్చి యారాకుమారుఁడాతనికిట్లు విన్నవించెను. "స్వామీ ! త్రిలోకనాథా ! మఖాశ్వమును విడువకునికియే యిప్పటికిని నీసంకల్పమైనచో నిరంతరయాగదీక్షానియతుఁడయిన నాజనకుఁడు నిరంతరాయముగ నీసవనమును నిర్వహింపఁగలిగినచో యథాశాస్త్రముగ నొందుఫలంబు నిప్పుడుగూడ నందునట్లు ప్రసాదింపుము. అష్టమూర్తియంశములలోనొకయంశమును దాల్చి దుష్ప్రాపుఁడై దీక్షాగృహమందున్న యామానవేంద్రునకీవృత్తాంతమును నీవే నీవార్తాహారుని ముఖంబునఁ దెలియఁజేయుటకుఁ గూడ ననుగ్రహింపుము" అట్లే నీప్రార్థనముల నెఱవేర్చెదనని ప్రతిజ్ఞ

చేసి యాపురుహూతుఁడు వచ్చినట్లుగనే వెడలి యదృశ్యుఁడయ్యెను.
రఘువును యాగసైంధవమును విడిపింపఁజాలమికి వ్యసనపడును
నత్యంతసంతుష్టుంజుగాక తండ్రిసన్నిధికరిగెను. ఇంతకుముంద మహేం
ద్రసేవకునివలన యావద్విషయంబుల నెఱింగిన యాదిలీపసార్వభౌ
ముఁడు కులిశవ్రణాంకితమైన కుమారుని దేహంబును సంతోషభరం
బున శీతలంబగు కరంబున స్పృశించుచు నాతని బుజ్జగించెను. మహా
నియమశాసనుండగు నాభూరమణుం డివ్విధంబున జీవితానంతరము స్వర్గ
మునధిరోహించుటకు నిర్మించుకొనిన సోపానపరంపరయనఁ దొంబది
తొమ్మిది యశ్వమేధముల నిర్వర్తించి కృతార్థుండయ్యెను. విషయ
నివృత్తచిత్తుఁడై యానృపోత్తముఁడంత యావనవంతుఁడైన కుమారు
నకు యథావిధిగ రాజచిహ్నంబగు శ్వేతాతపత్రంబు నొసంగి భార్యా
సహితుఁడై వనంబునకేఁగి తపోధనాశ్రమతరుచ్ఛాయల నధివసించి
వానప్రస్థాశ్రమమును స్వీకరించెను. ఏవంవిధవిధానము వార్ధక్యమందిన
యిక్ష్వాకువంశ్యులకెల్లఁ గులవ్రతముగదా !

---

## —* చతుర్థప్రకరణము *—

సాయంకాలము సూర్యతేజమునొందెడి యగ్నివలెఁ దండ్రి
యొసంగిన రాజ్యభారమును వహించి రఘుమహారాజు మిక్కుటముగఁ
బ్రకాశించెను. యువరాజై యున్న కాలముననే యాతని యవక్రపరా
క్రమంబునకుం దాళలేక కుందుచుండిన శత్రురాజుల మనంబుల రాఁజు
చున్న సంతాపాగ్ని జనకునియనంతరమాతఁడు సార్వభౌమత్వమునం
దిన సంగతిని విన్నంతనే యఖండజ్వాలముగాఁ బ్రజ్వలించెను. సువృ
ష్టిగలిగి దేశము సుభిక్షముగానుండుటకు శరత్కాలంబున భూపాలు
రొనరించు శక్రధ్వజముపేరి మహోత్సవమును విలోకించునట్లు,
రాష్ట్రమందలి ప్రజలెల్ల నూతనముగ రాజ్యాధికారమునంది యభ్యుద
యముఁగాంచు నమ్మహారాజును దమబిడ్డలతోఁగూడ నుత్కంఠతో

మొగంబులెత్తి కనులారఁగాంచి కడుంగడుసంతసించిరి. గంధగజగామియగు నా రాజేంద్రుని కేకకాలమునఁ బైతృకమగు స్వరాష్ట్రముతో శత్రురాష్ట్రములుకూడ స్వాధీనమయ్యెను. * అశేషసామ్రాజ్యాధిపత్యదీక్ష వహించిన యాచక్రవర్తి యుత్తమాంగమును బద్మాకారము గల ప్రభాపటలము పరివేష్టించియుండెను. అందుచేతఁ గంటికగపడకున్నను శ్రీదేవి ఛాయామండలమాత్రమున నూహింపఁదగు పద్మాతపత్రమును స్వయముగఁ గేలఁబట్టి యాతనిని సేవించుచున్నదోయనఁ దోఁచుచుండెను.* వందిమాగధజనంబు లారాజేంద్రుని నర్థవంతములగు స్తోత్రపాఠంబుల నుతించుటచూడ వాగ్దేవియే వారియందువసించి దేవాంశసంభవుండును సన్నుతిపాత్రుండును నగు నాసార్వభౌముని దేవతాబుద్ధితోఁ బూజించుచున్నదోయనఁ గానవచ్చుచుండెను. అట్లుగాకున్న సామాన్యమానవులగు నాబట్టుల కట్టివాఙ్నైపుణ్యమెట్లలవడియుండును? పూజనీయులగు మనువు మున్నగు చక్రవర్తులనెందఱనో పూర్వమువరించి వారి యాశ్లేషసుఖముల ననుభవించినదయ్యు, వసుమతీసతి యంతకుమున్నెవనిసాంగత్యము నెఱుఁగని నవోఢవోలె నారఘునెడ నత్యంతానురక్తయై యుండెను. అతితీక్ష్ణమును నతిమృదువును గాని దండనీతినవలంబించి యారాజచంద్రుఁడు నాతిశీతోష్ణ

---

* దీనికి మూలశ్లోకము|| ఛాయామండలలక్ష్యేణ తమదృశ్యాకిల స్వయం। పద్మా పద్మాతపత్రేణ భేజే సామ్రాజ్యదీక్షితమ్|| దీనినిగూర్చి భిన్నాభిప్రాయములు చాలఁగలవు. "ఛాయామండలలక్ష్యేణ" అని పద్మశబ్దమునకు విశేషణముగాఁ గవి పాఠమయియుండునని కొందఱమతము. ఆపక్షమున నీక్రిందియనువాదమును గ్రహించునది.

"అశేషసామ్రాజ్యాధిపత్యదీక్ష వహించిన యాచక్రవర్తి యుత్తమాంగమును బరివేష్టించి మెఱయు ధవళాతపత్రము లీలాపద్మమయి వెలయ, శ్రీదేవి కంటికగపడకున్నను నారాజేంద్రుని వదనాబ్జమండలమున విలసిల్లు నపూర్వశోభాపటలమువలన నూహింపఁదగినదయి యాతనిని స్వయముగ సేవించుచున్నదోయనఁ దోఁచుచుండెను."

మగు మలయానిలమువలె సకలజనమనంబులను జూఱఁగొనెను. తియ్యమావులు పూచునప్పుడు పూలయందుండు నౌత్సుక్యము ఫలోపలబ్ధియగునంతనే తగ్గునటులు జనరంజకంబుగఁ బాలించిన దిలీపునందలి యుత్కంఠ ప్రజలకుఁ గ్రమంబుగ రఘుమహారాజు సుగుణాధిక్యముచేఁ దఱుఁగఁజొచ్చెను. రాజ్యభారమునకుఁ గర్త్తవాఁడౌట నా రఘువునకు నీతిశాస్త్రవినీతులు ధర్మాధర్మయుద్ధవిధానముల రెండింటినిగూడ నెఱింగించిరి. కాని యారాజహంసుఁడు మొదటిపక్షమునే గ్రహించి రెండవదానిని విసర్జించెను. నీరసమ్మిళిత క్షీరంబుల క్షీరంబులఁగొని నీరంబుల విడనాడుట రాజహంసంబులకు నైజంబుగదా! ఆకర్త్తఱేని పాలనంబునఁ బంచభూతముల శబ్దస్పర్శ రూప రసగంధ గుణంబులుగూడ నతిశయించెను. వేయేల! సమస్తవస్తువులును గర్త్తవిగనే కాన్పించెను. ఆహ్లాదకత్వప్రతాపంబులవలనఁ బుష్పవంతులకుఁ గ్రమముగఁ జంద్రతపననామంబులు సార్థకములైనట్లు ప్రజానురంజనమువలన రఘువునకు రాజశబ్దమన్వర్థమయ్యెను. అతని నేత్రములు సోగలై శ్రవణముల స్పృశించుచుండెను. (కాని లోచనములవలని ప్రయోజన మామహాభాగునకు సూక్ష్మకార్యార్థముల నెల్లఁ బ్రకాశింపఁజేయు శాస్త్రవిజ్ఞానమువలననే నెఱవేఱుచుండెను. విజ్ఞానచక్షుష్మంతులకు బాహ్యనేత్రములతోఁ బనిలేదుగదా! వినమ్రులైన వైరుల కభయమొసంగి సంతోషమొనర్చియుఁ బోరికిఁగడంగినవారి బీరమడంచియు రాష్ట్రప్రజల కెల్లసౌఖ్యముల నొనగూర్చియు రాజ్యమునందు సుస్థిరుఁడై యాచక్రవర్తి రంజిల్లుచుండెను.)

పంకజలక్షణయగు శరదృతువుగూడవచ్చి యంత రెండవ రాజ్యలక్ష్మియో యన నాతనినాశ్రయించెను. అంబుదావళులు నిశ్శేషవర్షితాంబువులయి యతిలఘువులగుటచే నాకాశవీధి నిర్మలమయి ప్రకాశించెను. ఇలాతలమందును మార్గములు పంకరహితములై చక్కఁబడెను (అందుచే నినునిప్రతాపముతోడఁ దద్వంశదీపకుఁడగు రఘుమహారాజు ప్రతాపముగూడ దుస్సహమై యేకకాలమునన దిశల

యందంతట వ్యాపించెను. ఇంద్రుఁడు వర్షనిమిత్తమై దాల్చు తనధనుస్సును డించెను. రఘునరేంద్రుఁడు జైత్రయాత్ర వెడలుటకుఁ దన ధనువును ధరించెను. ఆదేవమానవలోకపాలురు ప్రజాప్రయోజనార్థ మొకరితరువారిటొకరు కార్ముకంబుల నెక్కు వెట్టుదురుగదా! తెల్లదామరల వెల్లగొడుగుగాను, విరిసిన తెల్లపూల వింజామరలుగాను ధరించి శరదృతు వాచక్రవర్తిని విడంబించెను. కాని యాతని శోభను యాత్రి మొకించుకయుఁ బడయ నేరదయ్యెను. కరుణాప్రసన్నవదనుండైన యారారాజును నిర్మలకిరణసంపన్నుండగు రేరాజును నప్పుడు గన్నులున్న వారెల్ల ననురాగమునఁ గాంచి సమానానందమును బొందిరి. హంస శ్రేణులయందును నక్షత్రగణములందును గుముదసముదయంబుల ముదంబుగొలుపు నుదకంబులందును నయ్యాశోధనుని యశస్సంపదల ప్పుడు వెదఁజల్లఁబడినట్లు దెలియవచ్చుచుండెను. కాకున్న నట్టియపు రూపపుధావళ్య మాపదార్థములకెట్లు లభించియుండును? ఇంద్రుని తోడి కయ్యము మొదలుగాఁగల బాల్యకథలు మొదలుకొని యా బాలగోపాలసన్నుతంబయి సుగుణపరంపరాజనితమైన యాలోకరక్షకుని కీర్తిని జెఱకుచెట్లనీడలఁ గూర్చుండి వరిపొలములఁగాచు జవరాండ్రు కీర్తనమొనర్చిరి. మహాతేజస్సంపన్నుఁడగు నగస్త్యమహర్షి నక్షత్రరూపమునఁ బొడసూపఁగా జలములన్నియు మలినతవాసి నిర్మలములయ్యెను. వానికలంకమంతయు, దిగ్విజయయాత్రకు బయలు వెడలిన దుర్భరతేజోనిధియగు రఘుమహారాజువలనఁ బరాభవము శంకించు నాతనిపగతుర మనంబుల నాశ్రయించి వానిని గలంచెను. మనోహరంబులగు మూఁపురంబుల నొప్పారుచు మదంబునఁ జెలరేఁగి యేటిగట్టులఁగొరాడు నాఁబోతులు, కకుద్మంతుఁడై పదఘట్టనల నదీతటంబుల ఛేదించు గజాశ్వంబులతో జైత్రయాత్రకు వెడలు నా సార్వభౌముని లీలాఖేలవిక్రమంబును విడంబించెను. ఏడాకులయరఁటి

చెట్ల కుసుమపరిమళంబులు మదజలమువంటి వాసనగలవై తమ్ముఁ దాఁకఁగా నావీరవరుని గంధగజములు పరవారణదానగంధమును నసూయచేతనుంబోలెఁ దమశరీరమందలి యేడుతావులనుండి మద ధారలవర్షించెను. నదుల నెల్ల లోఁతులేకుండఁగను, దారులన్నిటిని బురదలేకుండఁగను నొనర్చి శరత్కాల మామహారాజును నుత్సాహ శక్తికంటె ముందుగనే దండయాత్రకుఁ బ్రేరేపించెను.

అంత నాసార్వభౌముఁడు గుఱ్ఱములకు నేనుఁగులకు నీరాజన కర్మమును జరిపించి తదంగముగ యథావిధి హోమమొనర్చెను. ఆ హోమమునఁ బ్రదక్షిణజ్వాలావ్యాజమున హుతాశనుఁడాచక్ర వరికి దిగ్విజయమును నిజహస్తములతో నొసంగెనోయనునొప్పియుం డెను. నిజరాజధానిని బ్రాంతదుర్గమును సంరక్షించుటకు వలసినంత సైన్యమును నియోగించి, దేవబ్రాహ్మణపూజాదిశుభవిధుల నిఱవేర్చి, మౌల, భృత్య, సుహృచ్ఛ్రేణి ద్విషదాటవికములను షడ్విధబలముల సమకూర్చుకొని యానరేంద్రుఁడు సేనలు వెనుకభాగమున నడుచు చుఁ దన్ను బలసికొలువ జయేచ్ఛతో జైత్రయాత్రకు వెడలెను. మథనకాలమున మందరమహీధరముచే నెగురఁగొట్టఁబడిన తుంపురు లను బాలసముద్రపుటలలు సాగరశయనుఁడగు నారాయణునిపైఁ బోలె, యాత్రార్థమై యేఁగు నాచక్రవర్తిమీఁదఁ బురమునందలి ముత్తైదువలు పేలాలను జల్లిరి.

శక్రసన్నిభుండగు నప్పరివృఢుండు తొలుదొలుతఁదూర్పుదిక్కు నకు దాడివెడలెను. అనుకూలముగవీచు ననిలంబుచేఁ జలించుచు ముందఱకునిగుడు ధ్వజవ్రజంబులు శత్రువులను బెదరించుచున్నట్లుం డెను. రథఘట్టనల రేఁగిన ధూళిపటలముచే గగనతలము భూతల మువలెఁ గన్పట్టెను. వర్షమందును గ్రీష్మమందును బరిమాణమందును

గూడ మేఘసన్నిభంబులగు నిభంబులచే మేదినియంతయు మిన్ను బలెఁబొడసూపెను. పరాక్రమనిధియగు నమ్మహారాజు తేజోవిశేషమును బదంపడి సైనికుల కోలాహలమును నటుతరువాత వారిపదఘట్టనచే లేచిన దుమారములును మాత్రము మునుముందు బయలుదేఱి శత్రురాజుల యుల్లములఁ దల్లడిల్లఁజేసెను. ఆమూఁటితర్వాతను రథ గజ తురగ పదాతులుగల చతురంగబలమేఁగుచుండెను. ఈవిధముగ నా రాజేంద్రుని యపారచమూసమూహము నాలుగువ్యూహములుకలదివోలె వెడలుచుండెను. ప్రయాణసౌకర్యార్థము మార్గమున నాతఁడసాధారణసామర్థ్యంబున నిర్జలప్రదేశముల జలసమృద్ధములుగ నొనర్చెను. నావలచేదాఁటఁదగు నదులను సాధనాంతరములులేకయ సులువుగ దాఁటఁదగునట్లు చేసెను. దుర్గమారణ్యముల విశాలములగు బయళ్ళుగఁ బొనరించెను. ఏయడ్డంకులు లేక పూర్వసముద్రాభిముఖమై యేఁగు నామహత్తర దుర్వార సైన్యమును వెంటఁగొను నాసార్వభౌముఁడు శివునిజటాజూటమునుండి యిలకునవతరించు గంగానదిని వెంటఁగొనివచ్చు భగీరథునివలె నలరారెను. మదమాతంగము మార్గమునఁదనకుఁ దారసిల్లు వృక్షములను గొన్నిటి ఫలంబుల రాల్చియుఁ గొన్నిటి వేళ్లతోఁ బెల్లగించియు, మఱికొన్నిటి వేవిధంబుల విఱుగఁగొట్టియు యథేచ్ఛముగఁ బోవునటు లావీరవరేణ్యుఁడు వైరివీరులఁ గొందఱను వారుగూడఁబెట్టుకొనిన లాభముల లాగికొనియుఁ గొందఱ స్థానభ్రష్టులుగ నొనర్చియు నిఁకఁగొందఱఁ బలుతెఱంగుల నోడించి పాఢొనర్చియుఁ దన విజయయాత్రను సాగించెను.

ఇట్లాజయశీలుఁడు పూర్వదశనున్న నాయాదేశముల నెల్లనాక్రమించి తాళవనజాలములచే నిరులుకొనిన సముద్రతీరమును జేరెను. నమ్రులుకానివారి నాతఁడు మొదలంట నాశనముచేయునని భయపడి

1 సుహ్మదేశపురాజులు, తలయొగ్గి నదీవేగమువలని యుపాయమును బూరయని నీటిప్రబ్బలివలె నాసార్వభౌమునకు వినమ్రులై ప్రణమిల్లి యాత్మరక్షణమొనర్చికొనిరి. 2 వంగదేశపాలురు నౌకాబలములుగూర్చికొని యుద్ధసంరంభమొనర్ప రఘుభూపాలుఁడు మగంటిమిమెఱయ నప్పగతుర నోడించి గంగానదిపాయలమధ్యనుండు లంకభూములలోఁ జయస్తంభములను స్థాపించెను. అట్లు తమ్ముజయించి స్థానభ్రష్టులఁ జేయ నారాజులాపుడమిఱేని యడుగుఁదమ్ములపై వ్రాలిరి. అంత నాతఁడు కరుణించి వారిని గ్రమ్మఱ వారిరాజ్యములందు నిల్పఁగ నాభూపాలురాతనికి ధనరాసులఁదెచ్చి కానుకలుగ నర్పించిరి. ఆకుమడి నుండి పెకలించి మరల నాటినతరువాత వరిమొక్కలు బాగుగఁ బెరిఁగి క్షేత్రస్వామి పదపద్మములవఱకు వంగి ధాన్యముల నొసంగుకరణి నీరాజులవిధమెంతయు నొప్పియుండెను. పదంపడి యామహారాజేనుఁగులనే యానకట్టుగాఁగట్టి నిజసైన్యములతోఁ 3 గపిశానదివిదాఁటి బీరముచూపకయే వినమ్రులైన యుత్కల (ఓఢ్ర modern Orissa) దేశీయులుచూపిన దారిని 4 గళింగదేశాభిముఖుండై తరలెను. గంభీరవేదియను గంధగజము కుంభస్థలమున మావటివాఁడంకుశమునుబోలె

---

1 సుహ్మదేశము:- ఇది యిప్పటిపశ్చిమ వంగదేశము (Western Bengal) తామ్రలిప్తపురము (modern Tamluk) దీని రాజధానిగా నుండెను.

2 వంగదేశము:- ఇది యిప్పటి పూర్వవంగదేశము (Eastern Bengal)

3 కపిశానది:- ఇది యిప్పుడు మిధునపుర (Midnapore) మండలముగుండఁ బ్రవహించు కశ్శాయి (Cossya or Kasai) నదియే. దీని కుడిగట్టున నే తామ్రలిప్తపురమున్నది ఈపురపరిసరముల నిది రూపనారాయణ యను నామమునఁ బరఁగుచున్నది.

4 కళింగదేశము:- ఇది యోఢ్రదేశమునకు దక్షిణమున గోదావరినదివఱకు నున్న దేశము.

నా రాజమహేంద్రుఁడు తన తీక్ష్ణప్రతాపమును [5] మహేంద్రపర్వతశిఖరమున స్థాపించెను. పక్షములఛేదింప నుద్యమించు భిదురధరుని భూధరము శిలావర్షముతో నెదిరించువిధంబున, మాతంగములు ప్రధానసేనాంగముగాఁగల కళింగభూపాలుఁ డారాజబిడౌజుని నస్త్రవృష్టితోఁ బ్రతిఘటించెను. శాత్రవుని శరవృష్టికి నోర్చి రఘుమహారాజు యథావిధిగ మంగళస్నానమందినచందంబు మెఱయ జయశ్రీని జేపట్టెను. ఆతనియుద్ధభటులు యథేచ్ఛముగ నామహేంద్రక్షోణీధ్రంబునఁ జరించుచుఁ బానయోగ్యప్రదేశముల నేర్పఱచికొని తాంబూలపత్రపుటంబులతో నారికేళాసవంబును శత్రువులయశంబు నోయనఁ బానమొనర్చిరి. ధర్మవిజయశీలుఁడయిన యానృపాలుఁడు తన్నెదిరించిన యాకళింగాధీశ్వరునిఁ బట్టికొనియు మగుడవిడిచిపెట్టి యాతనిసిరులమాత్రము గైకొని రాష్ట్రము నాతనికె యొసంగెను.

ఆశింపకయే యప్రయత్నముగ జయమునుగాంచు నారఘునరేంద్రుఁడీవిధంబునఁ బూర్వదిశను జయించి, ఫలించిన పోకమ్రాఁకులబారుల విలసిల్లు వేలాతటంబు వెంబడి నగస్త్యమహర్షికాశ్రయమగు దక్షిణదిశకేఁగెను. ఆమహారాజుసైనికులును గజములును గావేరీనదియందు జలవిహారముల నొనర్పఁగాఁ దదంగరాగమదజలసంపర్కమునఁ బరిమళించు నావాహిని వాహినీపతియగు సముద్రునకు నవిశ్వసనీయయయ్యెను. విజిగీషాపరుఁడైన యాధీరవరునిబలంబు లింకను గొంతదూరమునకు సాగి, మరీచవనభూములఁ బరిభ్రమించు హారీతములచేఁ దనరు మలయాచలప్రాంతప్రదేశములందు విడిసెను. గుఱ్ఱపు

---

5 మహేంద్రపర్వతము:-గంజాముమండలమున కుత్తరమునను మహానదికి దక్షిణమునను నున్న మహేంద్రమలయే యిది యని కొందఱువిమర్శకుల యభిప్రాయము. కాని గంజాము, విశాఖపట్టణము, గోదావరీమండలములలోని తూర్పుకనుమలెల్ల నీపర్వతసంబంధములని చెప్పవచ్చును.

డెక్కల త్రొక్కుడులచే నచ్చటి యేలకితీఁగలు నలిగిపోవఁగ నయ్యే లకీపరాగములు పైకిరేఁగి తమవలెనే వాసించు మదపుటేనుఁగుల చెక్కిళులందు వ్యాపించెను. సర్పములు చుట్టుకొనుటచే నిమ్నములైన చందనవృక్షభాగములఁదగిల్చిన మెడగొలుసులచే నామహారాజు మదేభములు బంధింపఁబడెను. మదాతిరేకమున నామాతంగములు పదబంధములఁద్రెంపి యీడ్చుచుండినను వానిగళనిగళములుమాత్ర ము సడలవయ్యెను. దక్షిణదిశయందు సూర్యునితేజముకూడ మందమ గును. కాని రఘుమహారాజు ప్రతాపమచ్చటను విజృంభించెను. తద్ద క్షిణాధీశులగు పాండ్యభూపాలు రాపరాక్రమనిధి ప్రతాపమును సహింపనేరక యాతనికి శరణాగతులై తడపులనుండి తామ్రపర్ణీసాగ రసంగమస్థలమునుండి గ్రహించి కూడఁబెట్టికొనిన మేలిముత్తెపుమొ త్తములఁదెచ్చి చిరకాలార్జితమైన నిజయశఁబునుంబోలె నాతని చరణ కమలములకడ సమర్పించిరి. దుస్సహపరాక్రమవంతుఁడగు నారా జేంద్రుఁడంతట, సానువులందుఁ జక్కగవ్యాపించిన చందనతరులతోఁ జందనచర్చితములగు దక్షిణదిశాతరుణిస్తనంబులోయనఁ దనరు * మలయదర్దురపర్వతముల యథేచ్ఛముగ ననుభవించి, కడలిచే దవ్వునవిడువఁబడి వలువతొలఁగినపంటవలంతివలుఁదనపిఱుందో యనఁబరంగు సహ్యపర్వతమును దాఁటెను.

ఇట్లు దక్షిణదిగ్విజయయాత్ర చాలించి పశ్చిమమునందలి ♦ కొంకణదేశమును జయింప సంరంభముతో నేఁగు నాసార్వభౌముని

---

* మలయ దర్దురములు:-ఇవి పడుమటికనుమల (Western ghats) యొక్క దక్షిణభాగములు. మహిశూర (Mysore) రాజ్యముయొక్క దక్షిపుటెల్లగానున్న యీపర్వతభాగము దర్దురపర్వతమనియు నచ్చటినుండి వ్యాపించి తిరువాన్కూరు రాజ్యమునకుఁ దూర్పుసరిహద్దుగా నేర్పడిన పడుమటికనుమలయొక్క భాగము మలయపర్వతమనియుఁ జెప్పనొప్పును.

♦ కొంకణదేశము:- బొంబాయిరాజధానిలో దామను (Daman port) మొదలుకొని గోవా (Goa) యొక్క యుత్తరపుటెల్లవఱకునున్న దేశము.

యపారసైన్యము పారావారముపోలెఁ జూపట్టెను. అందుచేఁ బరశు
రాముని బాణములచే దూరముగ నెట్టివేయఁబడిన యర్ణోరాశి యింకను
సహ్యపర్వతలగ్నమైయున్నదో యనఁ దోఁచుచుండెను. మార్గ
మునఁ * కేరళదేశాధిపతులు యుద్ధరంగమున నోడింపఁబడఁగా వారి
యవరోధజనంబులు భయపడి యలంకారముల నెల్ల విడనాడి యర
ణ్యములకుఁ బాఱిపోయిరి. రఘుమహారాజు సైనికుల పదాఘాతముల
సముద్ధూతములైన ధూళు లాపూఁబోఁడుల ముంగురుల వ్యాపించి
యచ్చటఁ గుంకుమాది చూర్ణములకుఁ బ్రతినిధులుగా నిలిచెను.
♦ మురళానదీతరంగోద్ధూతములగు శీతవాతముల నుద్ధూతములైన కేతకీ
రజము లావీరపురుషుని యుద్ధభటుల కవచముల కప్రయత్నముగ లభిం
చిన గంధవాసములయ్యెను. అతిరభసమునఁ బోవు నాతని యశ్వదళముల
కవచధ్వనులు వాయుసంచలితములైన శ్రీతాళతరువనముల మర్మర
ధ్వనుల వినఁబడకుండఁ జేసెను. ఖర్జూరవృక్షమూలములకుఁ గట్టఁబడిన
కరివరంబుల కటముల స్రవించు మదజలముల సౌరభమ్ములకుఁ జొక్కి
పుష్పంధయములు పున్నాగపుష్పములఁ బోవిడిచి యాకటతటమ్ముల
వ్రాలుచుండెను. రత్నాకరుఁడు ప్రార్థితుండై పరశురామునకు నిలువఁ
జోటొసంగెను. రఘుమహారాజున కట్లుగాక యాతని పరాక్రమమునకు

---

* కేరళదేశము:- కావేరీనదికుత్తరమునఁ బడుమటికనుమలకును బశ్చిమసముద్ర
మునకు నడుమనున్న దేశము. కొంకణదేశ మీదీనికుత్తరపుసరిహద్దు కావున నిప్పటి
యుత్తర దక్షిణ కర్ణాట (North & South Kanara) మండలములు కాళిదా
సుని కాలమున కాదేశభాగములుగా నుండెనని చెప్పవచ్చును. తిరువాన్కూరు కొంకణ
రాజ్యములుగూడఁ బూర్వకాలమున నీదేశములోనివనియే చెప్పనొప్పును.

♦ మురళానది:- ఉత్తరకర్ణాట (North Kanara) మండలములోఁ
బ్రవహించుచు Karwar పట్టణమునొద్ద సముద్రమునఁ గలియు కాళీనదియే యిది
యని యెంచవచ్చును.

వెలచి * పశ్చిమసముద్రతీరవాసులగు రాజన్యులవ్యాజంబునఁగప్పంబునొసంగెను. ఆరాజేంద్రుని మత్తేభములు త్రికూటపర్వతతటముల వప్రక్రీడనొనర్పఁగా వాని దంతక్షతములే యాతని విక్రమమునకు విస్ఫుటచిహ్నములై యందు విలసిల్లుచుండెను. ఆకారణమ్మున నమ్మహీధరమే యాదేశమున నాసార్వభౌముని విజయలక్ష్మిని బ్రకటించు జయస్తంభమయ్యెను.

సంయమీంద్రుఁ డింద్రియశత్రువులఁ దత్త్వజ్ఞానమునఁబోలెఁ దదనంతరమాపార్థివేంద్రుఁడు ♦ పారసీకప్రభువుల జయింప భూమార్గమునఁదరలెను. అకాలమునఁబొడసూపు జలధరము పద్మములనుండి బాలాతపమును బాపునట్లు మధ్యేమార్గమున నాయవనీపాలుఁడు * యవనదేశమున నాకస్మికముగఁ బొడసూపి యవనుల నందఱఁ బోరికిఁజీరి వారి యబలామణుల వదనారవిందముల మధుమదంబును మాయించెను. ఆశ్వికసైన్యము బ్రధానాంగముగాఁగొని ♦ పాశ్చాత్యులు యుద్ధరంగము నలంకరించిరి. ఉభయబలంబులకు సంకులసంగ్రామము జరిగెను. అశ్వఖురపుటోద్ధూతములైన రజఃపటలములు రణరంగమంతటను వ్యాపించి యుద్ధభటులొకరికొకరు గానరాకుండఁ జేసెను. శార్ఙ్గకూజితంబులవలనమాత్రమే వారు శత్రుయోధుల గుర్తించుచుండిరి. దళముగఁబెరిఁగిన గడ్డములు మీసములుగల యా యవనవీరులశిరములను రఘుమహారాజు నిశితభల్లములచేఛేదింపఁగాఁ

---

* వీరే కొంకణ (అపరాంత) దేశాధిపులు

♦ పారసీకదేశము:- సింధునది కవతలనున్న పశ్చిమదేశము. అనగా నిప్పటి Afghanistan, Baluchistan, North West Frontier Provinces Persia మున్నగునవన్నియు నిందుఁ జేరియుండెను.

* యవనదేశము:-సింధునదికివతల యవను లనుగ్రీసుదేశీయులచే నాక్రమింపఁబడిన దేశము. ఇది యిప్పటి పంజాబుదేశమని చెప్పవచ్చును.

♦ వీరే పారసీకులు.

దేనటేఁగలు పొదివిన తేనెపట్టులచేతనుంబోలె దట్టముగ రణమేదిని వానిచేఁగప్పఁబడెను. హతశేషులైన యవనులు శిరోవేష్టనములఁ బాఱవైచి యామహారాజును శరణువేఁడిరి. దయార్ద్రహృదయుఁడై యాతఁడు వారినందఱ క్షమించెను. మహాత్ముల కోపంబు దాసుల దండంబులతో శాంతించునుగదా! ద్రాక్షానికుంజతలములందుఁబ్రశస్తచర్మముల నాస్తరణములుగ నేర్పఱిచికొని యామహారాజు సైనికులు ద్రాక్షాసవమ్ములఁగ్రోలి సమరశ్రమము నపనయించుకొనిరి.

భాస్వంతుఁడు నిజకిరణములచే జలములహరింప నుదీచికేఁగునటు లారఘుమహారాజు తనశరములచే నుత్తరదేశాధీశుల నిర్మూలించుటకప్పుడు కుబేరదిశకుఁ దరలెను. ఆపార్థివేశ్వరుని వారువంబులు సింధునదీతీరంబులఁ బొరలియాడి మార్గాయాసమును బాపికొని స్కంధకేసరములకంటికొనిన కుంకుమపుష్పాదుల దులిపికొనెను. అవక్రవిక్రమంబున నావీరపురుషగ్రామణి యా *హూణదేశాధీశుల ప్రాణములనపహరించి వారిని వీరస్వర్గమునకనిపెను అందుచే వారి యంతఃపురాంగనలు రోదనమొనర్చి ముఖతాడనము సేయ వారిగండతలములు కంది యెఱ్ఱఁబాఱెను. తమభర్తలయందా రాజశేఖరుఁడగపఱచిన ప్రతాపమే యాకాంతాజనముల కపోలముల కాపాటలవర్ణమునుపదేశించినట్లుండెను.

♦ కాంభోజదేశరాజులు పోరితంబున నావీరుని బీరంబునోర్వఁజాలక యాతని యేనుఁగుల కాలిసంకెలల యొడ్పులకు వ్రాలిన యూడుగుచెట్లతోపాటు వినమ్రులయి మేలిజాతి గుఱ్ఱములను,

* హూణులు:- (White Huns or Indo Scythians) పంజాబునకుత్తరమున సింధునదీతీరభూములు నాశ్రయించిన యొకతెగ.

♦ ఇందుకుశ (Hindoo Kush) పర్వతప్రాంతమందలిదేశము. కాంభోజి (మాషపర్ణి) యను నోషధి యీదేశమందుద్భవించుటచే దీనికీపేరుగలిగినది.

మిక్కిలి యెత్తైన పుత్తడిరాసులను మిక్కుటముగఁ దెచ్చియిచ్చి మాటిమాటికిఁ గానుకలొసంగిరి. కాని యిదియంతయు నభ్యాకాంతునకిసుమంతయు గర్వకారణముకా లేదు.

తదనంతర మామానవేంద్రుఁడు సైంధవంబుల సాధనంబులుగఁ గొని హిమవత్పర్వతశిఖరముల నధిరోహించెను. గుగ్గిలపుగోరిజల యొరయికలకు రేఁగిన దుమారములవలన నాకొండ నెత్తములు పైకి మఱింత యెదుగుచున్నట్లగపడెను. సమీపమున రాజసైనికులు మహాకోలాహలముతో నేఁగుచున్నను గుహలయందు నిద్రించు మృగేంద్రము లించుకయు వెఱవక, పరుండియే గ్రీవాభంగముగ మోరలెత్తి వారిని దేఱిచూచుచు వారితో సమమైన సత్వము తమకున్నదను సంగతిని దెల్పుచున్నట్లు గానవచ్చెను. మారుతపోతంబులు భుజపత్రివృక్షంబుల మర్మరధ్వనుల నుత్పాదించుచుఁ గీచకంబుల మనోహరముగ ధ్వనింపఁజేయుచు మందాకినీశీకరంబుల వహించుచు మార్గమందా మానవేశ్వరుని సేవించుచుండెను. సురపొన్ననీడల శయనించిన మృగమ్ముల నాభిపంకమ్ములచే సంవాసించు శిలోపరితలమ్ముల నారాజసైనికులు విశ్రమించిరి. సరళతరుస్కంధములకుఁ గట్టఁబడిన గజమ్ముల కంఠశృంఖలలందుఁ గాంతులు ప్రతిఫలించు జ్యోతిష్మతీలతలు రాత్రులయందా రఘుమహారాజునకుఁ దైలావసరములేని దీపికలుగ నుపయోగించెను. రఘుభూరమణుఁడా ప్రదేశములనుండి తరలిన తరువాత నచ్చటి * కిరాతజనము లాతని సేనానివేశములందేనుఁగుల మెడగొలుసుల రాపిడులకు రాలిన దేవదారుచెట్టుపట్టలఁ గనుంగొని యాకరివరమ్ముల పరిమాణమును గ్రహింపఁగలిగిరి. ఆహిమవన్నగేం

* కిరాతులు:- హిమాలయపర్వతముల దిగువనున్న పర్వతభూములందలి యాటవికులు.

ద్రిపటిసరంబుల నారాజేంద్రునకును, ♦ ఉత్సవసంకేతులను పార్వతీయులకును దారుణసంగ్రామము జరగెను. నారాచ, భిండివాల, పాషాణ సంఘర్షణంబుల మింటికెగసిన మంటలవలన రణరంగమత్యంతభయావహమయ్యెను. అపజయమన నెట్టిదియో యింతకుము న్నెన్నఁడు నెఱుంగని యాయుత్సవసంకేతులను శరపరంపరలచే నుత్సవహీనులుగ నొనర్చి రఘుమహారాజు తన దోర్విజయప్రబంధమును గిన్నరులచే గానమొనరింపఁజేసెను. అంత నాపార్వతీయులతనికి నుపాయనముల నర్పించిరి. అందుచే గిరీంద్రుఁడగు హిమవంతుఁడును, నరేంద్రుఁడగు రఘుభూకాంతుఁడును నొండొరుల సారంబును గ్రహింపఁగలిగిరి. ఆమహారాజంతట దుర్ధర్షమగు యశోరాశిని నాశీతనగశిఖరంబులఁ బేర్చి, రావణుండెత్తిన వెండికొండపై కేఁగుట యేటిపోటుతనమని యెంచి దానికి లజ్జకలిగించువాఁడుంబోలె దానిపై దాడివెడలక యంతటనుండి మరలి క్రిందికిఁ దిగివచ్చెను.

* లౌహిత్యాస్రవంతిని దాఁటి తనరాష్ట్రమును రఘుచక్రవర్తి ప్రవేశించినాఁడని విని ♦ ప్రాగ్జ్యోతిషప్రభుం డాసార్వభౌముని సారంగములనుగట్టిన కాలాగురుద్రుమంబులతోపాటు గడగడవడంకఁ దొడంగెను. వర్షరహితంబైన దుర్దినంబువలె సూర్యతేజమును గానరానీక యాకాశమంతటఁ గ్రమ్మిన యామహారాజు రథమార్గమందలి

---

♦ ఉత్సవసంకేతులు:- కాశ్మీరదేశమున కుత్తరమున హాటక (modern Ladak) దేశమునాశ్రయించిన దివ్యపురుషులలోని యొకతెగ.

* ఇదియే బ్రహ్మపుత్రానది. Upper Assam దేశమునందీనది యీనామమున వ్యవహరింపఁబడుచున్నది.

♦ ప్రాగ్జ్యోతిషము:-(The land of the Eastern Stars) హిందూదేశమునకు మిక్కిలి తూర్పుకొననున్న దేశము. ఇప్పటి Western Bhootan Eastern Assam అను దేశములను గలది. ప్రాగ్జ్యోతిషపురము (modern Gowhati) దీని రాజధానిగా నుండెను

పరాగపటలంబునకే యాప్రాగ్జ్యోతిషేశ్వరుని బీరము నీఱయ్యెను. ఇంక నాతఁడు కదనంబునకుఁ గడంగక యారాజేశ్వరుని చరణంబుల శరణుచొచ్చెనని వేఱుగ వివరింప ననవసరముగదా! అంతకుమున్ను తన కరిమండలము నరికట్టఁ గరంబుపచరించిన మదోత్కటకటంబులగు కరిమండలముల నర్పించి *కామరూపవిషయాధీశుండు విక్రమంబున శక్రునతిక్రమించు నాచక్రవర్తికి, శూరాతిశూరునకు, శరణాగతుండై సువర్ణపీఠంబున కధిష్ఠానదేవతయైన యాతని చరణకమలశ్రీని రత్న పుష్పోపహారంబుల నర్చించెను.

జిష్ణుండును బరాక్రమవర్ధిష్ణుండును నగు నాసార్వభౌము డివ్విధంబున దిగ్విజయ మొనర్చి, ఛత్రశూన్యములైన శత్రురాజచూడములందు నిజరథోద్ధూతధూళీపటలంబుల విశ్రమింపఁజేసి, రాజధానికి మరలెను. అంత నాయుర్వరాకాంతుఁడు తానార్జించిన సర్వస్వమును దక్షిణగా నొసంగఁదగు విశ్వజిద్యాగ మొనర్చెను. ధారాధరములకుఁ బోలె ధీరోదారులకు సమార్జనము త్యాగార్థమే గదా! యాగానంతర మాకకుత్స్థవంశభూషణుఁడు సచివానుచరుండై, రాజన్యులందఱను బరాజయదుఃఖముపశమించునట్లు సత్కారముల సంపూజించి, చిరవిరహదుస్సహాలయి భర్తృదర్శనలాలసలగు నంగనల యుత్కంఠ నపనయింపఁ దమపురంబులకేఁగుటకనుజ్ఞ యొసంగెను. ప్రయాణసమయంబున నాప్రభువులందఱు, ధ్వజకలశాతపత్రరేఖాచిహ్నంబును బ్రసాదైకలభ్యంబును నగు నాసార్వభౌముని చరణకమలద్వయంబునకు నమస్కరింపఁగ వారి కేశబంధములందలి పుష్పదామములనుండి రాలిన పుష్పాదులచే నాతని పాదాంగుళులెల్ల గౌరవర్ణభాసురములయ్యెను.

---

* కారతోయానదీతీరములనుండి అస్సాము దేశపరిసరములవఱకు వ్యాపించిన దేశము.

## —* పంచమప్రకరణము *—

విశ్వజిత్తను నయ్యాధ్వరంబున విత్తంబునెల్ల వెచ్చఁబెట్టి రఘుమహారాజు ధనశూన్యుఁడై యుండెను. ఆసమయమున వరతంతుమహాముని శిష్యుఁడు కౌత్సుఁడనువాఁడు * చతుర్దశవిద్యలను గురునివలనఁ బడసి గురుదక్షిణ నయ్యర్థపతి నర్థింపవిచ్చేసెను. అసాధారణస్వభావుండును, యశఃప్రకాశుండును, అతిథిపూజావిధేయుండును నగు నా సార్వభౌముఁడు హేమపాత్రింబులెల్ల యాగంబున దానంబొసంగఁబడియుంట, మృత్పాత్రిలో నర్ఘ్యమునుంచుకొని, జ్ఞానప్రసిద్ధుండగు నాయభ్యాగతునకెదురేఁగెను. శాస్త్రిజ్ఞుఁడు, అవసరజ్ఞుఁడు, మానధనాగ్రేసరుఁడు నగు నామానవేశ్వరుఁ డర్హాసనాసీనుఁడైన యాతపోధనుని యథాశాస్త్రిముగ నర్చించి బద్ధాంజలియై సమీపముననిలిచి యాతనికిట్లు వచించెను.

"కుశాగ్రిబుద్ధివగు నోమహాత్మా! ఉష్ణాంశుఁడు లోకమునకుఁ జైతన్యమునుబోలె నీక శేషవిజ్ఞానమొసఁగిన గురువరుండు, మంత్రిద్రిష్టలగు మానిసత్తములలోనెల్ల నుత్తముఁడునగు వరతంతుమహామునికిఁ గుశలముకదా! ఇందుృనిర్ధైర్యము సడలునట్లు మనోవాక్కాయకర్మముల నిరంతరముఁ గూర్పఁబడిన యామహనీయుని త్రివిధతపోధనమ్ములంతెరాయములవలన వ్యయముపొరయుటలేదుగదా! పాదులు కట్టుట, నీరుపోయుట మున్నగు వ్యవసాయములచే మీారు కన్నబిడ్డలకంటె నెక్కుడుగా రాబముగఁ బ్రోదిసేయఁగాఁ బెరిఁగి, మీాకపారసౌఖ్యములొసంగి, శ్రిమమునపనయించు నాశ్రిమమహీరుహమ్ములకుఁ

* చతుర్దశవిద్యలు:— ఋుగ్యజుస్సామాధర్వణవేదములు, 4, శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందము, జ్యోతిషము, అను వేదాంగములు, 6, (11) ధర్మశాస్త్రము (12) పురాణము (13) న్యాయము (అన్వీక్షికి యని కొందఱు) (14) మీామాంస.

బ్రిభంజనాద్యుపద్రవంబు లుప్పతిల్లవుగదా! నిత్యస్నానంబులకుఁ బితృదేవతర్పణంబులకు నుపచరించునవియు, దేశపాలురకని మీరువిభాగించు నుఞ్ఛధాన్యషష్ఠాంశములతో నొప్పు సైకతతలంబుల విలసిల్లునవియునగు మీతీర్థజలంబులకు శుభంబెకదా! ఉరగాదులవలని సెరగులు పొరయకుండుపొంటెఁ బుట్టినదాది పదిదినములు బొడ్డులు (చేరులు) జాఱి యొదులందుఁబడుదనుక మునీశ్వరులచే నిజాంకతలంబుల సంరక్షింపఁబడునవియు నత్తపోధనుల కనుష్ఠానసాధనములగు దర్భలపైఁబరుండి మొనవినను దూరముగఁ దోలి వేయఁబడక ప్రేమాతిశయమున వారిచేఁ బెంపఁబడునవియు నగు మృగశాబకము లనపాయములుగనున్నవికదా! సమయమున కేతెంచు నతిథిజనములకుఁ బెట్టుటకును, మీశరీరములఁ బోషించుకొనుటకును సాధనములగు వన్యనీవారపాకాదులను జనపదములనుండి కడంగరీయములువచ్చి భక్షింపవుగదా! సకలవిద్యలను సమగ్రముగ నేర్చి ప్రసన్నుఁడై గృహస్థాశ్రమమును స్వీకరించుటకు వరతంతుమహర్షి నీకనుజ్ఞ యొసంగెనా? బ్రహ్మచర్య, వానప్రస్థ, యత్యాశ్రమస్థులకెల్ల నుపకారమొనర్ప సమర్థమగు నా ద్వితీయాశ్రమమును గైకొనుటకు నీకిదేసమయము. మహాత్మా! పూజ్యుండవైన నీవు విచ్చేసినంతమాత్రమున నామనంబు తనివినొందక నీయాజ్ఞను శిరసావహించి నెఱవేర్చుటకుఁ ద్వరపడుచున్నది. నన్నుఁ బవిత్రునిఁజేయుటకిట్లు వనమునుండి విచ్చేయుట నీగురువరుని యాజ్ఞ చేతనో స్వబుద్ధివలననో సెలవిమ్ము."

నావుడుఁ దనకర్ఘ్యమొసంగిన మృత్పాత్రమూలముననే యామహారాజు సర్వస్వత్యాగమొనరించి ధనశూన్యుఁడై యున్నవాఁడని కౌత్సమహాముని యూహించి, యారాజేంద్రుఁడాడిన యుదారవచనముల వినియుఁ దనకోరిక యాతనివలన నెఱవేఱదని నిరాశుఁడై యాతనికిట్లు బదులువలికెను.

"మహారాజా! మేమన్నివిధముల క్షేమముగ నేయున్నవారము. నీవు చక్రవర్తివై పాలించుచుండఁ బ్రజలకు నశుభంబు లెట్లుకలుగును? వేవెలుంగు వెలుంగుచుండ జనులనేత్రముల నంధతమస మావరింపఁ గలదే? పూజనీయుల భక్తిమైఁ బూజించుట నీవంశమువారికెల్ల వెన్నతోఁడఁబెట్టినది. అందునను మహాభాగుఁడవు నీవావిషయమున నీపూర్వులనతిక్రమించుచున్నాఁడవు. సమయమునకు రాక యాలస్యముగ నర్థిభావమున నిన్నుఁ జేరవచ్చుట నాకు విచారము కలిగించుచున్నది. సంపదలనెల్ల సత్పాత్రవినియోగమొనర్చి శరీరమాత్రమున మిగిలిన నీవు, మునీశ్వరప్రముఖులగు నరణ్యవాసులు ఫలమునుగ్రహింప వట్టిదంటుమాత్రమున నిలిచిన నివ్వరిమొక్కవలె నొప్పారుచున్నావు. సార్వభౌముఁడవు నీవు యజ్ఞమున సర్వస్వమును ధారవోయుటవలనఁ గలిగిన దారిద్ర్యమును బ్రకటించుచుంటివి. అది నీబోటి ధీరోదాత్తులకు యుక్తము. కృష్ణపక్షము పదునేనుదినములు వరుసగ సమస్తదేవతలచే నాస్వాదింపఁబడుచంద్రకళల క్షీణత్వము తద్వృద్ధికంటె శ్లాఘ్యతరంబుగదా! గురుదక్షిణాసమార్జనముతప్ప నితరప్రయోజనములేని నేనందులకై వేఱొకచోఁ బ్రయత్నించెదను. కేవలము ధారాధరముపై నాధారపడినదయ్యుఁ జాతకపక్షి నిశ్శేషవర్షితాంబువగు శరత్కాలమేఘము నపేక్షింపదుగదా! నావిషయమై ఖేదపడకుము. నీకు శుభంబగుఁగాక! నేఁబోయివచ్చెద సెలవొసంగుము."

ఇట్లుపలికి మరలిపోనిచ్చగించిన యామునికుమారునాఁపి యా రాజచంద్రుఁడు "విద్వద్వర్యా! నీవు గురువునకీయఁదగిన వస్తువేది? అది యేపాటిది?" అని యడిగెను. అంతటఁ బండితుఁడును బ్రహ్మచారియు నగు నాకౌత్సుఁడు, యథావిధిగ యాగముల నెఱవేర్చినవాఁడును, గర్వరహితుఁడును, వర్ణాశ్రమధర్మరక్షకుఁడును నగు రఘు

పునకుఁ బ్రకృతవిషయముల నిట్లు వక్కాణించెను. "వరతంతుమహామునియొద్ద విద్యాభ్యాసమును ముగించి గురుదక్షిణ యేదేని నావలన స్వీకరింపుమని యాయనను నేను బ్రార్థించితిని. కాని యామహానుభావుఁడు చిరకాలమునుండి యస్ఖలితభక్తితో నేనాయనకొనరించిన యుపచారములనే పెద్దగగణియించి నాయొద్ద నెట్టిదక్షిణను గైకొననొల్లఁడయ్యెను. అయినను నేనావిషయమై మాటిమాటికిఁ బ్రార్థించి నిర్బంధమొనర్చుటంజేసి యామహాత్ముఁడు గినిసి నాదారిద్ర్యమును దలంపకయే నేనాయనవలన నేర్చిన విద్యల సంఖ్యనుబట్టి పదునాలుగు కోట్ల ధనమ్మునిమ్మని యాగ్రహమ్ముతో నాజ్ఞాపించెను. కాఁబట్టి నేనొసంగవలసిన గురుదక్షిణ మహత్తరమయియున్నది. నీవు నాకర్ఘ్యమిచ్చిన మృత్పాత్రమునుబట్టియే నీవిప్పుడు ప్రభుశబ్దమాత్రమున మిగిలియున్నవాఁడవని నిశ్చయించితిని. కావున నిన్నీవిషయమున మొగమోటపెట్టుట నాకిష్టముకాదు."

ఈవిధంబున వేదవిదుండా ద్విజుండెఱింగింప ద్విజరాజనిభతేజుండును, పాపనివృత్తేంద్రియవర్తనుండును, జగదేకనాథుండుననగు నామహారాజాతనికిట్లు ప్రత్యుత్తరమొసంగెను. "మహాత్మా! సకలశాస్త్రపారగుఁడగు బ్రాహ్మణుండు గురుదక్షిణను యాచింప రఘువునొద్దకేతెంచి యభీష్టమును బడయక వేఱొకదాతకడకేఁగెననెడి యుపవాదము నేఁడు నూతనముగ నాకుఁ గలిగింపఁబోకుము. నన్ను క్షమించి పావనంబై ప్రశస్తంబైన నాయగ్నిశాలయందుఁ ♦ త్రేతాగ్నులతోఁ జతుర్థాగ్నివలె రెండుమూఁడు దినములుమాత్రము నివసింపుము. ఇంతలో భవదభీష్టము నెఱవేర్పఁ బ్రయత్నించెదను.

♦ త్రేతాగ్నులు:- (1) ఆహవనీయము (హోమాదిక్రియలకుపచరించునది. (2) గార్హపత్యము (గృహకృత్యములకుపచరించునది) (3) దక్షిణాగ్ని.

అనవుడుఁ గౌత్సుఁడును సంతుష్టాంతరంగుఁడై వల్లెయని వమ్మగాని యమ్మనుజేశ్వరుని వచనమ్మునకు సమ్మతించెను.

దిగ్విజయమొనర్చి భూమండలమందలి ధనమెల్ల నిదివఱకే గ్రహించియుంట, రఘుచక్రవర్తి దానికై భూతలాధీశులపై దాడి వెడలుట వ్యర్థమనితలపోసి యర్థసంగ్రహణార్థ మర్థపతియగు కుబేరునిపై దండెత్తనిశ్చయించెను. తపోనిధియగు వశిష్ఠమహర్షి మంత్రోదక ప్రోక్షణపరిభూతప్రభావమ్మున నాసార్వభౌముని రథగమనంబునకు, వాయుసఖుండగు వలాహకునకుంబోలె, సముద్రాకాశమహీధరమ్ము లందుఁగూడ నడ్డులేదుగదా! పరిశుద్ధుఁడు ధీరుఁడునైన యప్పార్థివేశ్వరుఁడు యక్షాధ్యక్షుని సామంతమాత్రునిగ సంభావించి, బలౌద్ధత్యమున నాతని జయింపనెంచి యంతర్భాగమున సమస్తశస్త్రాస్త్రము లుంచి సిద్ధము సేయఁబడిన యరదమునందు శుభప్రదంబగు గోధూళి లగ్నంబున శయనించెను. ప్రభాతంబగుడు నాప్రతాపనిధి ప్రయాణోన్ముఖుండై యుండెను. అంతఁ గోశగృహాధ్యక్షులు విస్మితులయివచ్చి ధనాగారమధ్యమున నాకాశమునుండి హేమవృష్టికురిసినదని యాతనకి విన్నవించిరి తాను దాడివెడలనెంచిన ధనదునిచే నంపఁబడి వజ్రాఖండలాయుధఖండితంబగు సుమేరుశృంగంబువోలె వెలుంగు నా హేమరాశినంతయు నాభూరమణుండా కౌత్సునకొసంగెను. కాని యామునికుమారుఁడు తాను గురునకీయఁదగు పదునాలుగుకోట్లకంటె నొకతృణమైనను దనకక్కఱలేదని యాసువర్ణపుంజమునంతయు గ్రహింపనొల్లఁడయ్యెను. ఆతనినిమిత్తమై ప్రయత్నింప లభించినది గాన నాధనంబంతయు నతఁడే గ్రహింపవలెనని యందులో నొకింతయు మిగుల్చుకొన నాచక్రవర్తి యిష్టపడఁడయ్యెను. గురుదక్షిణాధిక ధనంబున నిస్పృహతవహించినట్టియు నర్థియర్థించినదానికన్న నెక్కుడొసంగునట్టియు నవ్వనీపకావనీపకతిలకుల వ్యాపారములు క్రమంబుగ

సాకేతపురవాసులకెల్ల సన్నుతిపాత్రంబులయ్యెను. ఎట్టకేలకా కౌత్స ముని రఘుమహారాజు నిర్బంధమున సంతోషముతో నాధనరాశినం తయు గ్రహించెను. వందలకొలఁది లొట్టియలమీఁద నాఁడుగుఱ్ఱ ములమీఁద నద్ధనము నెక్కించుకొని ప్రయాణోన్ముఖుఁడైన యా ఋషికుమారుఁడు, శరీరపూర్వభాగము వంగ నమ్రతతోఁ దనకు నమ స్కరించు రఘుమహారాజును హస్తంబున స్పృశించుచు నిట్లు వచిం చెను. "రాజోత్తమా! ధనమును న్యాయముగ నార్జించుట, పెంచుట, పాలించుట, సత్పాత్రమున వెచ్చించుట యను చతుర్విధములఁబరఁగు రాజవృత్తమున నీవు వర్తించుచుండ భూదేవి నీకోరిన యర్థములనెల్ల సమకూర్చుటొక వింతకాదు. కాని స్వర్గలోకముకూడ నీయిష్టార్థముల నీవు తలంచినంతనే ప్రసాదించినది. ఆహా! అచింతనీయంబగు నీ ప్రభావంబు నభివర్ణింప నేరితరము? సకలసంపత్సమగ్రుండవగు నీకి తరాశీర్వాదములన్నియుఁ బునరుక్తంబులేయగును. కావున నీజనకుఁడు దిలీపుఁడు సన్నుతిపాత్రుని నినుఁ గాంచినటుల నీవును నీకనురూపుఁ డగు పుత్రునిఁ బడయుము."

ఇట్లామహారాజు నాశీర్వదించి యాబ్రాహ్మణశ్రేష్ఠుఁడు నిజ గురుండగు వరతంతుమహాముని సన్నిధికేఁగెను. రఘుచక్రవర్తియుఁ దదాశీఃప్రభావమునఁ బ్రాణిలోకము లోకబాంధవునివలనఁ బ్రకాశ మునుంబోలె, శీఘ్రమే పుత్రరత్నమును బడసెను. అజనామకమగు (బ్రాహ్మ) ముహూర్తమునందాతని దేవి *కుమారకల్పుఁడగు కుమా రునిఁగనెను. ఆకారణమ్మున నారాజచంద్రుఁడాతనికి (బ్రహ్మనామమును బట్టి) యజుఁడని నామకరణమొనర్చెను. తేజస్వంతమగు రూపమునను,

* ఈమెపేరును గాళిదాసు చెప్పియుండలేదు. ఇతరాధారములనుబట్టి హేమాద్రిపండితుఁడీమె నామము ప్రభావతి యని తన వ్యాఖ్యానమున నుదాహరిం చియున్నాఁడు.

శౌర్యమునను, నిసర్గౌన్నత్యమునను నబ్బాలుఁడు సర్వవిధముల జనకునిఁబోలియుండెను. దీపము నిజకారణమగు ప్రదీపముకంటె నేవిధమునను భిన్నముగానటు లాబిడ్డఁ డేవిషయమునను దండ్రికంటె వేఱుగాఁ గానరాఁడయ్యెను. యథాశాస్త్రముగ విద్యలనెల్ల గురువులవలన నేర్చి యారాజపుత్రుఁడు యౌవనావిర్భావమున నత్యంతమనోహరుఁడయి పొడకట్టెను. కావున రాజ్యలక్ష్మి యాతనింగవయుటకభిలషించి, స్థిరోన్నతచిత్తయగు కన్యక వివాహార్థము గురునియాజ్ఞనుంబోలె, రఘుమహారాజు నానతిని బ్రతీక్షించుచుండెను.

ఇట్లుండ విదర్భదేశాధీశుఁడగు భోజభూపాలుఁడు తనచెల్లెలగు నిందుమతికి స్వయంవరముగావించి యజునకే యామె నీయనెంచి యాతనిఁదోడ్తెచ్చుటకు రఘువునొద్దకాప్తుఁడగు నొకదూతను బుత్తెంచెను. రఘుమహారాజును భోజునితోడి సంబంధము తనకుఁ దగినదనియుఁ గుమారుఁడు పెండ్లియాడునకు వచ్చినవాఁడనియు నెంచి, సంపత్సమృద్ధమగు విదర్భరాజధాని కాతనిని సైన్యసమేతముగఁ బంపెను. ఆ రాజనందనుఁడు స్వయంవరమునకేఁగునపుఁడు మార్గమున రాజయోగ్యములగు పటభవనములు నిర్మింపఁబడి శయనాద్యుపచారములతో నమర్పఁబడెను. జనపదములనుండి వచ్చేసి జనంబులాతనికుపాయనంబులర్పించిరి. అందుచే నావసతులు వన్యములయ్యు నవన్యములుగఁ గానవచ్చి యుద్యానవిహారతుల్యంబులయ్యెను. ఇట్లు కొంతదూరము చనిచని యజమహారాజు శీతలమందమారుతంబులఁ గంపించు కానుగుచెట్లతోఁడనొప్పు నర్మదానదీతీరమును జేరెను. సైనికుల పదసంఘట్టనల నెగసిన రజఃపటలమ్ములచేఁ బతాకములు ధూసరితములగుటను మార్గాయాసమునఁ జమూసమూహమంతయు బడలియుండుటను నారాకుమారుఁడంత సైన్యము నానదీతటమున విడియించెను. ఆసమయంబున మదజలంబులకాసించి నదీజలంబులపై మూఁగి

యాదుభ్రమరము లాస్రవంతిలో వనగజంబొకండు మునింగియుండు టనుసూచించుచుండెను. మదజలములు నిశ్శేష ధౌతములగుటచే నమలములై ప్రకాశించు గండమున్యములతో నంత నాదంతావళము నదీప్రవాహమునుండి యుద్గమించెను. అాలతోఁగోరాడుటవలన మొక్కపోయి, సంపూర్ణ క్షాళనమున గైరికాదిధాతువులు గాన్పింపకున్నను నల్లనిసిలువుగీఱలచేఁ బలురంగులవిలసిల్లుకోఱ లామదావళము ♦ ఋక్షవత్పర్వతతటముల వప్రక్రీడలఁ జల్పినట్లు చూపఱకుఁ దెల్పుచుండెను. సంహారవిక్షేపముల శీఘ్రవ్యాపారముగల శుండాదండమున నవ్వేదండము మహత్తరవారితరంగములను భయంకరముగ శబ్దించునట్లు విదారించి, తీరాభిముఖంబయివచ్చుచు * వార్యర్గళంబుల విఱుగఁగొట్టుటయందుఁగూడ నివ్విధంబునఁ బ్రవర్తించునదియుంబోలెఁ గానవచ్చుచుండెను. శైలసన్నిభంబగు నామదేభంబుచే ముందునకు గఁద్రోయఁబడిన జలప్రవాహము మొట్టమొదట గట్టెక్కెను. తదనంతరమామాతంగము శైవలమంజరీజాలముల నురమ్మున నీడ్చుకొని వచ్చి నదీతీరంబు నధిరోహించెను. ఏకాకియైయున్న యాయనేకపము కటతటములందలి మదజలవృష్టి జలావగాహంబున క్షణమాత్రము శాంతించినను, నగరసంబంధంబులగు నజమహారాజు ద్విరదంబులఁ గాంచినంతనే యూరి మరల స్రవింపఁదొడంగెను. ఏడాకులయరఁటిచెట్లసోనవలె దాని దానజలము పరిమళించుటచేఁ దదాఘ్రాణము సహింపలేక యారాకుమారుని సేనాగజములన్నియు మావటీండ్రు తీవ్రయత్నంబులెన్ని చేసినను లొంగక పరాఙ్ముఖంబులయ్యెను. వాడు

♦ ఇది కులపర్వతములలో నొకటి. మధ్యమపరగణాల (Central Provinces) లోని ఖాండవవన (Gondvana) పర్వతపంక్తియే యిదియని యెంచ వచ్చును.

* వారి = గజబంధనస్థానము.

వంబులు కట్టులం(దెంపికొని పాఱిపోయెను. ఇరుసులువిఱిగి యరదము లెల్లనురలం(బడెను. యోధులెల్ల నిజకాంతారక్షణమునం దత్తఱపడ సాగిరి. ఇట్లొకనిముసములో శిబిరమంతయుం బాడువడి యల్లకల్లోల మయ్యెను. యుద్ధరంగమునందక్క నేనుఁగును జంపుట రాజులకుం దగ దని శాస్త్రమువలన నెఱిఁగినవాఁడౌట నజమహారాజు మిఁ(దకవచ్చు నవ్వనద్విపంబును జంపఁదలంపక యూరక మరల్పఁగోరి, నాతిదీర్ఘము గఁ జాపంబు తివిచి యొక్కశిలీముఖంబున దానికుంభస్థలము నేసెను.

ఆబాణమింతుక శరీరమునకుఁ దాఁకినమాత్రమున నాద్విపం బారూపంబువిడిచి ధగధగమెఱయు కాంతిపుంజములనీను మనోహర శరీరమున నొప్పు నాకారముతో నొక దివ్యపురుషుండయి గగనతలం బున సంచరించుచుండెను. ఆశ్చర్యమున నామహారాజుసైనికులందఱా పురుషుని విలోకించుచుండిరి. నిజప్రభావంబున సంప్రాప్తములైన కల్ప వృక్షప్రసూనముల నజమహారాజుపైఁ గురిసి దంతకాంతులచే నురం బందలి తారహారంబుల మెఱుంగులు తుఱంగలింప, వచనచతురుం డగు నాఖేచరుండు గంభీరవచనంబుల నిట్లు పలుకఁగడంగెను.

"రాజచంద్రమా! వినుము. నేను బ్రియదర్శనుఁడను గంధ ర్వరాజు కుమారుఁడను. నన్నుఁ బ్రియంవదుండందురు. పరమేశ్వర సేవార్థమై చను మతంగమహామునిని నేనొకసమయమున గర్వితుఁడ నయి మదాతిరేకమున నెదుర్కొని యుపచారమొనర్చుటచే నమ్మ హాత్ముఁడు మత్తమతంగజరూపమున నుండుమని నన్ను శపించెను. అంత నేనాతని పదపద్మములకెరఁగి వేఁడికొనఁగా నాయెడ మరల నమ్మహానుభావుఁడు ప్రసన్నుఁడయ్యెను. జలమున నుష్ణత్వమనునది జ్వలనాతపసంపర్కమున సంభవించుచున్నది గాని శీతలత్వమేక దా దాని స్వభావము! అట్లే నాగర్వకారణంబునన క్రోధముపూనిన యా

మహర్షి నా వేఁడికోలున స్వాభావికమ్మగు కరుణవహించి "ఇక్ష్వాకు వంశజుఁడజుఁ డెవ్వఁడు నీకుంభస్థలమును బాణమున భేదించునో యా క్షణమ నీవు ప్రభావసంపన్నమగు నీపూర్వదేహంబునొందుదు" వని శాపాంతమును బ్రసాదించెను. చిరకాలమునుండి భవద్దర్శనమ్మున కూటలూరుచున్న నాకు భాగ్యవశంబున బలవంతుఁడవు నీవు నేఁడు లభించి శాపవిముక్తి ననుగ్రహించితివి. ఇందులకేదైనఁ బ్రత్యుపకారము నీకొనర్పనేని నాయీదివ్యపదంబును మరల నేనొందిన యీ భాగ్యంబును వ్యర్థంబులగునుగదా. ఉపకారికిఁ బ్రత్యుపకారమొనర్పని వాఁడు జీవించుటకంటె మరణించుట మేలని పెద్దలు వాక్రుత్తురు. కావున నోసఖుఁడా! ప్రయోగోపసంహారంబులవిభక్తంబైన మంత్రం బుగల్గి సమ్మోహనాభిధానంబునఁ బ్రఖ్యాతమై గంధర్వదేవతాకం బయిన నాయస్త్రంబును గ్రహింపుము. దానిని బ్రయోగించువానికి శత్రుభయము శశవిషాణము. విజయము కరతలామలకము. నీచే బాణమునఁ గొట్టఁబడిన వానినుండి బాణము నెట్లు గ్రహింపనగునని విచారింపకుము. నన్నుఁ గొట్టినందుల కెంతమాత్రము లజ్జింపకుము. తుదకు బాణంబునఁ గొట్టినను నీవొకింతసేపు నాయెడ దయాభావం బునే నెఱపితివి. కావున నక్కరుణ నిప్పుడుగూడ నొకింత యనుగ్రహింపుము. ఇట్లు సంప్రార్థించు నాప్రార్థనమును ద్రోసివేయు పరుషత్వమును నాయెడఁ బ్రయోగింప నీకు న్యాయముకాదు. నామనవిఁ బాలించి నను ధన్యునిఁజేయుము."

ఈవిధంబునఁ బ్రార్థించు నాశాపవిముక్తుని వేఁడికోలునుద్రోసి వేయఁజాలక వల్లెయని యస్త్రవిదుండైన యానృపచంద్రుఁడు చంద్రోద్భవయగు నర్మదానది పవిత్రజలముతో నాచమనమొనర్చి యుత్తరాభిముఖుండై ప్రియంవదునివలన నాసమ్మోహనాస్త్రమంత్రము నుపదేశమందెను.

ఆహా! ఆరణ్యకామలకంబునకు నంబుధిలవణంబునకు సంయోగము సంఘటించిన యాఘటనాఘటనఘటనసమర్థుని యద్భుతమహిమంబు లచింతనీయంబులుగదా! మార్గమున దైవయోగమున నిట్లచింత్యకారణంబగు సఖ్యంబునందిన యాయిరువురు నెచ్చెలులలోఁ బ్రియంవదుఁడు కుబేరోద్యానప్రదేశములఁగూర్చి పోయెను. అజుఁడు రాజన్వతియై మనోహరంబైన * విదర్భకేఁగెను.

అజమహారాజు విచ్చేసి పురోపకంఠమున విడిసియున్న వార్త చారులవలన నెఱింగి విదర్భేశ్వరుండు చంద్రునిఁగాంచి యుప్పొంగు సంద్రంబువలె నితాంతసంతోషమున నోలలాడి యారాజచంద్రునకెదురేఁగి ముందఱ తాను నడచుచు నాతని నిజపురంబునకుఁ గొనిపోయి, పురజనంబులు తన్ను నతిథిగను నజుని గృహాధిపతిగను దలంచునట్లు, వినయముతో నాతనికి సమస్తైశ్వర్యములర్పించి యుపచరించెను. అంత విదర్భాధిపుని యుద్యోగస్థులు రఘుతుల్యుండగు నాయజునకుఁ బ్రణామంబులాచరించి, తూర్పువాకిటియరఁగుమీఁద మంగళార్థము పూర్ణకుంభములుంపఁబడిన యొకమనోహరనూత్నరాజభవనమున నాతనికి విడిది నేర్పఱిచిరి. మదనుఁడు యౌవనదశనుబోలె నామహారాజా భవనంబు నధిష్ఠించెను.

ఏసుందరీమణిస్వయంవరమునకయి నానాదిగ్దేశములనుండి రాజన్యులు రప్పింపఁబడిరో యాకమనీయకన్యాలలామంబగు నిందుమతీదేవి పాణిగ్రహణమభిలషించు నజమహారాజున కాశుభభవనమున శయనించినను బ్రియుని మనోగతభావము నెఱుంగని ప్రియాంగనవలె నారాత్రియందు నిద్ర చాలసేపునకుఁగాని రాదయ్యెను.

---

* Modern Bidar కుంతలదేశమునకుత్తరమునఁ గృష్ణానదికి నర్మదానదికి నడుమనున్న దేశము. ఇప్పటి నిజాంరాజ్యము. బీరారుపరగణా దీనిలోని భాగములే. దీనిరాజధాని కుండినపురము.

నిద్రియందాతని కర్ణకుండలములు మాంసలంబులగు నంసప్రదేశం బుల నొత్తికొనుటచే నందు గుఱుతులేర్పడెను. పాన్పుమీఁది వస్త్రము నొరయికచే నాతని యంగరాగము కడుంగడుసడలిపోయెను. తెల్ల వాఱుజామున సవయస్కులుఁ బ్రౌఢవచస్కులు నగు వైతాళికు లధికజ్ఞానవంతుఁడగు నామహారాజును స్తోత్రపాఠంబుల నిట్లు మేలు కొలిపిరి.

"సుధీమణీ! రాత్రిగతించినది. చతురాననుఁడు రెండుభాగ ములుగా విభజించిన యీజగతీభారములో నొకభాగమును నిద్రిచా లించి నీతండ్రి రఘుమహారాజొకవైపున వహించుచున్నాఁడు. రెండ వభాగము నీవొకప్రక్క వహింపవలయునుగదా! కావున నీవునుశయ్యా నుండి లెమ్ము. భర్త పరాంగనాసంగతిఁ జెందెనని విని యీర్ష్య వహించు ఖండితనాయికవోలె, లక్ష్మీదేవి నీయందనురక్తయయ్యు నిద్రాధీనుఁడవగుట నిన్నొప్పరికించి నీవదనారవిందముతోఁడి సాదృశ్య ముగల యిందునితో రాత్రియంతయు వినోదించినది. అతఁడును ముఖకాంతిని గోల్పోయి యిప్పుడపరవార్ధిని గుప్పించుచున్నాఁడు. అనన్యశరణ్యయగు నక్కమలాసతిని బరిగ్రహింపుము. ఱెప్పలమా టునఁజలించు కనీనికలచే భాసురంబులగు నీనేత్రంబులును, లోనఁబరి భ్రమించు భ్రమరంబులతో నొప్పు పద్మంబులును నేకకాలమున వికాసమొంది యన్యోన్యసాదృశ్యమునందుచున్నవి. ఉషఃకాలసమీ రణము, భవన్ముఖమారుతస్వాభావికసౌరభంబును నన్యసౌగంధ్యసంప ర్కమునఁ గృత్రిమముగనైనఁ బడయఁగోరి వృక్షవాటికల సంచరించి తొడిమలనుండి సడలు కుసుమములహరించుచుఁ దరణికిరణమ్ముల గిలిగింతలచే వికసించు తమ్మిమొత్తములతోఁ జేరుచున్నది. వులుగడి గిన ముత్తెమువలె నమలమై వెలుంగు హిమజలంబు తరుపల్లవతామ్రో దరంబులఁబడి తత్పాటలవర్ణ సాంగత్యమున గుణోత్కర్షమునొంది భవ

ద్బింబాధరంబుపయి దంతకాంతులఁగూడి విలసిల్లు లీలాస్మితంబువలె విరాజిల్లుచున్నది. ప్రతాపనిధియుష్ణాంశుఁ డుదయింపకమున్నె యాతని సారథి యనూరుఁడు శీఘ్రముగఁ దమమును విధ్వంసమొనరించుచున్నాఁడు. ఓవీరవరేణ్యా! అట్లే రణరంగములకు నీవు ముందుగఁజని వైరివీరుల విగతజీవులుగ నొనర్చుచుండఁ బ్రతాపమూర్తియగు భవజ్జనకుఁడు స్వయముగ శత్రువుల సంహరించుట యనవసరమగుచున్నది. నీయేనుఁగులు కుడియెడమలఁ బరుండి నిద్రఁదీర్చికొని మొరయుచున్న సంకెలల నీడ్చుకొనుచుఁ గట్టుకంబములనుండి లేచుచున్నవి. బాలార్కకిరణసంపర్కమున వానిదంతకుట్మలములు వప్రకేళిభిన్నములైన మనశ్శిలాది గైరికతటంబులచేతనుంబోలె నెఱ్ఱఁగఁ బ్రకాశించుచున్నవి. విశాలపటమంటపంబులఁ బంధింపఁబడిన యీపారసీకసైంధవంబులు నిద్రనువిడనాడి, యాస్వాదించుటకుఁ దమముందటనుంచిన సైంధవశిలాఖండముల నిశ్వాసపవనోష్ణతచే మైలపఱచుచున్నవి. పూవులు వాడుటవలనఁ బూజార్థముఁగూర్పఁబడిన పుష్పదామములరచన శోభావిహీనమగుచున్నది. దీపములు దమ కిరణపరివేషములు మాసినందున వెలవెలఁబాఱుచున్నవి. మంజువాణియగు నీ పంజరశుకంబు నినుఁ బ్రబోధించు మామాటల మరలఁ బలుకుచున్నది. కావున నోరాజమార్తాండ! నిద్రచాలించి మేల్కొనుము."

ఇట్లు స్తుతులొనర్చు నావందిమాగధకుమారుల గంభీరవచనమ్ముల నారాకుమారుఁడు నిద్రనుండి మేల్కొని, మదగర్వమున మధురనినదములొనర్చు రాజహంసములచేఁబ్రబోధింపఁబడి సుప్రతీకదిగ్గజము గంగాపులినతలమునుండివలె, శయ్యాతలమునుండి లేచెను. సుందరములగు కనుఱెప్పలుఁగల యాయుజమహారాజంతట విధివిహితముగఁ గాల్యకృత్యములఁ దీర్చికొని కుశలులగు ననుచరులు రచిం

చిన సమయోచితనైపథ్యముం ధరించి స్వయంవరమంటపమందలి రాజమండలమును జేరంబోయెను.

---

## —* షష్ఠప్రకరణము *—

అజుం డట్టులా స్వయంవర మంటపమున కేఁగి రాజోపచారయుక్తములైన యున్నతస్థానంబులందలి గద్దియలమీఁద, విమానములపై సంచరించు విబుధగణంబుల విలాసంబుల నాకర్షించుచు మనోహరాలంకారముల విలసిల్లు రాజకుమారవర్గంబును విలోకించెను. రతీదేవి దీనాలాపములఁ గరుణార్ద్రహృదయుఁడై పరమేశ్వరుఁడు మరల శరీర మొసంగిన నవమన్మథునివలెఁ బ్రకాశించు నాకుత్స్థవంశతిలకునిఁ గనుంగొని యచ్చటి రాకుమారులందఱు నీక నట్టి సర్వాంగసుందరుని విడిచి యిందుమతీదేవి తమ్ము వరించునాయని యామెయెడ నిరాశులయిరి. మృగేంద్రశాబకము శిలావిభంగముల నున్నతనగాగ్రము నుంబోలె నంతి నానరేంద్రకుమారుఁడు విదర్భేశ్వరుండు చూపిన యొక యున్నతస్థానమును దత్సోపానపంక్తులమీఁదుగ నధిరోహించెను. శ్రేష్ఠములగు చిత్రకంబళంబుల నలరారు రత్నాసనంబు నధివసించి యారఘుకుమారుఁడు మయూరపృష్ఠాసీనుఁడగు కుమారస్వామికరణి కరంబు వెలుఁగొందెను. లెక్కకు నెక్కువై బారులుతీరిన యారాకుమారులయందుఁ బ్రభావిశేషములనుదయించి చూడనశక్యముగానున్న శోభ, మేఘమాలికలయందు మెఱుంగుఁదీవవోలె, వేవిధంబుల సంక్రమించి ప్రకాశించుచుండెను. ఉజ్జ్వలభూషావిభూషితులై యుత్తమసింహాసనాసీనులై యున్న యారాజన్యులమధ్య నాయజమహారాజు నిజతేజమునఁ గల్పద్రుమంబులనడుమఁ బారిజాత

వృక్షంబువలె విరాజిల్లుచుండెను. మదజలంబులు స్రవించు కటతటంబుల నొప్పారు వన్యగంధద్విపంబును గాంచినంతనే తత్పార్శ్వము తామాశ్రయించిన కుసుమితతరునికరములఁబాసి భ్రమరసంతతు లామదేభ మునందు వ్రాలునట్లు, వేడ్కమీఱఁ దక్షుంగల రాకుమారుల విలోకించు పౌరజనంబుల విలోకనలోకంబు లతిలోకసుందరుండగు నానృపకుంజరునిఁ జూచినంతనే యందఱవిడనాడి యాతనియందతగుల్కొనెను. అనంతరము రాజవంశచరితంబుల లెస్సగనెఱింగిన వందిజనంబులు స్వయంవరసమాగతులయిన యాసూర్యచంద్రవంశజనిత రాజన్యులకుఁ గైవారములొనర్చిరి. కృష్ణాగురుధూపము లామంటపమున మనోహరపరిమళములఁ బ్రసరింపఁజేయుచుఁ బతాకములపైఁ వ్యాపించుచుండెను. శంఖధ్వానములను మంగళతూర్యారావంబులను దిగంతంబులెల్ల మాఱుమ్రోయుచుండెను. ఆనిస్వనంబులు ఘనాఘన గర్జారావంబులని భ్రమించి, పురసమీపోద్యానముల విహరించు కలాపికలాపములు కలాపములవిచ్చి నాట్యమొనర్చుచుండెను.

అంతఁబతిని వరించునిమిత్తమిందుమతీదేవి వివాహసముచితాలంకరణముల ధరించి, పరివారజనములు వెంటఁగొలిచిరా నొకపల్లకినెక్కివచ్చి యాస్వయంవరమంటపమున నున్నతాసనముల మధ్యనేర్పడియున్న రాజమార్గమునఁ బ్రవేశించెను. నేత్రైకలక్ష్యమై, కన్యారూపమునఁబరఁగు నయ్యజనిర్మాణవిశేషము నామానవేంద్రులెల్ల మైమఱచి చూడఁదొడంగిరి. మానసములామెయందలగ్నమవుటచేఁ బీఠములందు వారిదేహములుమాత్రమే నిలిచియుండెను. ఆమెయెడ ననురాగమంకురించి ప్రస్ఫుటముగ మనోరథంబులుదయించిన యారాకుమారులకు వసంతసమయమునఁ బాదపంబులకుఁ బల్లవసంపదలువోలె శృంగారచేష్టలుద్భవించి వారి ప్రణయంబును వ్యక్తీకరించు ప్రథమదూతికలోయన నొప్పారుచుండెను.

ఒకరాజు తాను విలాసార్థము కైకొనిన యరవిందము నాళంబును రెండుచేతులతోఁబట్టి చలించుపద్మదళమ్ములచే భ్రమరంబులు విచలితంబులుగాఁగఁ బుప్పొడులు లోపలఁ బరివేషమొనర్ప దానిని గిరగిరఁద్రిప్పి, తన్నుఁ బెండ్లియాడి యట్లేయిష్టమయినట్లు తన్నాడింపుమని యాకన్యకకు సూచించెను. హస్తఘూర్ణకుఁడవలక్షణకుఁడని యెంచి యిందుమతి యాతని నిరాకరించెను. మఱియొక సొగసుకాఁడు తనభుజశిరమునుండి జాఱి రత్నఖచితమగు కేయూరముచివరఁ దగుల్కొనిన ప్రాలంబహారమును మొగంబునడ్డముగఁ ద్రిప్పికొని సవరించి, యథాస్థానమునఁజేర్చి, తానామె నట్టులే కౌఁగిలించికొనెదనని యభిప్రాయమును జూపెను. గోపనీయమగు నవలక్షణమేదియో యాతనిశరీరమున నున్నదనిభావించి యాకాంత యాతనియెడఁ బెడమొగమువహించెను. ఇంకొకఁడు నేత్రకాంతినించుక క్రిందికిఁ బ్రసరింపఁ జేసి యగ్రాంగుళుల వంచుటచే నడ్డముగఁ బ్రసరించు నఖకాంతులుగల పాదమునఁ దానుగూర్చున్న బంగరుగద్దియనుగీఱి, తనసమీపమునకు రమ్మని యాబోఁటికి సూచించెను. లక్ష్మీవినాశకరమ్మగు భూవిలేఖనమపలక్షణమని గ్రహించి యామె యాతనినొప్పకించెను. మఱియొక రాజన్యుఁడు దానుగూర్చుండిన గద్దెకొకప్రక్క నెడమభుజమునాని యుంచువలన నామూఁపెగుడుగాఁగ నొకవైపునకుఁ దిరిగిన వెన్నెముకపైఁబడి హారము సడలుచుండ నొకమిత్రునితో సంభాషించుచుఁ దను వరించినచో వామభాగమున నుంచికొని యామెతో నట్లే ముచ్చటలాడెదనని సూచించెను. (దక్షిణపార్శ్వమునఁగూర్చుండిన) తనకంటె నధికుండగు రాజును గాంచి యసహనంబునఁ బరాఙ్ముఖుఁడయిన వాఁడనపేక్షణీయుఁడని యాతరుణి యాతనియెడఁ బరాఙ్ముఖత వహించెను. యువకుఁడింకనొకఁడు విలాసినులు విలాసార్థము కర్ణభూషణముగధరించు కేతకీదళంబును గైకొని, నిజప్రియానితంబోచిత

సన్నివేశంబులగు నఖాగ్రముల దానిని జించివేసి, యట్లే యామె కటితలమున నఖక్షతము లొనర్పుదునని తన కామశాస్త్ర పారీణత్వము నామెకు సూచించెను. తృణచ్ఛేదకునివలెఁ బత్రపాటన మొనర్చునాతఁ డవలక్షణుఁడని యాసుందరాంగి యాతనియెడ విముఖత్వము వహించెను. ఇంకొకఁడు శతపత్రంబువలె నంతట నెఱ్ఱనై ధ్వజరేఖలనొప్పు కరతలంబుతో, రత్నాంగుళీయ కాంతులు ప్రసరించు పాచికల విలాసముగ నెత్తివైచి యవ్విధమునఁ దానామెతోఁ గ్రీడించెదనని సూచించెను. జూదరియని యెంచి యిందుమతి యాతని నిరసించెను. రాకుమారుఁడింకొకఁడు కిరీటము యథాస్థానముననున్నను దావుననుండి తొలఁగఁగ దానిని సవరించునట్లు నటించి, తత్కిరీటరత్నకాంతులు కరాంగుళిమధ్యప్రదేశముల వ్యాపింప హస్తంబును దానిపై నుంచి, కిరీటముఁబోలె నాబోఁటి శిరంబునఁ గూర్చుండినను భారముగ నెంచనని సూచించెను. నెత్తికిఁ జేతులువచ్చినవాఁడవలక్షణుఁడని యాశుభాంగి యాతనిఁ దిరస్కరించెను.

తదనంతరము భూపాలురవృత్తాంతములను వంశావళులను బాగుగ నెఱింగి పురుషులవలెఁ బ్రగల్భవచస్కయగు సునందయను ద్వారపాలిక యిందుమతీదేవి కాయారాజన్యుల కుల పౌరుషేయాదులఁ దెలుపఁగోరి యామెను బ్రప్రథమమున మగధ (Bihar) దేశాధీశునంతికంబునకుఁ గొంపోయి గంభీరవచనముల నిట్లు పలుకఁ దొడంగెను. “సఖీ! ఈతఁడగాధసత్వసనాథుఁడు. మగధరాజ్యాధినాథుఁడు. శరణాగతులకు శరణ్యుఁడు ప్రజానురంజనమున బహుళకీర్తి నందినవాఁడు. శత్రువులఁ దపింపఁజేయుటంజేసి పరంతపుఁడను నన్వర్థ నామమునఁ బరగువాఁడు. ఇతరభూపాలురీభూమండలమున వేనవేలుండిన నుండనిమ్ము. ఈమహాభాగునొకనిమూలముననే ధరాసతి

రాజన్వతియైనదని పెద్దలు వాక్రుచ్చుచున్నారు. అశ్విన్యాది నక్షత్రములను, తారకాగణములను, అంగారకప్రముఖగ్రహరాజములను బెక్కింటిని గూడియున్నను, రాత్రి యొక్క-చంద్రునిచేఁగదా కాంతిమంతమగుచున్నది! ఈపురుషవరేణ్యుఁడు నిరంతరయాగదీక్షవహించి సహస్రాక్షు నజస్రమాహ్వానించుటచే, శచీదేవి ప్రోషితభర్తృకాధర్మముఁబూని చిరకాలము కేశసంస్కారవిహీనయై యుండుటంజేసి మందారపుష్పశూన్యములగు నామెముంగురులు పాండురంబులగు గండపాలికలపై వ్రేలుచుండును. ఈతనిని జేపట్టెదవేని పురప్రవేశమొనర్చునపుడు ప్రాసాదగవాక్షములఁ గూర్చుండి * పుష్పపురమందలి పూఁబోఁడులెల్ల సర్వాతిశాయిసౌందర్యవతివగు నిన్ను నేత్రపర్వముగ విలోకింతురు"

ఈవిధముగ సునందచెప్పఁగ నిందుమతీదేవి చేతిలోని దూర్వాంకురాంకమగు మధూకపుష్పమాలిక యించుక క్రిందికి దిగజాఱుచుండ నాతని వీక్షించి, పరంతపుఁడును యాయజూకతిలకుండును నగు నానృపాలుఁడు తనకననుకూలుఁడని యెంచి, భాషణశూన్యమగు ప్రణామముతో నాతనిఁ బరిహరించెను.

అంత నాదౌవారిక యామె మనంబెఱింగి మారుతోద్ధూతము గు తరంగమాలిక మానససరోవరమందలి రాజహంసిని మఱియొక పద్మముకడఁ జేర్చునటు లారాకుమారి నింకొక రాజన్యునిసమీపమునకుఁ గొంపోయి యిట్లువచించెను. "అమ్మా! ఇమ్మహామహుం డంగ ♦భూపాలుఁడు. పూర్వమితఁడింద్రసాహాయ్యార్థమై స్వర్లోకము

* పుష్పపురమన్నను, కుసుమపురమన్నను, పాటలీపుత్రమునకు (Modern Patna) నామములు. పాటలపుష్పములీపుర ప్రాంతమున విశేషముగ దొరకుటచే నినికీనామము వచ్చియుండెను.

♦ కాశికీకచ్ఛమునకు దక్షిణమున గంగానదికుడిగట్టున నుండిన దేశము. దీని

నకేఁగ నచ్చటి యచ్చరమచ్చకంటులితని యావనలక్ష్మికలరి యీ తనిఁ గామించిరి. మఱియు గజశాస్త్రికారులగు పాలకాప్యప్రముఖ దేవర్షులే యీధరారమణుని గజంబులను శిక్షించువారు. ఇవ్విధం బున నీధన్యుఁడు భూలోకముననుండియు నింద్రపదవి ననుభవించుచు న్నాఁడు. ఈవీరపురుషుఁడు శత్రువీరుల సంహరింప వారి యంతఃపుర కాంతలు మెడలోని ముత్తెపుఁ బేరులు తెగిపోవ గుండెలు బాదుకొనుచు రోదనమొనర్చుచుందురు. అప్పుడు వారికనుఁగొలకులనుండి చనుఁగొం డలపై ముత్తెపుఁబూసలంత పెద్దవిగ రాలు నశ్రుబిందువు లితండు మరల వారికి దారములు లేకుండఁ గూర్చిన హారములో యన నొప్పు చుండును. ఒకరిపొడ యొకరికిఁగిట్టక వేర్వేఱుస్థలముల నాశ్రయించు నైజముగల లక్ష్మీసరస్వతులు సహజవైరముమాని యీరాజచంద్రు నియందు నివసించియున్నారు. ఓమంగళాంగీ! లావణ్యశ్రీయందా శ్రీకిని, సత్యప్రియవాణి నావాణికిని నెనయయి వారిరువురకు సహవా సినివి కాఁదగిన మూఁడవదానవు నీవొకర్తుకవే. కావున శ్రీమంతుఁ డును విద్యావంతుఁడును నగు నీమహనీయునిఁ దప్పక వరింపుము." ఇట్లు మాతృసఖయైన సునంద వర్ణింపఁగా నిరంతరసమరవిలోలుం డును సపత్నీకుండును నగు నభ్యాపాలుఁడవరణీయుండని యెంచి యిందుమతి యాతనినుండి చూపులఁగ్రిందికి మరల్చి "చాలు. పొమ్ము." అని యామెను గద్దించెను.

ఇంతమాత్రముచేత నానరేంద్రుఁడు సునంద వర్ణించినంత సుందరుఁడు కాఁడనిగాని యాతఁడిందుమతికిఁ దగినవరుఁడు కాఁడని గాని మాయభిప్రాయముకాదు. అట్లసి యిందుమతి కనురూపవరాన్వే

---

రాజధాని చంపాపురము. దీనికే అంగపురి, రోమపాదపురి, కర్ణపురి, మాలిని యను నామములుగూడనుండెడివి. కౌశికీ గంగానదులసంగమస్థలముననిప్పటి Bhagalpur నకు సమీపమున నీనగరముండెడిది.

షణమున సమ్యగ్విమర్శనజ్ఞానము చాలదనియు మేమంగీకరింపఁజాలము. ఆతఁడామెకు రుచింపకుండుటకుఁ గారణము మాకుఁదోఁచినంతవఱకు సూచించియేయుంటిమి. కావున నీవిషయమున "లోకో భిన్నరుచి" యను న్యాయమే యవశ్యగ్రాహణీయమని పాఠకులకు విన్నవించుచున్నారము. ఒకనిపాలివిషము మఱియొకనికమృతమగును. ఇంకొకనిపాలిటి యమృతము మఱింకొకనికి విషము కాఁదగును. ఎవరి కోరికల శాసింప నెవరికి సాధ్యమగును ?

అనంతర మాప్రతీహారి, సునంద, సంగరంబున శత్రువులు సహింపరాని పరాక్రమముగలవాఁడును గరంబు దర్శనీయుఁడునైన మఱియొక రాజేంద్రుని నూతనోదయంబందిన యిందునింబోలె నాయిందుమతికి నగపఱచి యిట్లనియెను. "చెలీ ! దీర్ఘబాహువులు, విశాలవక్షస్స్థలము, సూక్ష్మమై వర్తులమైన మధ్యముగల యీసుందరాకారుఁడవంతి*విషయాధీశుఁడు. విశ్వకర్మకూఁతురు సంజ్ఞాదేవి భర్తతేజోవేగము సహింపఁజాలక పరితపింపఁగా నాతనిచేఁ జక్రాకారమగు సానమీఁద సానఁబెట్టఁబడిన వేవెలుంగువలె వెలుంగుచున్నాఁడు. శక్తిత్రయసంపన్నుం డీభూరమణుండు జైత్రయాత్ర కేఁగునపుఁడు ముందుపోవు నశ్వముల ఖురఘట్టనల వెడలు దుమారంబులే సామంతరాజచూడామణీ తేజోంకురంబుల మాయించుచున్నవి. శ్రమమంతగనక్కఱలేకయ యశ్వదళమూలముననే యీతనికి శత్రువిజయము లభించుచున్నది. మఱియు నీమహారాజు రాజధాని మహాకాళేశ్వరమను దివ్యక్షేత్రమునకు సమీపముననున్నది. కావున మహాకాళేశ్వరుని శిరశ్చంద్రచంద్రికలు నిరంతరము నిజపురంబునఁ బ్రసరించుటచేఁ గృష్ణపక్ష

* నర్మదానదికుత్తరమునఁ బడుగుట మాహీ (Mahi) నదివఱకునుండిన దేశము. ఉజ్జయినిపట్టణము దీని రాజధానిగానుండెను. ఇది యిప్పటి మాళవ (Malwa) దేశములోని కొంతభాగమని చెప్పవచ్చును.

మందును గాంతిమంతములగు రాత్రుల నీతఁడు కాంతామణులతో విహరించుచుండును. ఇట్టిభాగ్యమనన్యలభ్యముకదా! కావున సిప్రా* నదీతరంగానిలంబులఁ గంపించు నుద్యానవనశ్రేణుల విహరింప నీకిచ్ఛగలదేని యీయువకునిఁ బెండ్లియాడుము."

ఈపలుకుల నాలకించి యతితేజోన్వితుండును, సంతత జైత్రయాత్రాపరుండును, బహుభార్యాసమన్వితుండును నగు నభ్యాగవరుం డనపేక్షణీయుండని యిందుమతి దలంచెను. అందుచే నిజప్రతాపంబున బంధుపద్మములకు సముల్లాసమును శత్రుపంకములకు సంశోషణమును గూర్చు నాప్రతాపనిధియం దత్యంతసుకుమారియగు నయ్యుత్పలాక్షి యుష్ణభానునందుఁ గైరవిణివలె మనంబుఁ గొనదాయెను.

కమలోదరకాంతిమతియు, రూపశీలాది గుణానూనయు, విరించిమనోహరనిర్మాణవిభవాన్వితయు నగు నాసుదతి నంతట సునంద యనూప ♦ దేశాధీశుముంగల నాఁపి వెండియు నిట్లు చెప్పఁదొడంగెను. "సఖి! పూర్వము కార్తవీర్యుఁడను రాజర్షి యొకఁడుండెడివాఁడు. అతఁడు తక్కినవేళల రెండుచేతులతో నుండినను యుద్ధరంగమున సహస్రకరంబులతో వెలింగెడివాఁడు. సర్వయాగముల నాచరించి సార్వభౌముఁడై యష్టాదశద్వీపములందును యూపస్తంభముల నాటినవాఁడు. * జరాయుజాది సమస్తభూతరంజనంబున ననన్యసాధా

---

* ఇది చంబలునది నుపనది. ఈనదీతీరముననే యుజ్జయినీపట్టణ మున్నది. ఈపట్టణమందలి మహాకాళేశ్వరాలయము లోకప్రసిద్ధము.

♦ అనూపదేశము:- "అనుగతా ఆపో యేషు తే అనూపానామ దేశా" యని మల్లినాథుఁడు. అనఁగా జలసమృద్ధములగు దేశములు. మధ్యపరిగణాలలో (Central Provinces) నర్మదానదికుత్తరమునను దక్షిణమునను వ్యాపించిన దేశములు.

* సృష్టియెల్ల నాలుగువిధములు:- (1) జరాయుజములు (మావివలనఁ బుట్టునవి) మనుష్యులు, మృగములు మున్నగునవి. (2) అండజములు (గ్రుడ్డునుండి పుట్టు

రణంబగు రాజశబ్దము నన్వర్థముగ వహించినవాఁడు. మఱియు భగవానుఁడగు దత్తాత్రేయుని ప్రసాదమున యోగవిద్యావంతుఁడై నెగడినవాఁడు. ఇతరరాజులు ప్రజలు ప్రత్యక్షముగ నొనరించు తప్పిదములమాత్రము తప్పించుచుండఁ బ్రజాశిక్షకుండగు నామహామాన్వితుండు ప్రజలెవరైనఁ దప్పుపని చేయ మనంబునఁదలంచినంతమాత్రఁ దత్క్షణము వారియెదుట ధనుర్ధరుఁడై పొడసూపి వారి యంతఃకరణంబులందలి యపరాధంబులఁగూడ నివారించుచుండెడివాఁడు. జంభారిప్రముఖసమస్తనిర్జరుల నిర్జించి లోకవిద్రావణుండైన రావణుండు కూడఁ గదలకుండ నల్లెత్రాళ్లతో చెక్కలువిఱిచికట్టఁబడి యాకార్తవీర్యుని యనుగ్రహము కలుగుదనుక నిట్టూర్పులువుచ్చు దశముఖంబులతోఁ దత్కారాగృహంబునఁ బ్రాఁతకాఁపయి పడియుండెను. అట్టి మహానుభావుని వంశంబున నీతఁడు జనించినవాఁడు. ప్రదీపుఁడను నామధేయంబునఁ బరఁగువాఁడు. నిగమాగమవేత్తలగు పెద్దల ననవరతము సేవించువాఁడు. లక్ష్మీదేవి తానాశ్రయించిన మనుజుల దుర్వ్యసనముల కేవగించి వారిని దొలఁగిపోవఁగ మూఢజనంబులామె చపలస్వభావురాలని వాకృచ్చుచున్నారు. వ్యసనవిదూరుండై సతతదానశీలుండగు నీపురుషోత్తమునియందు నిరంతరము నివసించియున్నదామె యాయపకీర్తినిగూడఁ బాపుకొన్నది భగవంతుండు వైశ్వానరుండీతనిశత్రురాజులను దానే స్వయముగ దహింతునని యారాజేంద్రునకు వరంబనుగ్రహించియున్నాఁడు. కావున నీతని పురంబుపై దండెత్తు వైరివీరులెల్ల నగ్నిసాహాయ్యముగల యితనిపరాక్రమాగ్నికి శలభంబులగుచున్నారు. అందుచే క్షత్రియకులంబు పాలి

---

నవి) పక్షులు, పాములు మొదలగునవి. (3) స్వేదజములు (చెమటవలనఁ బుట్టునవి) నల్లులు, దోమలు మున్నగునవి. (4) ఉద్భిజ్జములు (భూమిని భేదించుకొని పుట్టునవి) తరుగుల్మాదులు.

ప్రళయకాలరాత్రియై తత్సంఘమరణాపాదియగు పరశురాముని నిశిత కుఠారధార నీతడెంతమాత్రము సరకుగొనక యుత్పలపత్రంబు పాటి పటిమగలదానినిగ నెంచును. మాహిష్మతీ ♦ పురప్రాకారనితంబమున నకు మేఖలవలెనున్న రేవా * నది మనోహరజలప్రవాహమును బ్రాసాదగవాక్షములనుండి కనులపండువుగఁ గనుంగొన నీకుమనంబు గలదేని విష్ణుసన్నిభుండగు నీతనివరించి లక్ష్మీదేవివలె నాతనియంక తలంబు నలంకరింపుము.”

అనవుడు నతిసాహసికుండగు నాభూవరుండు తనకనుకూలుఁడు గాఁడని యిందుమతి భావించెను. అందుచే నిరస్తమేఘావరణుండగు శరత్కాలశీతకిరణుండు పద్మినికింబోలె నత్యంతప్రియదర్శనుండుఁ గళాపరిపూర్ణుండయ్యు నానృపచంద్రముఁ డాపద్మినీవతంసమునకు వరణీయుఁడు కాఁడయ్యెను.

అంతఃపురపాలికయగు సునంద యంతఁబవిత్రములగు నుభయ వంశములను సర్వలోకసన్నుతంబగు సదాచారమున మఱింతప్రకాశింపఁజేయు శూరసేన ♦ దేశాధీశ్వరుండగు సుషేణునిఁగూర్చి యిందుమతికిట్లు వక్కాణించెను. “ఈమానవేంద్రుఁడు నీప * వంశస్థుఁడు. యథాశాస్త్రముగ యజ్ఞముల నాచరించినవాఁడు. శాంతినికేతనము

---

♦ మధ్యపరగణాలలో నర్మదానదిదక్షిణతీరముననున్న మండల(Mandlah) పురమే యిదియని జనులలో వాడుకకలదు. కాని జబలపురము (Jabalpur) నకు దిగువను వింధ్య, ఋక్షపర్వతముల మధ్యను BherGhar నకు సమీపమునం దీపట్టణముండెడిదని విమర్శకులభిప్రాయపడుచున్నారు.

* రేవా (ధ్వనిచేయునది) ఇది నర్మదానది నామములలో నొకటి. ఇందుజ, సోమోద్భవ, చంద్రోద్భవయని దీనికి నామాంతరములు.

♦ యమునానదీతీరమందలి మధురా (Muttra) పట్టణము రాజధానిగాఁ గలిగి దానిచుట్టుప్రక్కలనున్న దేశము.

లగు మహర్షిజనాశ్రమములందు గజసింహాది వన్యసత్త్వములు నిసర్గ విరోధము విడనాడి యన్యోన్యస్నేహమున మెలంగునట్లు స్వభావ విరుద్ధధర్మములగు లక్ష్మీసరస్వతులు, జ్ఞానమౌనములు, క్షమాశక్తులు మున్నగు గుణంబులు సౌహార్దంబుతో నీతనినాశ్రయించినవి. ఈప్రతాపమూర్తి చంద్రకాంతివంటి శోభచేఁ దనవారికి స్వగృహంబున నేత్రానందకరుండగుచు దుర్దమప్రతాపంబున శత్రుమందిరముల దుస్సహాతరుండగుచున్నవాఁడు అందుచే రిపునృపాలురు భయపడి పలాయితులయినందునఁ దృణాంకురములనొప్పు సౌధాగ్రంబులతోడ నాశాత్రవనగరంబులు పాడటియున్నవి. ఈతని శుద్ధాంతకాంతాజనంబులు యమునానదియందు జలవిహారము సలుపునపుడు వారి స్తనంబులందలి చందనలేపనంబులు కరఁగి యానదీజలంబులకు ధావళ్యం బుఁగలిగించుచున్నవి. అందుచే నాకాళిందీనది గంగానదీసాంగత్యము నింకను బొందక మధురాపురప్రాంతమునఁ బ్రవహించుచున్నను గంగాజలంబులతోఁ గూడినట్టులే ధవళసలిలంబుల నొప్పారుచుండును. ఈతని పూర్వులు పూర్వము గరుత్మంతునకు భయపడి పాఱివచ్చి తమ్ము శరణుచొచ్చిన కాళీయుఁడను నాగరాజునకు యమునానదీ జలమ్ముల దాఁగికొనుట కభయప్రదాన మొసంగిరి. అందులకుఁ బ్రత్యామ్నాయముగ నిప్పుడీ మహారాజువక్షస్థలంబునఁ బ్రకాశించు నమూల్యమణి నాసర్పశ్రేష్ఠుఁడు వారికొసంగెనని చెప్పుదురు. దీనిమూలమున నీతఁడు కౌస్తుభమును ధరించిన వెన్నుని విడంబించుచున్నాఁడు. కావున నోసుందరీమణీ! ఈతని భర్తగ నంగీకరించి, కుబేరోద్యానమున కెంతమాత్రముఁ దీసిపోని బృందావనంబున

---

* నీపవంశము:- దక్షిణపాంచాలురలోని యొకయంతర్జాతి. కాంపిల్య (Modern Kampil) నగరమును, గంగానదీతీరమునసుండిన మాకందీపురమును వీరికి రాజధానులుగా నుండెడివి.

మృదుపల్లవంబులఁబైని బఱచిన కుసుమశయనంబులఁ బరుండి యానావ నసుఖంబుల ననుభవింపుము మఱియు వర్షాకాలమున నంబుకణం బులుపడుటచే సిలాజిత్తుపరిమళంబులఁ బఱపు శిలాతలంబుల నధివ సించి మనోహరంబులగు గోవర్ధనగిరికందరంబుల నట్టువపులుంగు లొనర్చు నాట్యంబు నవలోకింపుము."

ఇదివిని యతికూ్రిరస్వభావుండును, యజ్వశ్రేష్ఠుండును,బహు జాయాయుతుండును నగు నాతఁడు పరిహరణీయుఁడని యిందుమతి తలంచెను. అందుచే నిజనాథుండగు రత్నాకరునిఁ గవయనేతెంచు కృష్ణవేణి మార్గమునఁ దటస్థించు మహీభృత్తునుగడచిపోవునట్లు, నీటిసుడివలె మిక్కిలి చక్కనగు పొక్కిలిగల యానీలవేణి మఱి యొక గుణరత్నాకరునకు భార్యకానున్నదై యామహీభృత్తిలకము నువిడిచి ముందునకు సాగిపోయెను.

శతృ్రకులవినాశకుండును, హేమాంగదాలంకృతబాహుం డును గళింగదేశాధినాథుండును నగు హేమాంగదుని సమీపమును జేరిన యబాలేందుముఖియు, బాలామణియు నగు నాయిందుమతిని గాంచి సునంద మరల నిట్లువలికెను. "చెలీ! ఇమ్మహీమహేంద్రుండు బలంబున మహేంద్రనగంబునకుద్దియైనవాఁడు. మహేంద్రపర్వతము మొదలుకొని మహోదధి (తూర్పుసముద్రము) వఱకు నీతని పరి పాలనము నెగడుచుండుటచే నాపర్వతసముద్రములే యితనికి గిరిజల దుర్గములై వెలయుచున్నవి. ఈనృపకుంజరుని దిగ్విజయయాత్రలందు గండతలంబుల మదజలంబులు స్రవింప నడగొండలవలెఁబోవు వేదండ తండంబులఁజూడ మహేంద్రపర్వతమే ముందుకదలిపోవుచున్నట్లుం డును. ఈబాహుశాలి ధనుర్ధరులలో నగ్రేసరుఁడు. మఱియు సవ్య సాచి. నిజభుజబలంబునన శతృ్రవులనెల్ల నిర్జించినవాఁడు. ఈతఁడు

బలాత్కారముగఁ గైకొని బందియొనర్చుటకయి భుజములపై నిడి కొనిపోవునపుడు శాత్రవరాజ్యలక్ష్ములు రోదనము సేయఁగా జాలు వాఱిన కజ్జలమిశ్రాశ్రువులపద్ధతులో యన నీతని బాహుద్వయంబు నందలి మౌర్వీకిణంబు లొప్పారుచున్నవి. మఱియు రత్నాకరుండీ మహారాజుగృహసమీపముననే యున్నవాఁడు. ఈతని సౌధగవాక్ష ములనుండి చూచిన సముద్రతరంగములు నేత్రపర్వమొనర్చుచుండు ను. ఈరాజచంద్రుఁడు నిజగృహంబున శయనించియుండ సముద్రుఁడే గంభీరధ్వనుల నీతని మేలుకొలిపి సేవించుచుండును. ఈకారణంబున రాచనగరులందు రాత్రివేళలఁ బ్రతియామమున మ్రోగింపఁబడు వాద్యము లీతనిపట్టనమున ననవసరములగుచున్నవి. రత్నాకరునంతటి వానిచే సేవింపఁబడు నీగుణరత్నాకరుని గుణములభివర్ణింప నేరి తరము? కావున ద్వీపాంతరములనుండి లవంగప్రసూనములఁ గొని వచ్చి తత్పరిమళంబుల వెదఁజల్లు శీతలమారుతంబులు నీమేనిక్రొం జెమటల నపహరింపఁ దాళవనమ్ములమర్మరధ్వనులతోడ నొప్పు సముద్రతీరంబున నీమహారాజుంగూడి క్రీడింపుము."

ఈమాటలు విని యుద్ధయాత్రానిరతుండగుట నాక్షితీశ్వరుండ నపేక్షణీయుండని యిందుమతి భావించెను. అందుచే సునంద యట్లు ప్రోత్సహించినను గమనీయాకృతిలోభనీయయగు నవ్విదర్భరాజా నుజ, పురుషప్రయత్నమున నతికష్టముతో దూరమునుండి తేఁబడిన లక్ష్మి దైవోపహతునిఁ జేరక తొలఁగిపోవునటు లామహారాజును బరి హరించి వెడలిపోయెను.

అంత నాదౌవారిక దేవసమానుండగు నాగపట్టణా * ధీశ్వరు

* తంజావూరుమండలములో సముద్రతీరముననున్న Negapatam అను పురమేయిది.

నంతికమున కేఁగి "ఓచకోరలోచనా! ఇటుచూడు" మని ముందుగ హెచ్చరించి యిందుమతితో మరల నిట్లుపలుకఁదొడంగెను. "ఇతఁడు పాండ్యదేశాధీశుఁడు హరిచందనానులేపనమునను, మూఁపులనుండి వ్రేలు ముత్యాలసరులతోడను శోభిల్లు శరీరంబుతో, లేయెండచే నెఱ్ఱవాఱినచఱియలతోడను సెలయేళ్లవెల్లికలతోడను నొప్పు పర్వతరాజమువలెఁ బ్రకాశించుచున్నవాఁడు. సూర్యమార్గము నిరోధించి హిమమేరునగంబుల మించనెంచిన వింధ్యమహాపర్వతమునకు గర్వభంజనమొనర్చిన ధీరుఁడును, వృత్రాసురుని యనుచరులు దివములందుఁ బారావారగర్భమున డాఁగి నిశలయందు బ్రాహ్మణుల వధించుచుండ దేవప్రార్థితుండై సముద్రజలంబుల నిశ్శేషముగ నాపోశనమొనర్చిన మహానుభావుఁడును నగు నగస్త్యమునీంద్రుఁడే యశ్వమేధయాగానంతర మవభృథస్నానపరిశుద్ధుండగు నీరాజచంద్రునకు సాన్నితికుఁడగుచున్నఁవాఁడు. ఈమహాభాగుఁడు చండతరతపంబునఁ జండికాధవుని మెప్పించి యమ్మహాదేవుని ప్రసాదమున ననన్యలభ్యంబగు బ్రహ్మశిరోనామకాస్త్రమును బడసినవాఁడు. అఖర్వగర్వోదగ్రుండగు రావణుం డాఖండలుని జయింప స్వర్లోకముపై దండెత్తనేఁగు నపుడు ఖరాదిరాక్షసులు వసించు జనస్థానమున కీవీరపురుషునివలనఁ గీడుమూఁడునని శంకించి ముందుగ నీతనితో సంధిచేసికొని మఱి తరలెను. ఉత్తమకులసంజాతు నిమ్మహాపురుషుని యథావిధి నుద్వాహమయి, యనంతమగు ననంతావలయమువలె రత్నసంకీర్ణ మహార్ణవంబునకుఁ గాంచీదామమ్మై యెసంగు దక్షిణదిశాసతికి సపత్నివై, తములపుఁదీఁగలల్లుకొనిన పోఁకమ్రాకులను నేలకితీవలు చుట్టుకొనిన చందనవగములను దమాలతరుపత్రాస్తరణములను నలరు మలయాచలతలంబుల నజస్రము విహరింపుము. ఈతఁడు నల్లగలువవలెఁ జామనచాయ

యగు మైగలవాఁడు. నీవు గోరోచనమువలెఁ బచ్చనయి మెచ్చులు గులుకు మేనుగలదానవు. మెఱపుమొగిళుల కలయికవోలె మీయిరువురసంయోగ మొండొరులశోభను వృద్ధిఁబొందించును.”

నావుడుఁ బత్నీయుతుండగు నమ్మహాశూరునివలని దాంపత్యసౌఖ్యము చంచలాంబుదసమాగమమువలె నతిచంచలంబని యిందుమతి భావించెను. కావున సూర్యదర్శనాభావమున ముకుళించు తామరపువ్వునందుఁ జందురునకుంబోలె సునందచేసిన యాయుపదేశమున కామె మనంబున నించుకయు నవకాశము లభింపదయ్యెను

రాత్రియందు రాజమార్గమున నొకదీపముఁగొనిపోయిన దానికాంతు లేయేయట్టాలకంబుల దాఁటిపోవునో యాయాట్టాలకములు వెనువెంటనే యంధకారబంధురములగునట్టు లనురూపుఁడగు పతిని వరింపఁగోరి యారాజకుమారమధ్యమునుండి యిందుమతి యొక్కొక్కరిని బరిహరించుచుఁ బోవుచుండ నారాకుమారుల వదనంబులు వైవర్ణ్యముదాల్చుచుండెను.

ఇందుమతి తనయంతికమును జేరఁగనే యజమహారాజు తన్నుఁగూడ నామె వరించునో లేదోయని సంశయించెను. కాని కుడిభుజమున భుజకీర్తులుకట్టిన స్థానము శుభసూచకముగ నదరి యాతనిసంశయమును బోఁగొట్టెను. సర్వాంగసుందరుండగు నవ్విబుధసహకారునిఁజేరి యాభ్రిమరవేణి మఱియొకవరునియొద్దకేఁగ నుందునకుఁబోకయాఁగిపోయెను. సంఫుల్లసహకారమును బోవిడిచి షట్పదసముదయంబులు వృక్షాంతరమును గాంక్షింపవుగదా.

అజమహారాజునందు మనంబుదగిలినదియుఁ జంద్రకాంతివలె నాహ్లాదకరమగునదియు నగు నయ్యిందుమతిని గని వాక్యపౌర్వాపర్యవిజ్ఞానధుర్యయగు సునంద సవిస్తరముగ నిట్లు వచింపఁదొడంగెను.

"సఖీ! ఇక్ష్వాకుకులభూషణుఁడు పురంజయుఁడను రాజోత్తముఁడు పూర్వమొకఁడుండెడివాఁడు. రాక్షసబాధలకోర్వలేక యొక సమయమున దేవతలాస్నపధూర్జటి సాహాయ్యమును వేఁడికొనిరి. అప్పుడారాజశేఖరుఁడు, మహేంద్రుఁడు మహోక్షరూపమును దాల్చి నిజవాహనముగాఁగ నతనికకుదంబున గూర్చుండి యుద్ధరంగమున రెండవ రుద్రునివలెఁ బ్రకాశించుచు నిశితశరపరంపరలఁ గురిసి నిశాచరాంగనల కపోలఫలకంబుల విలసిల్లు మకరికాపత్రరచనలకుఁ గీడొనర్చెను. శ్రేష్ఠతరంబగు నామహారాజు దేహంబును మాఱురూపమునమోయుటయేగాక, యింద్రుఁడు నిజరూపమునుబొందినతరువాతఁ గూడ నైరావతగజంబును దాటించుటచే సడలిన తనభుజకీర్తితో నారాజచంద్రుని భుజకీర్తి యొరసికొనునటు లర్ధాసనమున నతనిఁదనప్రక్కఁ గూర్చుండఁబెట్టుకొనెను. వృషరూపధారియైనవృత్రారి స్కంధంబు నధిరోహించినకారణంబున నావిఖ్యాతగుణుఁ డప్పటినుండియుఁ గకుత్స్థుఁడని పేరువడసెను. నాఁటఁగోలె నాతనివంశస్థు లుత్తరకోసలాధిశులు గొప్పతనముకొఱకు శ్లాఘనీయమగు కాకుత్స్థనామమును వహించుచున్నారు. ఆమహాపురుషుని వంశంబున, వంశదీపకుండు, గురుతరకీర్తిమంతుండు, దిలీపసార్వభౌముండుదయించెను. అమ్మహనీయుఁడు తొంబదితొమ్మిది యజ్ఞముల యథావిధిగనొనర్చి శతమఖునకసూయకలుగకుండుఁటై నూఱవయాగమును నెఱవేర్పమానెను. ఆతఁడు భూతలంబును ధర్మలోపముకలుఁగకుండ శాసించుచుండ వాయుదేవుఁడుగూడ భయపడి, విహారస్థలముల కేఁగుచు మార్గమున మత్తుచే నిద్రించు మత్తకాశినుల వలువలఁ గదలించుటకుఁగూడ సాహసింపఁడయ్యెను. ఇఁకనాతని పాలనంబునఁ జేయెత్తి వానిని దొంగిలింపనెంచుమానవుండు మందునకైనఁగానరాఁడయ్యెనని వేఱుగఁ జెప్పనక్కఱలేదుగదా! చతుర్దిశల నిర్జించి యార్జించిన సర్వస్వమును

నొకమట్టిపాత్రి తరువాయిగ విశ్వజిత్తను మహాయాగమున నర్థుల
కొసంగిన వదాన్యశేఖరుఁడు, దిలీపనందనుఁడు, రఘుసార్వభౌముఁడు
జనకునిపదవిసిగ్గైకొని యిప్పుడీయిలాతలంబు నెల్ల నేలుచున్నవాఁడు.
కొండల నెక్కి, కాండరాసుల దాఁటి, పాతాళాద్యధోలోకములఁబ్రవే
శించి, స్వర్లోకాద్యూర్ధ్వలోకంబుల నతిక్రమించి, బ్రహ్మాండమంతట
నిండుచు శాశ్వతమై ప్రకాశించు నామహారాజుకీర్తి నీపాటిదని నిరూ
పించి కీర్తింప వేయినోళ్లచిలువకైన నలవికాదు. ఈకుమారుఁడా
రారాజు తనూజుఁడు. జయంతుఁడు శచీకాంతునింబోలెఁ దండ్రినను
సరించి జన్మించినవాఁడు. ఈతఁడింకను శిశుణీయావస్థలోనున్నను,
మహాత్మునితోఁదుల్యముగ భారమువహించు దమ్యము (కోడె
దూడ) వలె, మహత్తరంబగు మహీభారమును దండ్రితోసమాన
ముగఁ దానును వహించుచున్నవాఁడు. కులముచే, లావణ్యముచే,
నవయౌవనముచే, వినయాదిసకలసుగుణగణములచే, సమస్తవిధ
ముల నీకనురూపుఁడగు నితని వరించినచో రత్నము బంగారముఁగూడి
నట్లగును."

సునంద యిట్లువచించి యూరకున్నంతనే యిందుమతి లజ్జను
విడనాడి మనఃప్రసాదంబునఁ బ్రసన్నములగు వీక్షణమాలికల నా
కుమారునిపైఁ బ్రసరింపఁజేసి, స్వయంవరార్థము గ్రహించిన పుష్ప
దామముచేతనుంబోలె నాతనివరించెను. ఆయువకునియందుఁ దనకుఁ
గలిగిన యనురాగబంధమును దిట్టతనములేని ముగ్ధయగుట నామె
చెప్పలేకపోయినను నది యాకుటిలకుంతలదేహమునుండి పులకలనెపం
బున వెలికి భేదించికొనివచ్చెను. చెలికత్తె యాయవస్థయందుండ
వేత్రహస్త సునంద యామెఁగనుంగొని "ఆర్యా! యింక మఱియొక
రాజుకడకేఁగుదమా?" అని పరిహాసమొనర్చెను. ఆమాటలకసూయ
గొని యిందుమతి యామెను గుటిలవీక్షణముల నవలోకించెను.
కరభంబులవంటి యూరుకాండంబులనొప్పునాతరుణీమణి, కుంకుమాది

మాంగళ్యద్రవ్యంబుల గౌరవర్ణ భాసురంబగు మాల్యంబును మూర్తిమంతమైన యనురాగమునుంబోలె నారఘుకుమారునిగళంబున దాదియగు సునంద చేత యుక్తస్థానమున వేయించెను. మధూకాది మంగళప్రసవంబులఁ గూర్పఁబడిన యాపుష్పహారము తనవిశాలవక్షస్స్థలంబు నలంకరించి వ్రేలుచుండ వరణీయుఁ డానరవరకుమారుఁడు బాహుపాశముల నాయిందుమతి కంఠాలింగన మొనరించినట్టులే యానందించెను. పరస్పరసదృశగుణంబుల విలసిల్లు నాదంపతుల సంయోగమునకు హర్షించి, పౌరజనంబు లిందుమతీదేవిని మేఘావరోధవిముక్తుఁడగు శరత్కాలచంద్రునిఁగూడిన కౌముదియనియు, అనురూపుఁడగు జలధీశ్వరునందు సంగమించిన జాహ్నవియనియు నేకగ్రీవముగ గంభీరవాక్యముల వినుతించిరి. ఆపలుకు లచటి యితరనృపుల చెవులకు ములుకులుగనాటెను. అంత నచ్చట నొకవైపున నజమహారాజు పక్షమువారు సంతోషాతిశయమున నోలలాడుచు వికసితవదనంబులఁ బ్రకాశించుచుండ నిందుమతియందలి యాశలన్నియు భగ్నములగుటచేఁ దక్కిన రాజమండలమంతయు నాసమయముననే వికాసహీనమైయుండెను. అందుచే నాస్వయంవరమంటప ముషఃకాలంబున నొకచో వికసించు పద్మములతోడను మఱియొకచో ముకుళించు కుముదములతోడను నొప్పారు సరోవరంబుననుకరించెను.

—* సప్తమ ప్రకరణము *—

అనురూపవరుండగు కుమారస్వామితోఁగూడిన సాక్షాద్దేవసేనవలె విలసిల్లు చెల్లెలిందోడ్కొని విదర్భనాథుఁడంతఁ బురప్రవేశాభిముఖుండయ్యెను. ఇందుమతియందలి తమకోర్కులన్నియు వ్యర్థములగుటచే రాజులందఱు తమ యాకారములను నలంకారములను

నిరర్థకములని నిందించుకొనుచుఁ బ్రభాతకాలమందలి చంద్రాదిగ్రహములవలె వెలవెలఁబోవుచుఁ దమతమ శిబిరములకరిగిరి. శచీదేవి సాన్నిధ్యమహిమంబున నాస్వయంవర మేవిఘ్నమునులేక నిరాఘాటముగ నెఱవేఱెను. అందుచే నజమహారాజునెడ ద్వేషమువహించినవారయ్యు నరపాలురెల్లరు తమక్రోధాగ్నులఁ జల్లార్చుకొని శాంతచిత్తులైరి. అంత నావరుఁడు వధూసహితుఁడై రాజమార్గము వెంటఁజనెను. ఆమార్గము పుష్పప్రకరచందనసేకపూర్ణకుంభాదినూతనోపచారంబుల మనోహరంబై యింద్రధనుస్సువలెఁ జిత్రవర్ణంబులఁ బ్రకాశించు తోరణంబులచే నలంకరింపఁబడియుండెను. సంతోషభరంబున నిరువంకలను పౌరజనంబులు నాటిన ధ్వజంబులు నిజచ్ఛాయల నాతపము నడంచి చల్లఁదనమొసంగుచుండెను. ఆక్రొత్త పెండ్లికొడుకును జూడ వేడుకపడుచుఁ దమపనులనెల్లమాని పురంబునందలి పూఁబోఁడులు తమమేడలలోని పైఁడికిటికీలకడకుఁ దత్తఱంబునఁ జనుచుండిరి.

అలివేణియొకర్తు కేశబంధమువీడి యవతంసకుసుమంబులు రాలుచున్నను గేశపాశమును జేతఁబట్టుకొనియే గవాక్షమువైపునకుఁబోవుచుండెను గాని గమ్యస్థానముఁ జేరువఱకు మరల కురులు ముడువఁదలంపదయ్యెను మఱియొకపల్లవపాణి దన్నుఁగైసేయు చెలికత్తెలత్తుకరసమును బూయుటకెత్తిన పాదమును లాక్షాద్రవమింకనునాఱకున్నను దటాలునఁదీసికొని యమందగమనంబున వాతాయనముదగ్గఱకుఁబోవుచుండెను. తడియాఱని యాలత్తుక యంటుకొనుటచే గవాక్షమువఱకునున్న మార్గమెల్ల నెఱ్ఱనగుచుండెను. కలువకంటియొకర్తు తత్తఱంబునఁ గాటుకను గుడికంటికిఁబెట్టికొని యెడమకంటఁబెట్టుకొనక యే కాటుకపుడుకను జేతఁబట్టికొని కిటికీకడకుఁ గడువడిఁబోవుచుండెను. తలోదరి యింకొకర్తు గవాక్షమువైపు దృష్టులు నిగిడ్చిపోవుచు మార్గమున నీవీబంధము సడలినను దానిని సవరింపక హస్తా

భరణద్యుతులు నాభిప్రదేశము నలంకరించుచుండ జాఱుచున్నచీర నొకచేతఁ బట్టికొని వడివడిగ నడచుచుండెను. మదవతియొకర్తు మొలనూలు సగముగ్రుచ్చి దానిని బొందుపఱుపక యే సత్వరంబుగ లేచి జాలసమీపమునకు సంభ్రమంబున నేఁగుచుండెను. అందుచే నాకాంచీదామమున రత్నంబు లడుగడుగునకు జాఱి క్రిందఁబడఁ దుద కంగుష్ఠమునఁగట్టినదారము మాత్రము మిగిలియుండెను. అత్యంత కుతూహలంబున నాసారసలోచనలు గవాక్షాంతరములనుండి యా రాకుమారుని విలోకించుచుండిరి. మకరందపరిమళంబుల మనోహర ములై చంచలనేత్రభ్రమరంబుల నందములగు నాసుందరీమణుల వదనంబుల నావాతాయనంబులు పద్మాలంకృతములట్లు విలసిల్లుచుం డెను. ఆసుందరాకారుని మనోహరాకృతిని గాంచు సామర్థ్యంబు తమకు లేనందున నక్కాంతామణుల యితరేంద్రియములెల్ల నిజ వ్యాపారములమాని నేత్రేంద్రియమునంద నిలుకడ గాంచియుంటఁ గాఁబోలుఁ దమిమీఱ నాతని సౌందర్యమును నేత్రపుటంబులఁగ్రోలు నానారీమణుల కన్యవిషయములపై బుద్ధి వెడలదయ్యెను.

అంత నాస్త్రీరత్నము లారాజదంపతులఁగూర్చి యిట్లు ముచ్చ టింపఁదొడంగిరి. "ఈభోజరాజానుజ పరోక్షమునఁ దన్నువరించు రాజ శ్రేష్ఠులెందఱున్నను స్వయంవరమే సర్వోత్తమమని తలంచి దాని నుత్కృష్టముగ నిర్వహించెను. అట్లుగాకున్నఁ గడలిపట్టి నారాయణు నిఁబోలె ననురూపవరుని నీమె యెట్లు చేపట్టియుండును ? అన్యోన్య వరణీయమగు శోభావిశేషముననొప్పు నీమిథునమ్మునకు సంయోగము సంఘటింపకున్నచోఁ జతురాననుం డిట్టిసౌందర్యమును వీరియందు సృజించుటకుఁ బడినకష్టంబెల్ల నిష్ఫలంబుగదా ? ముమ్మాటికి వీరిరు వురు భూతలంబున నవతరించిన రతీమన్మథులయి యుండనోపుదురు. కావుననే యీముద్దరాలు రాజాధిరాజులు వేనవేలుకూడిన స్వయం

వరమంటపమున నాత్మప్రతిరూపుఁడగు నీశోభనాంగునే వరింపఁగలిగెను. ఆహా! మనంబు జన్మాంతరసంగతి నెఱింగి సంచరించుఁగదా!"

పౌరాంగనలిట్లు శ్రవణపేయముగఁ బలుకు వచనంబులవినుచు నజమహారాజు మంగళప్రదముగ నలంకరింపఁబడిన శ్వశురాగారమును జేరెను. అంత నతఁడు శీఘ్రింబుగ గజంబునధిరోహించి కామరూపదేశాధీశుండు కైదండయొసంగ సుందరీమణుల డెందమునందుఁబోలె విదర్భేశ్వరుండు నిర్దేశించిన యంతర్భవనమునఁ బ్రవేశించెను. శ్రేష్ఠతరసింహాసనమున నాసీనుఁడై యాపురుషసింహుఁడు భోజభూపాలుఁడు సరత్నకంబుగ నొసంగిన పంచామృతమిశ్రితార్ఘ్యంబును, దుకూలద్వయంబును, వనితాజనకటాక్షమాలికాసహితంబుగ గ్రహించెను. ధవళకాంతులఁ బ్రసరింపఁజేయు ఫేనరాజితోఁగూడిన సముద్రుని నూత్నచంద్రికిరణంబు లొడ్డును జేర్చునటులు జాణలగు నంతఃపురపరిచారిక లాశ్వేతదుకూలప్రకాశుని, రఘుకుమారునిఁ బెండ్లికూఁతునొద్దకుఁ గొనిపోయిరి. అంత నచ్చటఁ బూజితుండును నగ్నితుల్యుండును నగు భోజరాజపురోహితుండు హవిగాదిద్రవ్యంబుల వహ్నియందు వేల్చి వధూవరుల కగ్నిసాక్షికముగ వివాహమొనర్చెను. వధూహస్తంబును నిజహస్తంబునఁ బట్టికొని యారాజకుమారుఁడు లోన నల్లుకొనిన యశోకలతయందలి ప్రవాళంబును నిజపల్లవంబుచేఁ బెనఁగొను సహకారమువలె నత్యంతము ప్రకాశించెను. అంత నాతని ప్రకోష్ఠము పులకాంకితమయ్యెను. ఇందుమతి యంగుళులు స్వేదకణస్విన్నములయ్యెను. పాణిసమాగమంబున నాయిరువురయందు ననురాగము సమముగ విభజింపఁబడినట్లుండెను. అపాంగవిలోకనములఁ బ్రసరింపఁజేయుచు నత్యంతతృష్ణతో నొండొరులఁ గనుంగొను నాదంపతుల విలోచనంబులు పరస్పరనిరీక్షణవ్యాపారంబున యదృచ్ఛమైఁ గలిసికొని మరల లజ్జచే వెనుకకు మరలి నిమీ

లితములై మనోహరములై యొప్పారెను. దీప్తిమంతుఁడై ప్రజ్వలించు హవ్యవహునకుఁ బ్రదక్షిణమొనర్చి యన్యోన్యాసక్త లావధూవరులు మేరుగిరిం దప్రముఁ జుట్టివచ్చు రాత్రిందివములవలెఁ బ్రకాశించిరి. అంత నాలజ్జావతి, గురునితంబిని, మత్తచకోరాక్షి, యిందుమతి, వేధస్సన్ని భుఁడగు పురోధసుండు నియోగింప నగ్నియందు లాజహోమమొన ర్చెను. హవిర్లాజశమీపల్లవగంధిలమై యగ్నిముఖంబున నుద్గమించిన పవిత్రహోమధూమకళిక యాసుందరీమణి కపోలఫలకంబులపైఁ బ్రసరించుచు ముహూర్తమాత్రమామెకుఁ గర్ణోత్పలమువలెఁ బొలు పారెను. ఆచారముచొప్పున గ్రహించిన హోమధూమ మాకుంద రదన వదనమండలమునఁ గ్రమ్ముటచే నామెలోచనము లంజనమిశ్ర బాష్పసంకులములయ్యెను. కర్ణభూషణములుగ ధరించిన బీజాంకు రంబులు మ్లానతఁజెందెను. కపోలరేఖ పాటలత్వము వహించెను. బంగరుపీఁటలపైఁ గూర్చుండిన యాదంపతులఁమీఁద నంతఁ గ్రమం బుగ స్నాతకులును, బంధుసహితుండగు భోజభూపాలుఁడును, బురం ధ్రీమతల్లులును నార్ద్రాక్షతలఁ జల్లిరి.

అధిక సంపన్నుండు, భోజకులదీపకుండు, విదర్భేశ్వరుండివ్విధిఁ జెల్లెలి పెండ్లిని మహావైభవములో నెఱవేర్చి, స్వయంవరమునకేతెం చిన యితరభూపాలుర వేర్వేఱ పూజనమొనరింపఁ దనయుద్యోగుల నియోగించెను. నక్రగ్రాహపాఠీనాది క్రూరజంతువుల లోనఁగొని బహి ర్నిర్మలములై గాన్పించు హ్రదంబులవలె నానరపాలు రారోపితసం తోషచిహ్నాంబుల నిజమాత్సర్యంబుల నిగూఢములుచేసి పైకిఁగపట ముదంబును జూపుచు విదర్భేశ్వరుఁడొనర్చిన సత్కారంబులకుఁ బ్రత్యు పాయనములొసంగి యాతనియొద్ద సెలవుఁగైకొని వెడలి యజమహా రాజు గొనిపోవు ప్రమదారూపమైన తమభోగ్యవస్తువును నానృప వరుండొంటరిగఁ దరలుతఱిఁ బడయఁగోరి, కార్యసిద్ధికై తమలోఁ

దామంతకుమున్న యేర్పఱుచుకొనిన ప్రాకారమాతఁ డేగు మార్గమును నిరోధించిరి విదర్భేశ్వరుం డుచితరీతిని జెల్లెలి వివాహమహోత్సవ మొనరించి, నిజోత్సాహానుగుణముగ మఱఁదికి నరణంబుగ సిరుల నర్పించి, రాజధానికిఁ దరల నతనికనుజ్ఞనొసంగి, కొంతదూరము తానును వెంటఁజనెను. ముల్లోకములను నుల్లోకయశంబున నుల్లసిల్లు నానృపతల్లజునితోఁగూడ మార్గమున మూఁడురాత్రులు వసించి పర్యాంతమునఁ బ్రభాకరునివీడి చను శీతభానునివలె, విదర్భేశ్వరుం డాతని వీడ్కొని వెనుకకు మరలెను.

రఘుమహారాజంతకుమున్న దిగ్విజయమొనర్చి తమ ధనరాసు లనెల్లఁ గొల్లగొనుటచే నాతనియెడ వైరమునుబూనిన శత్రుభూవరు లెల్ల నిప్పుడాసార్వభౌముని కుమారుఁడు గాంచిన స్త్రీరత్నలాభము నకు మఱింత యోర్వఁజాలక భోజకన్యను గొనియేఁగు నాతనిని, బలిచక్రవర్తియొసంగు దానంబునుగొను త్రివిక్రముని పాదాంభోరు హము నింద్రశత్రుండువోలె, దర్పంబున మధ్యేమార్గమున నడ్డగించిరి.

అంత నజుండు తనతండ్రికి మిత్రుండగు మంత్రి ననల్పసైన్యం బుతో నిందుమతీసంరక్షణమున నియోగించి, యుత్తుంగతరంగసంగత యగు శోణాతరంగిణీ జ్యోతీరథయను నదినిబోలె రిపుచమూసమూ హంబు నెదిర్చెను. అంతఁ బదాతి పదాతితోడన, రథికుఁడు రథికుని తోడను, అశ్వికుండాశ్వికునితోడను, గజారూఢుండు గజారూఢుని తోడను నెదిరించి సైనికులెల్ల సమంబుగ ద్వంద్వయుద్ధమొనరించిరి. తూర్యధ్వానంబులచే నొకరివచనంబులొకరికి వినరానందున, ధనుర్ధ రులు నిజవంశవర్ణనంబుల నుచ్చరింపకయ తమబాణంబులందు లిఖిం పఁబడిన యక్షరములమూలమునన స్వనామంబుల నొండొరులకుఁ దెలియఁజేసికొనుచుండిరి. ఆసంగరరంగమున నశ్వఖురఘట్టనల నుత్థి

తమై, స్యందనచక్రంబుల సాంద్రీకృతమై, కుంజరకర్ణతాడనంబుల విస్తారితమై గగనంబునొరసిన రజఃపటలము ప్రతిసీరయుంబోలె సూర్యమండలమును నిరోధించెను. మత్స్యకేతనంబులు వాయువశం బున విస్తృతంబులగు ముఖంబులచే, సైన్యసంఘట్టనలవలన మింటికె గసిన దుమారంబులఁ గొనుచుఁ బ్రకలుషితంబులగు నూత్నజలంబు లఁగ్రోలు ప్రత్యక్షమత్స్యంబులవలెఁ గానవచ్చెను. పరాగమ్ము ముమ్మ రమ్ముగఁ గ్రమ్ముటచే నుభయపక్షసైనికులును నొకరినొకరు చూడఁ జాలక యొండొరుల రథంబులను రథాంగధ్వనులచేతను, గజంబులను విలోలఘంటికారవంబులవలనను, దమ్ముఁదమనాయకుల నామోచ్చా రణమూలమునను మాత్ర మెఱుంగుచుండిరి. దృష్టిపథంబునరికట్టి రణ రంగమంతటను వ్యాపించిన యారజోంధకారమునకు శస్త్రక్షతంబులచే నశ్వగజవీరభటశరీరములనుండి స్రవించు రుధిరప్రవాహము బాలా ర్కప్రాయమయ్యెను. భూతలముపైనుండుపరాగ మానెత్తురులచే రేఁగి పవనప్రేరితమై యాశోణితముపైఁ బడుచుండెను. తత్కారణంబున నా రజఃపటలము ప్రజ్వలనానంతర మంగారకణశేషంబగు సింగలము మీఁదఁ దొలుదొల్త లేచు ధూమరేఖననుకరించెను. ఆయుధప్రహా రంబుల మూర్ఛనొందిన రథికుల సంరక్షణార్థము సారథులు రథంబు లను విశ్రమస్థానంబులకుఁ గొంపోవ నారథికవీరులు మగుడ తెలివి నొంది, యకృత్యమొనరించితిరని సారథుల నధిక్షేపించి, యశ్వంబుల మరలించి, యుద్ధరంగమునకు మరలనే తెంచి, తమ్ము మూర్ఛనొందిం చిన పగతుర మున్ను తాముచూచిన యరదంపు టెక్కెములచే గుర్తించి, యుద్దండక్రోధంబున మండిపడుచు వారిని దండధరువీటికం పుచుండిరి. కుశలులగు ధనుర్ధరులు ప్రయోగించిన శిలీముఖంబు లర్ధ మార్గంబునన శత్రుబాణంబులచే ఛేదింపఁబడియు నిజజవాతిశయ మున లోహనిర్మితాగ్రములగు పూర్వార్థభాగములవలననే తమలక్ష్య

ములను భేదించుచుండెను. మదగజకదనంబున నిశితక్షురాగ్రచక్ర విలూనంబులగు మావటీండ్రశిరంబులు, పైనుండి క్రిందికివ్రాలు శ్యేనంబుల నఖాగ్రంబులందుఁ గేశంబులు దగుల్కొనుటచేఁ జాలఁ గాలమునకుఁగాని నేలపైఁ బడకుండెను. అశ్వికులు తమదెబ్బలకు మూర్ఛిల్లి తురంగస్కంధమునఁ బడియున్న ప్రతివీరుల మరలఁగొట్టక వారలు తిరిగి యసువులఁ బడయుదురుగాక యని యభిలషించుచుండిరి. కవచధరులు ప్రాణములకుఁ దెగించి తెంపరులై యొఱలనుండి కరవాలంబులనుదూసి దంతావళబృహద్దంతములపై విసరఁ దత్సంఘట్టనచే నగ్నిజ్వాల లెగయుచుండెను. అందుల కా స్తంబేరమంబులుద్విగ్నచిత్తంబులై వానిని దమకరశీకరంబులఁ జల్లార్చుచుండెను. శిలీముఖోచ్ఛిన్నంబులగుశిరంబు లసంఖ్యాకఫలంబులుగను, భూపతితంబులగు శిరస్త్రాణము లశేషపానపాత్రములుగను, శోణితంబులు మద్యప్రవాహములుగను దనర నాసంగరరంగమంతయు మృత్యుదేవత పానభూమియోయన నొప్పారుచుండెను.

జంబుకమొకం డండజంబులు ప్రక్కలంతయు ఖండించిన బాహుఖండంబొకం డాఁచికొని, బాహుపురిమొన గ్రుచ్చికొని తాలువు గాయముపడ మాంసఖండెంతలోభమున్నను దానిని ద్రోసివైచెను. శత్రుభటుండు ఖడ్గంబున శిరఃకర్తనమొనర్ప వీరుఁడొకండు తత్క్షణము విమానాధిపత్యమునొంది సురాంగనామణి యొకర్తు దన వామాంకతలంబునలంకరింప విహాయసవీథినివిహరించుచు, రణస్థలిని దనమొండెమొనర్చు నృత్యమును విలోకించుచుండెను. రథికులిరువు రొండొరుల సారథులను నిధనమొనరించి, తామేరథికులు సారథులునై కొంతవడి సంగరమొనర్చి, రథ్యంబులపగతజీవంబులుగాఁగ గదలఁగైకొని కదనంబు నెఱపుచు నవియు భగ్నంబులగుడు బాహాబాహిభండనమొనరించిరి. వీరపురుషులిరువురు పరస్పరప్రహారంబుల సంగరాంగణ

మున నేక కాలమునఁ బ్రాణములఁ బాసి దేవత్వమువహించి యేకసమయముననే స్వర్గమునకుఁబోయిరి అందుచే నచ్చరమచ్చకంటి యొకర్తుకయే వారిని వరించినందున స్వర్గమునకుఁబోయినను విడియాకులు తప్పలేదనునట్లు లాయెకొఱకు వారికక్కడఁగూడ యుద్ధము సిద్ధమయ్యెను. ముందునకు వెనుకకు వీచు మారుతంబులవలన సముద్రతరంగములు ముందు వెనుకలకుఁ గ్రమంబుగ వృద్ధియగునట్లు లాయుభయ వ్యూహములు నొండొంటివలన నియమరహితములగు జయాపజయములఁ గాంచుచుండెను.

నిజబలంబులు శత్రువులచేఁ బాఱఁదోలఁబడినను, మహారాజుండగు నయ్యాజుండు తానే స్వయముగ రిపుసైన్యముల నెదుర్కొనెను. సమీరణంబున ధూమముద్ధూతమైనను జ్వలనంబు తృణంబున్న యంతటను వ్యాపించునుగదా! కల్పాంతమున నుద్వేలమగు మహార్ణవజలంబును మహావరాహమూఁపుకరణి, రణదృప్తుఁడు, లోకైకవీరుఁడునగు నయ్యాజుండు రథియై, తూణియై, కవచియై, ధన్వియై స్వయముగ నాశత్రులోకము నెల్ల నడ్డగించెను. ఆవీరావతారుని హస్తలాఘవమదెట్టిదోగాని యుద్ధరంగమున నాతఁడు తూణీరముఖమున దక్షిణహస్తమునుగాని వామకరమునుగాని ప్రవర్తింపఁజేసినట్లు లోకింతయుఁగానరాకయే రిపుమస్తకములఁ ద్రెళ్లవేయుచుండెను అందుచేఁ జెవిదాఁకఁ దివిచిన యాతని వింటినారియే పగతుర బలిగొను శిలీముఖమ్ముల స్వయముగ ననుక్షణము నీనుచున్నదోయనఁ జూపఱకుఁ దోఁచుచుండెను. ఆవీరుఁడు నిశితభల్లంబులఁ గంఠలుంఠనమొనర్ప, రోషంబు మెఁగఱచుకొనుటచే నెఱ్ఱనగు వాతెరలతోడను, నూర్ధ్వరేఖావిలసితంబులగు భ్రూభంగములతోడను, హుంకారధ్వనులతోడను నేలఁగూలుచు శత్రుశిరంబులు యుద్ధభూమిని గప్పివైచుచుండెను. అంత భూపాలురందఱు మాతంగప్రధానంబులగు చతురంగబలంబులతో

డను, గపచభేదులగు నాయుధములతోడను దమకు సాధ్యమయిన తదితర సాధనంబులతోడను నొక్కుమ్మడి నజమహారాజుమీఁదఁ బడిరి. శత్రురాజుల శరంబు లరదంబునల్గడలఁ గ్రమ్మినందున బ్రాతఃకాలంబున నీహారమగ్నుఁడగు నుష్ణభానుఁ డీషత్ప్రకాశమాత్రమునఁబోలెఁ బ్రతాపనిధియగు నాయజుండు ధ్వజాగ్రమాత్రమున లక్షింపఁదగియుండెను. కందర్పసుందరుం డాసార్వభౌమకుమారుఁడంత జాగరూకతవహించి ప్రియంవదుండు మున్నొసంగిన గాంధర్వనామకసమ్మోహనాస్త్రము నా రాజసమూహముపైఁ బ్రయోగించెను. శత్రువు లెల్ల నంత నిద్రాముద్రితులై చేష్టారహితులైరి. వారిహస్తములు ధనుస్సును సారించుటకుఁగూడ నవశంబులయ్యెను. బూమిడికంబులు మూఁపులకొక్కడ వ్రాలియుండెను. దేహములు నిస్తబ్ధములై ధ్వజస్తంభములమీఁద నొరఁగెను.

లోకైకవీరుం డారాకుమారుండు ప్రియోపాత్తరసంబగు నధరోష్ఠంబున విజయశంఖంబుఁ బూరించుచు మూర్తీభవించిన స్వహస్తసంపాదితయశంబును గ్రోలుచున్నవాఁడోయనఁ బ్రకాశించెను. అంతకుమున్ను పలాయితులైన యారాజచంద్రునియోధు లాశంఖధ్వానము తమ యేలికదియని యెఱింగి, సంగరరంగమునకు మగిడి వచ్చి శత్రువులనెల్ల నిద్రాముద్రితులుగ నొనర్చి ముకుళితములగు పంకజములమధ్య వెలుంగు శశాంకుని ప్రతిబింబమును విడంబించు నతనిఁ గనుంగొనిరి. అంత నజుండు శత్రురాజుల ధ్వజములందు, "ఇప్పుడు మరల రఘుపుత్రుఁడు దయతో మీప్రాణంబులజోలికిఁబోక యశంబులమాత్రమే యపహరించెను" అను వర్ణములను బాణాగ్రములచే శోణితమున లిఖించి, చాపశిఖరంబున వర్తించు బాహువుతోడను, శిరస్త్రాణాపనయనంబున సడలిన కేశబంధముతోడను, శ్రమవారికణంబులుగ్రమ్మిన ఫాలతలంబుతోడను బ్రియాంగనయొద్ద

కేఁగి "విదర్భరాజకుమారీ! నేననుజ్ఞనొసంగితిని గాన నిటుచూడుము. (చేతితోఁజూపుచు) తమ యాయుధములను బసిబాలురు హరించినను నేమియుఁ జేయనేరక నిద్రాభిభూతులై యున్న యీశౌర్యనిధులఁ గనుంగొనుము. ఈపాటి పోటుతనంబుతో నిట్టి యుద్ధనైపుణ్యంబుతో నిప్వీరపురుషులు నా కేల్పట్టిన నిను నాఁచికొనఁజూచిరి." అని చిఱునగవుతో వచించెను. అంత శత్రువులవలని భయమువాయుటచే నిందుమతి వదనేందుమండలము సుప్రసన్నమై నిశ్వాసబాష్పములాఱిపోవ నిర్మలమగు దర్పణమువలెఁ బ్రకాశించెను. ప్రాణేశ్వరుని దోర్వీర్యపరాక్రమమున కెంతయు సంతసించినదయ్యు నక్కాంతామణి లజ్జచే నాథుని స్వయముగఁ బ్రశంసింపనేరక, క్రొంజినుకులఁ దడిసిన మెట్టనేల ఘనసముదయమును మయూరకులకేకారవమ్ములచేతనుంబోలె, సఖీజనవచనంబులచే నభినందించెను.

ఇవ్విధంబున భూపాలకమస్తకంబులఁ దనవామపాదంబునుంచి యనవద్యుం డారఘుకుమారుండు పూతచరిత్రయగు నిందుమతిని వెంటఁగొని చనెను. ఆతని రథ్యముల ఖురఘట్టనల నెగసిన రజఃపుంజంబులచే రూక్షములగు నలకాగ్రంబులఁ దనరు నాతరుణీమణి, మూర్తీభవించిన యావీరవరుని సంగ్రామవిజయలక్ష్మియోయన నొప్పారెను. సమాచారమున్నిటి నదివఱకె యెఱింగిన రఘుమహారాజు, విజయుఁడై, ప్రశస్తజాయాసమేతుఁడై గృహంబునకు మరలి వచ్చిన కుమారునిఁ బ్రశంసించి, రాజ్యభారము నీక నతనియందుంచి తాను మోక్షమార్గము పేక్షింప నుత్సుకుండయ్యెను. కుమారుండు కులధుర్యుండయినపుడు గృహస్థాశ్రమమును విసర్జించుట సూర్యవంశ్యుల యాచారముఁగదా!

## —* అష్టమప్రకరణము *—

వివాహమంగళకంకణలలితుండగు కుమారునకంత రఘుమహారాజు రెండవ యిందుమతినోయన వసుంధరను గరగతమొనరించెను. రాకుమారు లెన్నిదురితము లొనర్చియైనఁ బడయనెంచు రాజ్యలక్ష్మి తనంతఁదావచ్చిచేర నజుండు దానిని భోగతృష్ణచేఁగాక జనకునియాజ్ఞమైఁ గైకొనెను. వశిష్ఠమహర్షి యొనర్చిన పవిత్రసలిలాభిషేకమును నజమహారాజుతోడ ననుభవించి, మేదినీసతి యనురూపభర్తృసాంగత్యముగలిగిన తనకృతార్థత్వమును నిర్మలోచ్ఛ్వాసవ్యాజంబునఁ దెలియఁబఱిచెను. అధర్వణవేదవిదుండు వశిష్ఠుండు యథావిధిగ నభిషేకసంస్కారం బొనర్ప నానృపవరుండు శత్రువీర్యుల కత్యంతము దుర్ధర్షుఁడయ్యెను. బ్రాహ్మ్యసహితంబగు క్షాత్రము పవనయుతంబగు ప్రజ్వలనమువంటిదిగదా! ఆకుమారుఁడు తండ్రిరాజ్యసంపదనేగాక యాతని శౌర్యదాక్షిణ్యాది సకలగుణంబుల నొందియుండుటచేఁ బ్రజలెల్ల నాతనిని మరల యౌవనమందిన రఘువేయని తలంచిరి. అజుని తోఁగూడి యాతని పైతృకరాజ్యలక్ష్మియు, వినయసంపదతోఁగూడి యాతని నవయౌవనశ్రీయును మిక్కిలి శోభనొందెను. ఇట్లొండొంటితోఁగూడి శోభిల్లిన శుభవంతమగు వస్తుద్వయమిదిగాక మఱెద్దియుఁ గానరాదయ్యెను. నూతనముగఁ దన్నుఁజేరిన యాభూసతి సాహసంబును జూపిన భయపడునని మహాభుజుండగు నయ్యజుండామెను నవోఢయగు వధువుంబోలె మిక్కిలిదయతోఁ బరిపాలించెను. సముద్రుండు దక్షిణనాయకుండై నదీశతంబుల నన్నిటిని సమానముగ మన్నించునటు లాభూపాలుఁడు తనప్రజలలో నొక్కనినైన నగౌరవింపక యందఱను సమదృష్టితో గౌరవించెను. అందుచే నాతనిపాలనంబునఁ బ్రతిమనుజుండును నెవనిమట్టునకువాఁడు “నేనొకండనే

మహీపాలునకు మాన్యుండను" అని తలంచికొనుచుండెను. ఆసరసా గ్రేసరుండు శత్రురాజులయెడ నతితీక్ష్ణతగాని యతిమృదులతగాని చూపక, పవనుండవనిజంబులదెసఁ గనఁబఱుచు మధ్యమార్గమునవ లంబించి, వారిని స్వస్థానములనుండి యున్మూలనమొనర్పక నమ్రుల గునటులు మాత్ర మొనర్చెను.

కుమారుండిట్లు రాజ్యంబున సుస్థిరుండై ప్రజాపాలనంబొనరిం చుటగాంచి, రఘుమహారాజు స్వర్గవిషయమ్ములుగూడ ననిత్యంబుల గుట నాత్మవిజ్ఞానగరిమంబున వానియందును నిస్పృహత్వమువహించి తరువల్కలధారులగు సంయమీశ్వరుల పదంబునుగైకొనెను. గుణ వంతులగు పుత్రులకు సంపదల సమర్పించి, నిర్జితేంద్రియులై వల్క లాజినముల ధరించి, వార్ధకమ్మున యత్యాశ్రమమును గ్రహించుట దిలీపవంశజులకు సహజమ్ముగదా! కులక్రమాగతాచారానుసారంబుగ నరణ్యవాసోన్ముఖుండయిన జనకుని పదపద్మంబుల నుష్ణీషశోభితంబగు నుత్తమాంగంబునుజేర్చి తన్నుడఁబాసి పోవంజనదని యజమహారాజు కడుదీనముగఁ బ్రార్థించెను. నేత్రములనుండి యశ్రుకణమ్ము లురలునట్లు వేఁడికొను సుతునిఁగాంచి పుత్రవాత్సల్యంబున రఘువాతనికోర్కెని నెఱవేర్చెను. కాని యూడ్చినకుబుసంబును నురగంబు మరలఁ గైకొ ననికరణిఁ దానదివఱకుఁ ద్యజించిన రాజ్యలక్ష్మిని దిరిగి గ్రహింపఁ డయ్యెను. చతుర్థాశ్రమము నాశ్రయించిన యారాజర్షి జితేంద్రి యుఁడై పురంబువెలుపల నొకయనుకూలప్రదేశమున నివాసమేర్పఱ చుకొనెను. పుత్రుని రాజ్యలక్ష్మియు నమ్మహాత్మునకు వలయు పత్ర పుష్పఫలోదకాది సామగ్రిని సమకూర్చుచుఁ బుత్రభోగ్యయగు కోడ లు మామగారిని సేవించునటు లాతనికి శుశ్రూష నొనర్చుచుండెను. పూర్వపురాజు విశ్రాంతినొంద నాతనిస్థానము నధిరోహించిన క్రొత్త

యినునితో వెలుఁగొందు నాయిక్ష్వాకువంశము, పశ్చిమదిశను జంద్రుఁడస్తాద్రికేఁగఁ బ్రాగ్దిశ నుదయించు సూర్యునిచేఁ బ్రకాశించు నభంబుతో సాదృశ్యమును వహించెను. యతిలక్షణంబులను రాజ చిహ్నంబులను వరుసగఁ బ్రకాశించు నాయిరువురునరవరులనుగాంచి నివృత్తి ప్రవృత్తిరూపంబుల వేర్వేఱ భూమియందవతరించిన ధర్మం బుల యంశంబులోయని భూజను లెల్ల భావించిరి.

తానింకను జయింపని భూముల గెల్చు నాలోచనము చెప్పుట కజుఁడు నీతివిశారదులగు మంత్రిసత్తముల నొడఁగూర్చుకొనెను. మోక్షపదవిని జయించుమార్గమును దెలియఁజేయుటకు రఘువు యథార్థవాదులగు యోగిపుంగవులఁ దనయొద్దఁజేర్చికొనెను. యౌవ నవంతుడజుండు ప్రజల ధర్మాధర్మముల విచారించుటకు ధర్మాసనము నధిష్ఠించెను. వృద్ధనృపతి రఘువు చిత్తైకాగ్రత నభ్యసించుటకు విజన స్థలంబునఁ బవిత్రమగు దర్భాసనము నధివసించెను. అజుండు సమీప దేశరాజులను బ్రభుశక్తిగరిమచే వశవర్తులుగఁ జేసికొనెను. రఘువు శరీరగతంబులగు ప్రాణవాయువుల నయిదింటిని బ్రణిధానంబున లోఁ బఱుచుకొనెను. క్షాత్త్రరాజగు నజుండు తన ప్రతాపానలంబున క్షితి యందు శత్రుకార్యఫలంబుల నెల్ల భస్మమొనర్చెను. ఆత్మతత్త్వజ్ఞాన రూపంబగు వహ్నిచే రఘువు భవబీజజనితంబులగుస్వకర్మచయంబుల దగ్ధమొనరించెను. అజుండు శత్రురంధ్రాన్వేషణ మొనర్ప నయచక్షువును నృపమండలమందు నిల్పెను. రఘువు పరంజ్యోతిని గనుంగొన హృద యంబున మనోనేత్రమును నిల్పెను. అజుండు సంధిప్రముఖ గుణషట్క మును దత్ఫలంబును గరమాలోచించి ప్రయోగించెను. రఘువు మృత్కాంచనంబులు రెండింటియందును సమదృష్టివహించి ప్రకృతి యందలి సత్త్వాదిగుణత్రయంబునుజయించెను. స్థిరకర్మరతుండజుండు

ఫలసిద్ధిఁగాంచుదనుకఁ గర్మాచరణము మానఁడయ్యెను. స్థిరచిత్తుఁడు రఘువు పరమాత్మసాక్షాత్కారముఁ బడయువఱకు నైక్యానుసంధానమును విడువఁడయ్యెను. అభ్యుదయమోక్షాసక్తులగు నా రాజవరులిరువురు నప్రమత్తులై స్వార్థప్రవృత్తికై విజృంభించు శత్రువులను నింద్రియములను నివ్విధంబున నిర్జించి మనోరథసిద్ధిని బడసిరి.

సర్వసమదర్శనుండు రఘునరేంద్రుఁడు పుత్రునభీష్టము నెఱవేర్చఁగతిపయవత్సరము లిట్లుగడపి యంత యోగసమాధిచే మాయాతీతము నవ్యయమునగు సాయుజ్యపదంబును జేరెను. జనకుండిట్లు దేహత్యాగ మొనరించిన వార్తవిని కన్నీరుమున్నీరుగాఁగఁ బెద్దయుంబ్రొద్దు దుఃఖించి, మహితాగ్నియగునజుం డాతనికి దహనసంస్కారమొనర్చక, సంయమీశ్వరసహితుండై యతికులోచితంబగు నంత్యేష్టికర్మంబునాచరించెను. పితృకార్యవిధానజ్ఞుఁడగునతం డనంతరము, తండ్రికి నూర్ధ్వదేహప్రాప్తియగుపొంటెఁ దిలోదకపిండాది ప్రదానంబొనరించెను అట్టులాతఁడొనర్చినది యవ్యాజపితృభక్తిమైఁగాని తన్మూలముననే జనకునకుఁ బుణ్యలోకసుఖంబులు లభించునను నూహచేఁగాదు. యోగవిధానమునఁ దనువులఁదొరంగు జీవన్ముక్తులకుఁ దనయులొసంగు పిండప్రదానాదిక మనవసరముగదా !

ఉత్తమగతినందిన తండ్రికై విచారించుట భావ్యముకాదని పరమార్థవిదు లుపదేశింప మనోవ్యథ నపనయించుకొని యజమహారాజంత నధిజ్యశరాసనుండై యప్రతిశాసనంబుగ ధరావలయమెల్లఁ బరిపాలించెను. ఆమహాపరాక్రమవంతుని భర్తగఁబడసి భూసతి యనేకరత్నములఁగనెను. భామినీమణి యిందుమతి వీరవరుండగు పుత్రరత్నమును బ్రసవించెను. దశశబ్దపూర్వకమగు రథశబ్దమునఁ దనరు (దశరథ)

నామంబున నబ్బాలుండు, దశరశ్మిశతోపమతేజుండై, దశకంఠారి గురుండై, దశదిశావిశ్రాంతయశుండయి విరాజిల్లునని విబుధులు వినుతించిరి. అధ్యయన, యజన, సంతానసంపన్నుండై యజుండిట్లుక్రమంబుగ ఋషి, దేవ, పితౄణములనుండి ముక్తుండై పరివేషవిముక్తుండగు ఖరకరునికరణిం బ్రకాశించెను. అజనవిభుని బలం బార్తభయనివారణమునకును, వైదుష్యము విద్వన్నమస్కరణమునకును వినియుక్తములయ్యెను. వేయేల! ఆతనివిత్తంబెకాక సకలసద్గుణవృత్తంబును బరప్రయోజనార్థమే ప్రవృత్తంబయ్యెను.

పాలితప్రజుండు, సుప్రజుం డాయజుండొకనాఁడు, నందనోద్యానమున దేవనాయకుండు శచీసఖుండై విహరించువిధంబున, నగరోపవనంబున దేవీసహితుండై విహరించుచుండెను. అప్పుడు నారదమునీశ్వరుండు దక్షిణాంబుధితీరంబున వెలసిన గోకర్ణేశ్వరుని సన్నిధిని వీణవాయించుటకై, సూర్యుండుత్తరాయణమునుండి దక్షిణాయనమునకు మరలు నాకాశమార్గమునఁ బోవుచుండెను. ఆతని వీణాశిరంబున వ్రేలు దివ్యసుమరచితదామంబునంతి నధివాసస్పృహచేఁబోలెఁ బవమానుఁడు వేగముగఁ గొనిపోయెను. పూలవెంబడిఁ బరిభ్రమించు భ్రమరంబులు వాయుదేవుఁడొనర్చిన యవమతికై యమ్మహతి విడుచు కజ్జలమిశ్రాశ్రుకణంబులోయనఁ గానవచ్చుచుండెను. నిజమధుసుగంధాతిశయంబుచే నాదివ్యకుసుమదామంబంతి నాప్రమదావనమున విలసిల్లు లతావితానంబుల వసంతర్తుసౌభాగ్యమును ధిక్కరించుచు నానృపవరుని ప్రాణేశ్వరి పీవరస్తనాగ్రములపైఁబడి యందు సుస్థిరతవహించెను. సుజాతంబులగు తనయురోజాతంబుల నట్లు క్షణమాత్రము సఖీభావంబునందిన యాపూలదండనుగాంచి తత్క్షణమా నరవరుని యర్ధాంగి రాహుగ్రస్తుండగు చంద్రుని చంద్రికచందంబునఁ వివశయై గనులుమోడ్చెను. చైతన్యశూన్యమగు శరీరముతో నామె

నేలపై వ్రాలి భర్తగూడ నేకకాలంబున నామెతోఁ గ్రిందఁబడి మూర్ఛిల్లెను. దీపశిఖ జాఱుచున్న తైలబిందువుతోఁగూడిక దా భూమిపై వ్రాలును.

అంత నారాజదంపతుల సేవకులొనర్చిన సంకులార్తరవంబులకు భీతిలి యాయుపవనంబందలి పద్మాకరము నాశ్రయించిన విహగము లాపరిచారిక పాళితోసమంబుగ దుఃఖమునొందినట్లాక్రోశమొనరించెను. సేవకుల జలసేచన వ్యజనాద్యుపచారముల నజుండు కొంతవడికి మూర్ఛదేఱెను. కాని యిందుమతి యథాప్రకారము నిశ్చేష్టితయైయుండెను. ఆయుశ్శేషమున్నఁగదా యౌషధాదిప్రతీకారంబులు ఫలించుట! ప్రాణంబులఁబెడఁబాసి శ్రుతియుడంగిన విపంచివలెనున్న హృదయేశ్వరి నానృపవరుండు నిండుప్రేమమై రెండుచేతులతో నెత్తి యామెకుఁ బరిచితంబగు తనయంకతలంబునఁ బెట్టికొనెను. జీవముపోవుటచే భిన్నవర్ణమునుదాల్చిన యామెను నంకతలంబున నుంచుకొని యారాజచంద్రుఁడు ప్రాతఃకాలమున మలినమగు హరిణాంకమును ధరించు శశాంకునివలెఁ గాన్పించెను. అజుండంత సహజధైర్యమును గోల్పోయి నేత్రకమలములనుండి బాష్పకణంబులు జాఱువాఱ గద్గదకంఠుఁడై యిట్లువిలపింపఁదొడంగెను. అచేతనంబగు లోహంబుఁగూడఁదప్తమై మార్దవంబునొందుచుండ నిఁక శరీరధారులమాటచెప్పనేల?

"అక్కటా! విధివిధానము! శరీరతాపమడంచు కోమలకుసుమంబులే యిట్లుమెల్లగ మేనుసోఁకి ప్రాణవాయువులఁగ్రోలు పెనుఁబాములైనవి! ఇఁకఁ బ్రాణములఁదీయనెంచు నాహతవిధి కిజ్జగంబున నేవస్తువు మారణోపకరణముగాకుండును? మృదువస్తువుల మృదుతర పదార్థములనే యంతమొందింప నంతకుండు సమకట్టనోవు! శీతలహిమ సేచనంబున నస్తమించు పద్మిని నాకిందుఁ బ్రథమనిదర్శనమగుచున్నది. ఈపూలదండకు నిజంబుగ జీవంబుల నపహరించు శక్తియేయున్నచో

నురమునధరించు నన్నేల హరింపకున్నది? ఆహా! ఈశ్వరేచ్ఛవలన నొకచో విషమమృతంబును మఱియొకచో నమృతము విషంబును నగుచున్నవి! లేకున్న నిక్కముగ నిది నాభాగ్యమును హరింపఁ బుష్పమాలికారూపమున విధాత సృష్టించిన వింతపిడుగు గానోపు! కాకున్న నిది కొమ్మలపైఁబ్రాఁకు పూలతీవియనుమాత్రము గాల్చి వైచి వృక్షంబు నేలవిడిచిపెట్టును? హా! నాప్రాణధనమా! ఇందుమతీ! అపరాధమొనర్చినప్పుడును దడవుగ నాయెడ నవమతిని జూపియెఱుఁగవు! నిరపరాధుని నీదాసుని నన్నేల యిప్పుడీక్షణము సంభాషణయోగ్యునిఁగఁ దలంపవు? నీవచోమృతధారల నీహతభాగ్యునిపై నీ జీవచ్ఛవముపై నొక్కమాఱు వర్షింపుము. అయ్యో! నాకట్టిభాగ్యమెట్లులభించును? హా! శుచిస్మితవిలాసినీ! తెలిసికొంటిని! తెలిసికొంటిని! సత్యము! సత్యము! ముమ్మాటికి నేను నీయెడ నవ్యాజానురాగములేని శఠుండను. కాకుండిన నాకొకింతయైనఁ జెప్పకుండ నన్నిడఁ బాసి తిరిగిరాకుండఁ బరలోకమునకేఁగుదువు? హా! పాడుజీవితమా! నీకుఁ బ్రాణేశ్వరియందు నిక్కముగఁ బ్రేమయుండి మొదట నామెతో నేఁగియున్నచో నెందులకామెనుండి మరలివచ్చితివి? చేసినకర్మమనుభవింపకతీఱునా? స్వయంకృతాపరాధఫలితముగ నీఘోరవేదన ననుభవింపుము. హా! నాజీవితనిర్విశేషమా! సురతశ్రమంబున జనించిన క్షణభంగురములగు స్వేదకణంబులుగూడ నీముఖమండలమునవింకను నస్తమింపలేదు. కాని యక్కటా! నీవప్పుడే యస్తమించితివా! ఆహా! ప్రాణులెంతయస్థిరములు, ప్రియా! ఇందుమతీ! మనమందైన నేనెన్నఁడు నీకింతవఱకు నప్రియమొనర్చియెఱుఁగను. అక్కటా! ఎక్కతంబున ననువిడనాడి యేఁగితివి! నేను భూసతికిఁ బేరికిమాత్రము పతినిగాని భావలగ్నంబగు ననురాగంబున నిజముగ నీయందబద్ధుండనయియుంటిని. కుసుమానువిద్ధంబులు, భసలకవర్ణమనోహరంబులు

నీకుటిలాలకంబులు మందానిలంబునఁ జలింపఁగ నీవు మరల జీవింతు వని నామనంబాసపడుచున్నది. కావున జ్యోతిష్మతీలతలు రాత్రులందు హిమాచలకందరంబుల తిమంబడంచువడువున నోజీవితేశ్వరీ! పునర్జీవితవై శీఘ్రింబ నాదుఃఖమును బోకార్పుము. చంచరీకంబులు ఝుంకారరవంబులు మాని లోననిమురిం ు నిశాసమయంబున నిమీలితంబయియుండు ప్రత్యేకాంబుజమువలె విగతసల్లాపంబై వికీర్ణచూర్ణకుంతలంబగు నీమొగంబు నన్నుఁ బీడించుచున్నది. సూర్యాస్తమయంబయినంతనే శర్వరీసతి తననాథునిఁగూడుచున్నది. సూర్యోదయంబయినంతనే చక్రవాకి తిన్నడఁబాసి చరింపనేరని ప్రియవల్లభునిఁజేరుచున్నది. ఇందుచే జక్కవకవవిప్పును జక్కవయు నాతిదీర్ఘంబగు తమ విరహావధిని సహింప సమర్థులగుచున్నారు. కాని యెప్పటికిని మరలి రాకుండ నొక్కమాఱుగ వీడి చనిన నీవలని యీవిప్రయోగానలంబున దగ్ధుండనుగాక నేనెట్లు మనఁగలవాఁడను? హా! ప్రాణేశ్వరీ! నవపల్లవతల్పమునఁగూడఁ గసుగందెడి నీయీకుసుమకోమల శరీరము చితారోహణము నెట్లోర్వఁగలదు? రతికేళియందు నీకుఁ బ్రిథమసఖియగు నీమొలనూలు భవత్పాదచంక్రిమణసౌభాగ్యము నశించుటచే నీరవంబై మెలఁకువ నెఱుంగని పెద్దనిదురవోయిన నిన్ను దుఃఖవశంబున ననుసరించినటులు తోఁచుచున్నది. అతికుతూహలమున నీవు త్రిదివమునకేఁగుచుండియు, నాకు దుఃఖోపశమనంబు సేయుపొంటెఁ గృపాతిరేకమునఁ గోకిలములందుఁ గలభాషణంబులను గలహంసములయందు మందగమనంబులను, హరిణులయందుఁ దరళేక్షణంబులను, మందానిలకంపితములగు లతావితానములయందు విలాసంబులను- భవద్గుణగణంబుల నిట్లు ప్రతిష్ఠించియేయుంటివి. కాని భవద్వియోగజనితదుర్వహదుఃఖభరంబును నాహృదయంబు సహింపఁజేయ నవి యెట్లు సమర్థంబులగును? మనోనాయకీ! నిండారు

నెయ్యమున నీతియ్యమామిడిగున్నను, నీప్రియంగులతికను దంపతులుగఁ గూర్చితివి. అయ్యో! యిట్టియెడఁ బెండిలిసలుపక యే వీనిని విడనాడి చనుట నీకు న్యాయమా! భవద్దోహదకృత్యమునఁ బుష్పించిన యీయశోకవృక్షంబు కుసుమంబుల నలకాభరణయోగ్యంబుల నక్కటా! నీదాహాంజలియందు నర్ఘ్యములుగ నెట్లు సమర్పింతు? మఱియు నోశోభనాంగీ! యల్ల నాయశోకభూరుహ మనన్యదుర్లభంబును మంజీరారావమంజులంబును నగు భవచ్చరణతాడనానుగ్రహము స్మరణమునకు వచ్చుటచేఁగాబోలుఁ బుష్పబాష్పంబులఁ గురియుచు నిన్నుఁగూర్చి దుఃఖించుచున్నది. కిన్నరకంఠీ! భవన్నిశ్వాసపవనంబుల ననుకరించు వకుళసుమంబులతో మనమిరువురము విలాసార్థము సగముగ్రుచ్చిన యీమొలనూలు నక్కటా! పూర్తిసలుపకయ యిట్లు గనులమోడ్చ నీకుఁ బాడియే! సుఖదుఃఖముల సమానముగఁ బాలుగొను నీసఖీజనంబులను, బ్రతిపచ్చంద్రసదృశుండగు వర్ధిష్ణుని నీకుమారుని, నవిచ్ఛిన్నానురాగమున నిన్నె ప్రేమించిన నన్నును, నిట్లాజన్మముఁ బెడఁబాసి చను నిష్ఠురవ్యాపార మక్కటా! నీబోఁటి ప్రేమైకనిధికిఁ దగునా? అయ్యో! నీవిట్లస్తమింప నేనింకెట్లు జీవింపఁగలను? నేఁటితోనిఁక నాధృతి యపగతమయ్యె. రతి విరతమయ్యె. సంగీతమ స్తంగతమయ్యె. వసంతసౌభాగ్యము దురంతదౌర్భాగ్యమయ్యె. భూషణప్రయోజనము నిర్విశేషమయ్యె. శయనీయము పరిశూన్యమయ్యె. హా! ప్రాణనాయకీ! సర్వకుటుంబాశ్రయవగు గృహిణివి. హితములబోధించు మంత్రివి సకలోపభోగముల సమకూర్చు రహస్సఖివి. అఖిలలలితకళలను నేర్చికొనిన ప్రియశిష్యవు. ఇట్లు నాజీవితసర్వస్వమవయిన నిన్నుఁ గృపారహితమై మృత్యుదేవత యపహరింప నింక మదీయమగు నేపదార్థమీభూతలంబున నపహృతముగాక నిలిచియున్నది? మదిరాక్షీ! మద్వదనసమర్పిత రసవన్మధు

రసంబును గ్రోలిన నీవిప్పుడయ్యయో! బాష్పధారాకలుషితంబు నాయొసంగు నివాపాంజలి నెట్లు పరలోకమునఁ బానమొనర్తువు? హృదయేశ్వరీ! ఇతరైశ్వర్యములందింతయైనఁ దగులువడక సర్వవిషయములందును నిన్నె దిక్కుగా నమ్మిన యీయజుని సుఖంబింక నీవు లేనికతన విభవంబులెన్ని కల్గినను నింతటిదే గదా.”

కోసలాధీశుండిట్లు ఱాతిగుండెకైన జాలివొడమునట్లు ప్రియసతినిగూర్చి విలపింప వృక్షములుగూడఁ దమశాఖలనుండి జాలువాఱు మకరందవ్యాజమున బాష్పవృష్టిని గురిసెను. అంత నజునిబంధువులంత్యక్రియోచిత మండనాలంకృతయగు నాసతీమణి నెట్లెట్లో యతని యొడినుండి తీసి చందనాగురుకాష్ఠంబుల నగ్నిసంస్కారమొనర్చిరి. అజుండును బ్రాణంబులమీఁది తీపిమైఁగాక, సమస్తమెఱింగిన తనవంటి ధీరుండుగూడ భార్యవెంబడి మరణంబునొందెనని ప్రజలాడునాడిక కోడి దేవితో నగ్నిప్రవేశమొనర్చుట మానెను. నృపతిసత్తములకుఁ బ్రాణముకంటెఁ బ్రజాభిప్రాయమే యధికాదరణీయముగదా! అంత బుధవరుం డాభూధవుండు గుణశేషయగు సతీతిలకమునకుఁ బదిదినములయినపిదపఁ బురోపవనమునందే మహావైభవముతో యథావిధిగ నంత్యక్రియల నాచరించెను. సతీవియోగమునం జేసి రేయి నెడఁబాసిన రేవెలుంగునుంబోలు నారాజచంద్రుఁడంత నిజదుఃఖపూరంబునకుఁ బరీవాహములనందగు పౌరవధూముఖాశ్రువుల గనుంగొనుచుఁ బురము ప్రవేశించెను.

అంత నిజాశ్రమంబున సవనదీక్షయందున్న యిక్ష్వాకుకుల గురుండు వశిష్ఠుండు యోగమహిమంబున నీవిషయంబులెల్లఁ గరతలామలకంబుగ నెఱింగి, దుఃఖమోహితుఁడై యున్న యజుని నూఱడింప శిష్యునొకని నాతనికడకుఁ బుత్తెంచెను. ఆతండును జనపాలుమ్రోలకుంజని సమ్యగ్విధినర్చితుండయి యిట్లు వచించెను. “మహారాజా!

భగవానుఁడు వశిష్ఠమునివరుండు భవద్దుఃఖకారణంబును దెలిసినవాఁడయ్యు నిప్పుడు తానెఱవేర్చుచున్న యాగవిధి సమాప్తముకాకుంట స్వయముగవచ్చి నిన్ను సమాశ్వాసించి యథాస్థితినొందింపఁజాల కున్నవాఁడు. అందుచే నమ్మహనీయుఁడు తన వాక్యంబులుగ నిట్లు తెలియఁజేయ నీకడకు నన్నంపియున్నవాఁడు. కావున నోసదాచారపర! విఖ్యాతసత్వగుణోదార! సంక్షిప్తవచనంబుల నొప్పు నాతని సందేశవాణిని నాముఖంబున విని హృదయపేటికను నెలకొల్పుము. ఆవిజ్ఞానధనుండు పురాణపురుషుండయిన త్రివిక్రముని పదంబులగు త్రిభువనములందును భూతభవిష్యద్వర్తమానత్రితయంబును నమోఘంబగు జ్ఞాననేత్రంబునఁ గనుంగొన సమర్థుండుగదా!

"పూర్వము తృణబిందువను మునిచంద్రుఁడు తీవ్రతపంబొనర్పఁదద్దయు దద్దఱిల్లి యింద్రుఁడాతని సమాధికి విఘ్నమొనరింప హరిణి యను నప్సరోంగన నియోగించెను. అదియును బనివిని యానిలింపభర్తపంపుఁ గొనసాగింపఁగ నాసంయమీంద్రుఁడు తపోవిఘ్నమున కెంతయుఁ గినిసి, యెట్టయెదుటఁ జారువిలాసవిభ్రమంబులఁ జరించు నాహరిణింగనుంగొని, నిజశమాంబునిధి వేలకుఁ బ్రళయకాలతరంగాయమానంబగు కోపాతిరేకంబున "మానవస్త్రీవై పుట్టుము" అని శపించెను. అంత నా కాంత దురంతసంతాపంబునఁ బొగులుచు నాసిరాబారి చరణంబులకెరఁగి "స్వామీ! దేవర యెఱుంగని న్యాయంబులున్నవే! పరాధీననై యొనర్చిన నానేరంబును సైరించి క్షమింపవే" అని కడుదీనాలాపంబులఁ బ్రార్థింప నాతపోధనుండును దొంటిశాంతంబు వహించి "దివ్యపుష్పసందర్శనమగుదనుక భూతలంబుననుండుము" అని యనుగ్రహించెను. ఆహరిణియే యిట్లు శాపవశంబునఁ గ్రథకైశిక రాజవంశంబునఁబుట్టి నీకుఁ బట్టమహిషియై చిరకాలమునకు సురలోకముననుండి కుసుమదామరూపంబున జాఱిన శాపవిమోచన

కారణంబునొంది మరలఁ దననిలయమును జేరెను. కావున నింక నామె మరణంబునకు దురపిల్లకుము. పుట్టినవారి కెల్లఁ గిట్టుట స్వభావసిద్ధము. "జాతస్యమరణంధ్రువ" మ్మను నార్యోక్తి వినియుంటివిగదా ! ఈవసుధాకళత్రంబును జూచికొని యూఱడిల్లుము. వసుమతీసతీగ్రిహణముననే నృపాలురు నిజమయిన కళత్రవంతులుగ భావింపఁబడుదురు. రాజ్యాదిసంపద లొదవినపుడు మదంబునఁ బొదలి నిందలఁబొరయక మనోనిగ్రహమొనర్చి భవచ్ఛాస్త్రవిజ్ఞానగరిమంబును బ్రకటించినాఁడవు. హృదయసంతాపమొదవిన యీయదనునఁగూడ గుండె కుదురుపఱచికొని యట్టివివేకమునే ప్రదర్శింప నర్హుండవు. సర్వావస్థలయందును ధీరత్వము వహించుట మనీషిజనంబులకు నిసర్గలక్షణంబు. ఇవ్విధంబున నెవ్వగల నేలకుందెదవు? విచారించి నీప్రియసఖిని మరలఁ దేఁగలవా? ఆమెతోపాటు మరణంబు నొందినను బరమందుఁగూడ నామెను బడయఁజాలవు. ఏలయనఁ బరలోకమందును దేహులకు నిజకర్మానుగుణంబుగ గతులు భిన్నమార్గములఁ బట్టుచుండును. కావున మనంబున శోకంబుమాని తర్పణాంబువుల నొసంగి నీగృహిణిననుగ్రహింపుము. అదియే నీవామెకొనర్చుపరమోపకారము. అట్లుగాక యిట్లుదుఃఖించుచుంటివేని యకారణముగ నామె కపకార మొనర్చినవాఁడ వగుదువు. ఏమనిన బంధుజనంబు లవిచ్ఛిన్నముగ విడుచు బాష్పకణంబులు మృతినొందినవారిని దహించుననిశాస్త్రములు ఘోషించుచున్నవి. మఱియుఁ బ్రాణులకు మరణమే ప్రకృతియనియు జీవితము వికృతియనియు విబుధులు వక్కాణింతురు. కావున క్షణమాత్రము జీవించియున్నను జీవికదియే యొకగొప్పలాభము. మూఢజనుఁడు ప్రియవినాశనమును హృదయశల్యముగా భావించును. ధీరుఁడన్ననో యందుచే హృదయశల్యము నశించి కుశలమేర్పడి మోక్షలక్ష్మీద్వారము తెఱవఁబడినదని సంతసించును. ఆత్మీయ

ములగు శరీరాత్మలందె సంయోగవియోగములు విశ్రుతమగుచుండ విద్వాంసుఁడయినవాఁడు పుత్రకళత్రాది బాహ్యవిషయ వియోగమునకు సంతాపమును జెందనేరఁడు. జితేంద్రియశ్రేష్ఠుండవు, సకలశాస్త్రవిదుండవు, నీవిట్లు ప్రాకృతమానవునిఁబోలె శోకవశుండవగుట పాడియే? వాతసంఘాతమునకు భూరుహంబులువోలె భూధరంబులును జలించినచో నీకు నా కెంటికిని భేదమేమి?"

ఇట్లు శిష్యముఖంబున నుదారహృదయుండగు గురువరుండు పనిచిన యాశ్వాసవచనంబుల విని యంగీకరించి యజుఁడామునికుమారుని వీడ్కొలిపెను. కాని యావాక్యంబులు దుఃఖసాంద్రమగు నా రాజచంద్రుని హృదయరంగమున నవకాశమును గనఁజాలక, మూర్ఖునకు బోధించిన విద్యవోలె, మరల గురుసన్నిధికే మరలినట్లుండెను. సత్యప్రియభాషణుండజుండీచందంబునఁబ్రియావియోగంబునఁ గుందుచుఁ గుమారుఁడు బాలుఁడౌటఁ దత్క్షణము రాజ్యభరంబాతని పరంబుసేయ ననువుగామిఁ బ్రాణేశ్వరిచిత్రపటదర్శనంబులను, క్షణికంబులగు తదీయ స్వప్నగతసమాగమోత్సవంబులను విరహభరంబుఁ దరించుచు నెట్టెట్లో యెనిమిదియేడులు గడపెను. శోకకీలమీలలఁ గ్రమక్రమముగ వేళ్లువాఱి యశ్వత్థవృక్షాంకురము సౌధతలంబును బోలె నాన్నృపాలుని హృదయమును భేదింపఁగ నాతండును బ్రియావిరహంబును భరియింపఁజాలక మరణమే శరణమని యెంచి, ప్రాణాంతకమును వైద్యదుస్సాధ్యమును నగు నమ్మనోవ్యధను బ్రియానుగమనోత్కంఠచే లాభకరంబుగనే యనుమోదించెను. సుశిక్షితుండును, వినయవంతుండును, గవచధారియు నగు కుమారుని యథావిధిగఁ బ్రజాపాలనమొనర్ప నియోగించి యజుండంత రోగభూయిష్ఠమగు శరీరదుర్వసతిని దొరంగ నిచ్ఛగించి ప్రాయోపవేశవిధియందు నుత్సుకుండయ్యెను. గంగాసరయూసంగమస్థలంబున దేహత్యాగమొన

రించి తత్క్షణమ యమరత్వమంది యానరేంద్రుఁడు పూర్వముకంటె నత్యధికరమణీయత వెలుంగు నిజకాంతామణిఁగూడి నందనోద్యానాంతర లీలాభవనంబుల మరల సుఖక్రీడలఁ దేలుచుండెను.

---

## —* నవమప్రకరణము *—

మనోనిగ్రహంబున నింద్రియముల నోర్చిన దశరథమహారథుండు తండ్రియనంతరము స్వాయత్తమైన యుత్తరకోసలంబును లోకోత్తరంబుగ శాసించి, సంయమీశ్వరులకు నవనీశ్వరులకుఁగూడ నగ్రసరుండయి వెలింగెను. నిజకులాగతంబయిన ప్రకృతిమండలము నెల్లఁదనపురజనముతోపాటు కుమారసమవిక్రముండద్ధరారమణుండు యథావిధిగఁ బరిపాలించెను. అందుచేఁ బౌరజానపదులెల్లరు గుణవత్తరులయి యాతని నధికానురాగంబునఁ బ్రేమించిరి. శ్రమంబులడంచి కర్మఠుల కష్టంబుల ఫలింపఁజేయు గుణోదారులు, సకాలమున జలములఁ గురియు బలవైరియు, ధనముల వర్షించు మనువంశభూషణుం డీయర్థపతియు నిరువురుమాత్రమే యని మనీషిజనంబు లామహారాజును బ్రశంసించిరి. నిర్జరతేజోవిశాలుండగు నయ్యజతనూజుండు శమదమవిలోలుండయి పాలింపఁగ నుర్వర సర్వసస్యాఢ్యయయ్యెను. దైవికంబులగు నాధివ్యాధిదుర్భిక్షాదులకుఁగూడ జనపదంబుల నెచ్చటను బదంబువెట్ట వలనుపడదయ్యెను. ఇఁక మానుషకములగు శత్రుజనభయాదికముల గొడవఁదడవ ననవసరముగదా? దిగంతముల నోర్చిన రఘుభూకాంతునిచే ననంతాకాంత మున్ను కాంతిమతియయ్యెను. అనంతరమాతని నందనుండగు నజునిచేఁగూడ నాచందముననే వెలుఁగొందెను. అహీనపరాక్రముఁడగు నిమ్మహీవల్లభునిచేఁగూడ నిప్పుడక్కరణి నేల ప్రకాశింపకుండును? ఆనరలోకపాలకుండు నమ

వర్తిత్వమున సమవర్తిని, ధనవృష్టిత్వమున ధనదుని, ఖలశిక్షణంబున జలాధ్యక్షునిఁ, దేజంబునఁ బయోజబాంధవుని ననుకరించెను. అభ్యుదయమునకయి పాటుపడు నా రాజచంద్రుని మనంబును మృగయాభిరతిగాని, ద్యూతోత్సాహముగాని, శరచ్చంద్రప్రతిమాభరణంబగు మధురసంబుగాని, నవయౌవనసంపన్నయగు ప్రియాంగనగాని యాకర్షింపఁజాలవయ్యెను. పరుషతనెఱుఁగని యాపురుషోత్తముఁడు త్రిలోకాధీశుఁడగు మహేంద్రునెదుటనైన దీనవాక్యముచ్చరింపఁబోఁడు. పరిహాసములనైన ననృతమాడఁజాలఁడు. శాత్రవులయెడనైనఁ బరుషవచనములఁ బలుకనేరఁడు. ఆయినకులతిలకుండు నిజాజ్ఞానువర్తులయెడ దయార్ద్రహృదయుండును నవిధేయులదెస నయోహృదయుండును నగుటచే రాజులెల్ల నాతనివలన నుదయాస్తమయంబులందుచుండిరి. చతురంభోధివలయితంబగు ధరావలయంబునెల్ల నేకరథుండయి విల్లెక్కుపెట్టికొని యాదశరథమహారథుండు స్వయముగ నిర్జించెను. అత్యంతవేగవంతములగు వారువంబులును, మహోన్నతంబులగు దంతావళంబులునుగల సేనాచక్రమందుచే నావీరాధివీరునకు గెలుపులనుజాటు నుపకరణముగ మాత్రముపకరించెను. వరూధరక్షితంబగు నేకరథంబున భూతలంబెల్ల జయించిన యాధానుష్కవీరునకు, ధనదసమానవిభవునకు, మహారావభీకరంబగు రత్నాకరంబే విజయదుందుభియై వెలసెను.

అలకాధిపవిక్రముఁడయ్యలారమణుఁడు బలాతిరేకమున శత్రురాజులసంహరించి వారి కుటిలాలకామణుల నొసళ్ళమీఁది ముంగురులకును బిఱుందులందలి మొలనూళ్ళకును జెక్కిళులందలి మకరికారచనలకును గీడొనర్చెను. శతధారానిశితంబగు కులిశంబున మహేంద్రుండు మహీభృత్తులను శమితపక్షబలంబులుగ నొనర్చెను. శరధారావిమోచకంబగు టంకారఘోరశరాసనంబున నవపంకజవదనుండీ

మానవేంద్రుండు శత్రుమహీభృత్తుల నస్తమితపక్షబలులుగఁ బొనర్చెను. అమరులాఖండలునకుంబోలె నఖండవిక్రముఁడగు నారాజమార్తాండునకు క్షితిపతులు శతశతములుగ వినమ్రులయి తన్నఖరాగకాంతులచే మిక్కుటముగ మెఱయు మకుటరత్నరుచులతో నాతని చరణంబులను స్పృశించిరి. ఇట్లు దిగ్విజయమొనర్చి నయ్యాజనందనుండు పరిపంథిగణంబులఁ బరిమార్పఁగఁ దనవరోధజనంబు లాతని కడకుఁ దమయనుంగుసుతుల శరణాగతులుగ ననిపి మంత్రులచే వారిచేత నాచక్రవర్తికి నంజలుల ఘటింపఁజేసిరి. అంత నానరవరుండు విజయయాత్ర చాలించి, పారావారతీరమును బరిహరించి, యలకాభరణవిహీనలయిన యాయరినృపాలకులపాలికలఁ గరుణించి, యలకాపురమునకుఁ బురుడగు తన రాజధానికి మరలెను.

ఆసార్వభౌముఁడేకచ్ఛత్రాధిపత్యముగ భూతలమును బాలింపఁగ మఱేతేనికిని శ్వేతాతపత్రమును ధరింపఁ దరంబుగాదయ్యెను. * ద్వాదశభేదములఁ బరంగు రాజమండలమునకుఁ బ్రధానమహీశ్వరత్వమును వహించినను జంద్రాగ్నిసమతేజుండగు నారాజేంద్రుఁడు, తాజయింపని రిపుపదంబు లింకనుండవని సంతుష్టుఁడుగాక యావిషయమున నప్రమత్తుండయి చరించెను. “అసంతుష్టో ద్విజో నష్టస్సంతుష్టఇవ పార్థివ” యని నీతికోవిదులు వక్కాణింతురుగదా. విద్యాబలమునఁ దమోగుణమును, భుజబలమున దిగంతములను జయించి సాత్త్వికధనసంపదలను గడించిన యారాజవరుండు శిరమునుండి బొమిడికం

* 1. విజిగీషుఁడు, (ప్రధానమహీపతి); ఈతనిరాష్ట్రమునకు ముందుభాగమున రాజ్యములు గలవారు. (2) అరి, (3) మిత్రుఁడు, (4) అరిమిత్రుఁడు, (5) మిత్రమిత్రుఁడు, (6) అరిమిత్రమిత్రుఁడు, వెనుకభాగమున రాజ్యములు గలవారు. (7) పార్ష్ణిగ్రాహుఁడు, (8) ఆక్రందుఁడు, (9) పార్ష్ణిగ్రాహాసారుఁడు, (10) ఆక్రందసారుఁడు, (11) మధ్యముఁడు (మధ్యస్థానముననుండువాఁడు) (12) ఉదాసీనుఁడు (తటస్థముగనుండువాఁడు.) చూడుఁడు కామందకము.

బును దొలఁగించి, యథావిధిగఁ గ్రతువులనాచరించి, తమసా సరయూనదీతటంబులను జాతరూపమయములగు యూపజాతములచే మెఱయించెను. ఔదుంబరదండమును, కృష్ణాజినమును, దర్భమేఖలను, వాక్సంయమనమును, హరిణశృంగమును ధరించి యాగదీక్షాపవిత్రుండయిన యామానవేశ్వరుని శరీరమును బరమేశ్వరుఁడధివసించి దానిని నిరుపమతేజోమయంబుగ నొనర్చెను. అవభృథస్నానపరిశుద్ధుండును, నియమితేంద్రియుండును, భాసమానయశుండును, దేవసభాసమాక్రమణోచితుండును నగు నాభూవరుండు నీరములఁగురియు బలవైరి కొకనికిమాత్రమే తన యున్నతశిరంబును వంచి వినమ్రతను జూపెను. కమలపాణిని యగు కమలాసతి, స్వయంభువు, పృథివిధవుండు నగు విష్ణుమూర్తిని, ("నావిష్ణుః పృథివీపతి" యను వచనంబు నెఱింగినదయి) యర్థులదెసఁ గృపణత్వంబు నెఱుంగని కకుత్స్థకులోద్భవుని, దశరథభూధవుని నిరువురమాత్రము నిరంతరము సేవించి యితరనరపాలుర నెవరిని జేరక తనపాతివ్రత్యమును బ్రకటించెను. అమ్మహారథుం డావహాముఖంబున శతమఖునకు సహాయుండై నిల్చి కిగ్గాడియసురులనెల్లఁ దనవాఁడితూపుల నుగ్గాడి, నిర్జరాంగనల భయమును నివారించి తన మహోర్జితబాహుబలంబును వారికి గేయప్రబంధముగ నొనర్చెను. మఱియు ధనుర్ధరుండై యేకరథంబును నధివసించి పురుహూతుని పురోభాగంబున సమరక్రీడ సలుపు నాభూరిబలుండు రణాంగణమున దినకరాభిముఖంబులై వెడలు రేణుపటలంబులను దానవుల శోణితధారలచే మాటిమాటికి నివారించెను. పతిని దైవంబుగఁగొల్చు మగధ, కోసల, కేకయ రాజతనయ లరివీరుల శరముల కెరసేయు నాశూరవరునిఁ బర్వతపుత్రికలగు నదులు రత్నాకరునివలె వరునిగఁ బడసిరి.

భార్యాత్రియంబుతోఁ బరంగెడి శత్రుమారణోపాయవిచక్షణుం డగు నాభూరమణుండు మానవులం బాలించు నభిలాషతో శక్తిత్రయసమేతముగ భువి నవతరించిన శక్తిధరుండోయన వెలుఁగొందెను.

సముంచితపరాక్రమంబున యమ, వరుణ, కుబేర, మహేంద్రాది దిక్పాలురతో సమంబుగ లోకభారమును వహించు నాసార్వభౌముని సేవించువాఁడై వసంతుండంత "రిక్తహస్తేన నోపేయాద్రాజానం దైవతం గురు" మ్మను ధర్మమ్మును దలంచి కాఁబోలు నవకుసుమసంభృతుండయి చనుదెంచెను. హిమవృష్టిచేఁ జందనపల్లవంబులు వైవర్ణ్యముం జెందిన గంధవుమలను బరిత్యజించి, యినుండంత ధనాధిపాధిష్ఠితంబగు నుత్తరదిశ కేఁగఁదలంచి సారథిచే రథాశ్వముల వెనుకకు మరల్పించి, తద్దిశాభిముఖుండై బయలు వెడలెను. హిమావరోధనివారణంబునఁ బ్రభాతములను బాగుగఁ బ్రకాశింపఁజేసి యాప్రభాకరుండు దినాంతమున వలవంతంగుందు జక్కవవులుంగులందలి యక్కటికంబునంబోలెఁ దనప్రయాణమును మెలమెల్లఁగ సాగింపఁదొడంగెను. అంతఁ గుసుమంబులు వికసించెను. క్రొంజివురులు గనలు కొనెను. వాని వెంబడి భ్రమరగీతములును గండుఁగోయిలలగానంబులును మెండుకొనెను. మనోహరతరువిభాసితంబగు వనస్థలిని మాధవుండిట్లు యథాక్రమముగ నవతరించెను.

మదవివశయై లజ్జనుజ్జగించు ప్రమదామణి ప్రియుండిడిన యార్ద్రనఖక్షతంబునుబోలె, వనమాలిక, వసంతిసాంగత్యమునఁ బొడమిన వక్రంబగు నవపలాశమును దాల్చి సొబగొందెను. మఱియు నమ్మదవతి సిగ్గువిడిచి తిరిగి తనరమణునందిడు నఖక్షతాభరణములోయన వసంతలక్ష్మి యిడిన ముకుళసంతతులు మోదుగుచెట్లులందుఁ గన్పట్టెను. మదనశరభిన్నమానసలగు మానవతులకుఁ మృదు మధురవచన చతురలగు చెలికత్తెయలువోలెఁ గోకిలంబులు తమ మృదు

రవంబులచేఁబ్రిణయకలహామధ్యమునంద, ప్రియవల్లభసమాగమంబు సుగమంబానర్చెను. తరుణీమణుల మొలనూళ్లను గటితటములనుంచి యెడఁబాపి, దంతక్షతాంకితంబులగు వారి యధరోష్ఠంబులకు దుర్భరంబయిన శిశిరంబును నిశ్శేషముగ హరింప నసమర్థుండయి తదాటోపంబు నింతదనుకఁ గొంతగొంత యడంచుచుండిన ప్రభాకరుం డప్పుడు వసంతసాహాయ్యంబున దుర్ధాంతుండయి దురంతప్రితాపంబున నామంచునెల్లఁ బటాపంచలొనర్చెను. ప్రసన్నములగు వెన్నెలలను, హాయిగవీచు కమ్మతెమ్మెరలను, సంఫుల్లములగు వృక్షతల్లజములను, మృదుమధురములగు పికకూజితములను జెలువంబుమీఱి హేమంతమును వెన్నుదన్ని యుపభోగరసవంతమగు వసంతమహాహా! యెవరికమ్మతోపమానము గాకుండును?

పూమొగ్గలను దొడిగి మలయానిలంబునఁ బల్లవంబుల నల్లనఁ గదల్చుచు రసాలవల్లరి యభినయము నేర్చునదియుంబోలె విలసిల్లి, రాగద్వేషవిదూరులగు నిరాబారుల మనంబులకుఁగూడ విరాళిగొలిపెను. శౌర్యాదిగుణంబుల నీతిమార్గంబునఁ గూర్పంబడి సజ్జనోపకారంబ ఫలంబుగఁగలిగిన దశరథుని ధనంబునకయి యర్థిజనంబులువోలె, సరోవరములందు మకరందపూరితములయి వెలుంగు కమలంబులకడ నలికులంబులును జలవిహంగములును మూఁగుచుండెను. ఆసవవాసితంబును, దశనచంద్రికావిభాసితంబును నగు వసంతుని హసితంబువోలె మెఱయుచుఁ జిరసంచితశుచిరసంబయి పరంగు వకుళసుమంబును మధులిహంబులు దమిమీఱ సేవించెను. ఆమధుమాసమున వికాసమొంది విలాసినీమణులచే నలకాభరణములుగ ధరింపఁబడు నశోకతరునూత్నపుష్పంబులేగాక యాపూఁబోఁడులు శ్రవణావతంసములుగఁ దాల్చు తత్క్షసలయప్రసవంబులుగూడఁ దద్వల్లభుల యుల్లంబులకు మదనోద్రేకమును గలిగించెను. మాధవుండుద్యాన

లక్ష్మి తనువునందిడిన పత్త్రరచనంబులవలె నలరారు మధుపదంపతులను మధురసదానంబునఁ దనిపి గోరంటపూలు వారి ఝుంకారోన్మేషమునకుఁ గారణంబులయ్యెను. పద్మవదనలు వదనాసవగండూషమున దోహదంబొనరింపఁ దదనుగుణగంధంబులయి పొగడచెట్లయందుఁ బువ్వులుద్గమించెను. ఆపుష్పపరిమళంబులకుఁ జొక్కి బారులుగట్టి వచ్చు మధుపానవిలోలంబులగు రోలంబకులములచే నావకుళము లాకులితములయ్యెను. దీర్ఘమ్ములయినచోఁ దమ్ముఁ బాంథవధూజనంబులు దరింపనేరరని కరుణించినవియుంబోలె వెన్నెలరేలంత హ్రస్వములు కాఁజొచ్చెను. పుష్పితమ్ములయి కమ్మవాసనల విరియఁజిమ్ము వనవాటికలయందుఁ గోకిలరుతంబులు ముగ్ధవధూజనాలాపంబులవలెఁ దొలుదొల్తఁ బరిమితంబులయి వినవచ్చెను. ప్రమదావనమ్మున సమీరకుమారప్రేరితమ్ములయి కిసలయమ్ములఁ గదల్చు లతావళులు, మదాళిరవమ్ములు శ్రవణసుఖంబులగు గీతమ్ములుగను, విమల లతాంతమ్ములు కోమలదంతిరుచిపూరమ్ములుగను దనరఁ గరమ్ముల నభినయమ్ము నెఱపుచున్నవోయనఁ గరమ్ము ముదమ్ముఁ గొలిపెను. మనోజ్ఞపరిమళమున వకుళసుమమును బరిహసించి, మనోహరవిలాససంఘటననై పుణ్యంబున దంపతులకుఁ బరస్పరానురాగంబును బెంపొందించి, మనోభవరసోద్దీపకంబగు మధురసంబును మధురవాణులప్పుడు ప్రియులతోఁగూడ సేవించిరి. మరుని బలంబులగు భ్రమరంబులు పుష్పాసవానుషంగంబున సురభిళంబులగుచుఁ దిలకవృక్షాగ్రహర్మ్యతలంబులఁ బ్రియులతోఁగూడ వేనవేలుగఁజేరి కలమధురంబుగ గానమొనర్చెను. మదకలంబులు నుదకలంపటంబులు నగు విహంగములతోడను, నిండారవిరిసిన వెలిదమ్ములతోడను నొప్పారి గృహదీర్ఘికలు విశ్లథములయి కలకలమ్రోయు మొలనూళ్లను, మందహాసభాసురములగు మొగములను దనరు మందయానల చందంబున వెలుఁగొం

దెను. మగలమెడ నెయ్యపుటలుకఁబూని, మార ప్రేరణమున మరల వారియందు ధ్యానము వహించియు మానాతిరేకమునఁ దత్సంగమమునకుఁ జననేరక, చిరకాలమామనోవ్యథను గ్రుంగు తరుణీమణులకుఁ గుసుమితమ్మును గండుఁదుమ్మెదలు పొదువుటచే వినమితమ్మును నయిన సహకారమప్పుడత్యంతము కామవికారమును గొలిపి తన్మనస్స్థైర్యమును బూర్తిగ సడలించెను. చంద్రోదయమగుడు మొగమున వెల్లఁదనము గదుర రేవెలంది యావసంతవాసరములఁ దనుత్వము నొంది ప్రియసాంగత్యవిహీనయగు తరుణీమణివలె నానాఁటికిఁ గృశింపఁదొడంగెను. సురతశ్రమనివారకములును, దుషారరాహిత్యమున నత్యంతకాంతిమంతములును నగు కిరణములచే హిమకరుండు మకరకేతనుని పూవింటిని మఱింతవాఁడియొనర్చెను. మృదులములగు దళములను గోమలములగు కేసరములను గలిగి, ప్రజ్వలితాగ్నివలె మెఱయు వనలక్ష్మికిఁ గనకాభరణప్రాయమగు కర్ణికారపుష్పంబును బ్రియులుముడువఁగఁ దరుణీమణులు కురులయందు ధరించిరి. కజ్జలబిందువులవలె సొబగుమీఱి కుసుమపంక్తులందు వ్రాలు నలికులంబులఁగూడి తిలకవృక్షము, నతీతిలకమునకుఁ గస్తూరితిలకమువలె వనస్థలికి శోభనొడఁగూర్చెను. తరులపాలి తరుణవిలాసినియగు నవమల్లికాలత మకరందగంధయుతములగు మందహాసరుచిపూరములను గుసుమరూపమునఁ గిసలయాధరమునుండి పఱపి చూపఱడెందముల కానందమునుగూర్చెను. గండుఁగోయిలలచే నధిష్ఠింపఁబడి, పూలబరువునవంగి, పద్మపరాగసంభృతమై వీచు మారుతంబునఁగదలియాడు నశోకలత శోకాగ్నిసంతప్తములగు పాంథసీమంతినీచిత్తములను గేవలమనలముగఁ బొనర్చెను. అధరీకృతారుణ * రాగంబులగు రక్తాంబరములును, శ్రవణావతంసీకృతములగు యవాంకురములును,

* అరుణుఁడు = అనూరుఁడు.

మృదుమధురములగు కోకిలరవములును ననియెడు మరుని బలములు తరుణజనులకు మరులుగొలిపి వారి నాయామునితరుణమునఁ దరుణీ లంపటులుగఁ బొనర్చెను. తెల్లని కింజల్కముల సంతతటను బలుపుఁ జెంది యలికులసమాకులితమయి వెలుఁగొందు తిలకసుమమంజరి, కుటిలాలకలు కురులందుఁదాల్చు ముక్తాజాలమువలె శోభిల్లెను. ధనుర్ధరుఁడయి వాహ్యాళికింజను మకరకేతనుని పతాకమో, వనలక్ష్మి పరిమళమునకయి దాల్చు ముఖచూర్ణమో యనఁ దనరి, పవనవంత మగు నుపవనంబునుండి వెడలు పుప్పొడిని వెన్నడి తుమ్మెదలు పరువు లెత్తెను. ఆవసంతోత్సవమునఁ గాంతామణులు ప్రియులతోఁగూడి వినూత్నడోలికల నూఁగులాడిరి. ఆవేడుకయందాచానలు గడితేలిన నెఱజాణలయ్యును బీతరజ్జుగ్రహణసమయంబున వారి బాహులతలు ప్రియాలింగనత్వరచే జడత్వమును జెందెను. "మానవతులారా! మీయలుకల నిఁకఁగట్టిపెట్టుఁడు. భోగయోగ్యమగు మీజవ్వనము వనమునఁగాచిన వెన్నెలగానేల? అది గతించిన మరలవచ్చునది కాదు. కావున సమయము దాఁటఁబెట్టక ప్రియులఁగూడి విషయానందముల ననుభవింపుఁడు." అను మదనుని మతంబును బరభృతముఖంబున నివేదింపఁబడినవారువోలె నవ్వసంతంబునఁ గాంతాజనములు యథేష్టముగ సుఖక్రీడలఁ దేలిరి.

శౌర్య సౌరభ్య సౌందర్యంబులఁ గ్రమంబుగ మధుసూదన, మధు, మన్మథసన్నిభుఁడగు దశరథభూవిభుండును నామనోహరవాసరంబుల విలాసినీమణులఁగూడి యథాసుఖముగ వసంతోత్సవముల ననుభవించి మృగయాభిరతుండయ్యెను. వన్యసత్త్వాదికములగు చంచలలక్ష్యములను గూల్చుటలోఁ బరిచయంబునుగలిగించి, వాని భయక్రోధాదిచేష్టితముల గుఱుతెఱుఁగు నైపుణ్యమును ఘటించి, శ్రమనుసహింపఁజేసి, లాఘవాద్యనేకసుగుణంబుల నొడలికి నొడఁ

గూర్చుటచే రాజులకు వేట దుర్వ్యసనముగాక యావశ్యకర్తవ్యమని సచివసత్తము లామహారాజునకు విన్నవించిరి. తేలికయగు నీలివస్త్రములతో వేటకనుకూలించు వేషమును దాల్చి, విశాలకంఠమున వింటిని దగిల్చికొని, యానరేంద్రుఁడంత మృగయావిహారమునకు బయలువెడలి యశ్వఖురోద్ధూతములగు రేణుపటలములచే మింటితెరువును మేలికట్టుతోఁగూడినదోయనఁ గనుపట్టఁజేసెను. కృష్ణసారములువిహరించు కాంతారభూములపయి వేటలాడుచు నాసార్వభౌముఁడు వనమాలికాగ్రథితంబగు మాళితోడను, తరుపర్ణసవర్ణంబగు వర్మంబుతోడను హయవల్గనచలితంబులగు కుండలములతోడను నెంతయుఁ బ్రకాశించెను. అనిందితమార్గమున నీతిని బాలించుచుఁ గోసలదేశీయుల కానందమును గూర్చి ప్రశస్తరాజకార్యాలోచనమునఁ జరించు నచ్చారులోచను నప్పుడు వనదేవతలు తనులతావితానములఁ దనువులను, భ్రమరలోకముల విలోకనవ్యాపారములను నునిచి యావనవీథులందుఁగాంచి యానందించిరి.

వేటకుక్కలను వలలను గైకొని, వేటకాండ్రు ముందు చని యచ్చటచ్చట నిపానభూముల నేర్పఱిచి చోర దవాగ్నిభయ విరహితముగను, గంటకపంకశూన్యముగను, దురగసంచరణయోగ్యముగను బొనర్చిన కాననప్రదేశంబును, మృగ విహగ గవయాది వర్గసమృద్ధంబైనదాని నాభూవిభుండంతఁ బ్రవేశించెను. మనోవ్యథావిదూరుండగు నప్పురుషసింహుఁడు భీకరసింహనాదముల సింహములకు రోసంబుగొలిపి, మేలిపసిండివలె మెఱయు మెఱుపుఁదీఁగె నాఁగాఁదనరు నింద్రధనుస్సును భాద్రపదంబు దాల్చుకరణి నధిజ్యశరాసనంబును గైకొనెను.

మృగశాబకములు పాలుద్రావుటకు మాటిమాటికిఁ జన్నులఁ బెణుకుటచే నాఁకుజింకలు మందమందముగ నడచుచుండ నొకమృగయూథము మదదర్పితంబగు కృష్ణసార మొకండు మునుముందు మెఱయ

దర్భాంకురములు మెసవు మొగంబులతో నారాజేంద్రు నెదుటఁ బొడకట్టెను. అత్యంత వేగంబునఁ బాఱు వాహనంబుపై స్వారి వెడలు నభ్యావరుండు తూణముఖంబునుండి బాణంబు నెత్తి వెంబడింప నాహరిణయూథ మెల్ల యథాయథమై భయాకులార్ద్రంబులగు దృష్టిపాతంబుల నవ్వనంబునంతయుఁ బవనకంపితములగు నిందీవరదళబృందముల చేతనుంబోలె శ్యామాయమాన మొనర్చెను. హరిప్రభావుండగు నద్ధనుర్విద్యావిశారదుండు గుఱియిడి యొక కురంగము నేయనుంకించెను. గాని యంతలో దాని ప్రేయసియగు నాఁడుజింక తటాలున వచ్చి యనురాగమునఁ దన దేహమును నాథునకడ్డముగ నిలిపెను. అంత నాతఁడు దానుగూడ స్వయముగఁ గాముకుఁడగుటఁ గరుణార్ద్రహృదయుఁడై చెవిదనుకఁ దివిచినప్పటికిని బాణమును నిముసములో ననాయాసముగ నుపసంహరించెను. అనంతర మితరహరిణములపై శరములు విడువ నన్నరవరుండు సన్నద్ధుఁడయ్యెను గాని భయాతిరేకమున నత్యంత తరళములగు నమ్మృగవిలోచనములఁ గాంచినంత నిజప్రాణాంగనానయన విభ్రమచేష్టితంబు లాతని స్మృతిపథమునంటి కర్ణాంతప్రదేశమునంటిన యాతని దృఢముష్టిని సప్రయత్నముగ నడలించెను. పదంపడియభ్యాభదారుండు భూదారకులంబు లార్ద్రపల్వలములలోని పంకతలమునుండి లేచి పలాయితములైన మార్గమును, శ్రమవివృతంబులగు తద్వదనంబులనుండి జాఱిపడిన తుంగమొలకలతునకలవలనను, బొడవులై తడిసోఁగూడిన యడుగులవరుసలవలనను సులభముగ నెఱింగి దాని ననుసరించెను. పూర్వదేహము నించుకవంచి వాహనముమీఁదినుండి తిమ్ముఁ మారణమొనర్పఁజూచు నమ్మానవేశ్వరుఁగనుంగొని వరాహములు వెండ్రుకల నిక్కఁబొడిచికొని ప్రతిఘటించి యాతనికి ఘాతయొనర్ప నాయత్తములయ్యెను గాని యంతకుమున్న యుర్వీరావతారుఁడు పఱపిన వాఁడితూపులు, వృక్షములనానికొనిన తమ జఘనతలం

బులఁదూసికొని యుత్తరకాండములకుఁ దమ్మింటఁగట్టుట తెలుంగవ య్యెను. అతిరభసంబున మీఁదికివచ్చు నొక యెనుబోతుంగని యా జనవిభుండొక నిశితశరంబును దివిచి దానినేత్రవివరంబుననాటనేసెను. అంతనాశిలీముఖము రక్తసిక్తపుంఖమయి యామహిషంబు శరీరంబును భేదించుకొనివచ్చి దానిం దొలుదొల్త నేలఁగూల్చి పిదపఁ గ్రిందఁ బడెను. దుష్టశిక్షణతత్పరుం డానరవరుండు నిశాత క్షురప్రంబుల ఖడ్గ మృగంబులకు శృంగభంగ మొనర్చి వానిశిరోభారంబుహరింపఁ జేసెను. దుష్టనిగ్రహసియుక్తులగు సార్వభౌములు సహింపఁజాలనిది శాత్రవుల శృంగంబు (ఔన్నత్యంబు) గాని వారి దీర్ఘాయువుకాదుగదా! వాయువేగమున భిన్నంబులై పడు సంపుల్లసర్జకవృక్షాగ్రవిటపంబులవలె వ్యాఘ్రంబులు గుహాముఖంబులనుండి లంఘించి యభిముఖంబులు గాఁగ నభూపాలకుండు నిర్భీకుండయి శిక్షావిశేషమున నలవడిన హస్తలాఘవనైపుణ్యమున నొక్కత్రుటిలో వాని వదనవివరంబులఁ బ్రదరనికరంబులనింపి తూణీరములుగ నొనర్చెను. ఆరాజసింహుఁడంత సింహములను హింసింపనెంచి నికుంజగర్భముల నడఁగియున్నవానిని బిడుగులవలె బెడిదములగు వింటిమ్రోఁతలచే రేఁగఁగొట్టెను. తన విక్రమంబునకు వెఱచి యేయపకారమును దలపెట్టక మూలలడాఁగిన యామృగేంద్రముల నానరేంద్రుఁడు వెదకివెదకి చంపనెంచుటకవి వీర్యాతిరేకమున మానవులలోఁ దానువలె, మృగములలో రాజశబ్ద మును వహించినవను నసూయయెకదా కారణము! గజకులంబులదెస బద్ధవైరమూని తత్కుంభస్థలవిదారణవిలగ్నముక్తాఫల శోభితంబులగు కుటిలనఖాగ్రంబుల వెలుఁగొందు పంచాననంబులనెల్లఁ బంచత్వ మొందించి యామహారాజు రణరంగములఁ దనకు సాయమొనర్చు నేనుఁగుల ఋణంబును మార్గణంబులచేఁ దీర్చికొంటినని తలంచెను. ఆనరపాలుఁడంత నొకప్రదేశమున సవరపుమెకములచుట్టును దనగుఱ్ఱ

మును బరువెత్తించి, యాకర్ణనికృష్టంబులగు నిశితభల్లంబుల వర్షించి, యాత్మీయశాత్రవరాజనివహంబులఁబోలె వానిని శ్వేతచామరవిహీనంబులఁగావించి, తత్క్షణమంతటితో శాంతివహించెను. శూరవరులోర్వనిది రిపువీరులయైశ్వర్యముగాని వారి ప్రాణధనంబు కాదుగదా! మయూరమొకండు సురుచిరకలాపముతోఁ దురగసమీపంబునన విలాసముగ లాస్యమొనర్చుచున్నను నభూరమణుండు సురతసమయవిగళితమును వివిధవర్ణప్రసూనసంకీర్ణమునగు ప్రాణేశ్వరీచికురకలాపముపై మనమ్ము గొల్పినవాఁడయి తనశరమ్మున కామయూరమ్మును గుఱిసేయఁడయ్యెను.

ఇట్లు దుష్కరవ్యాయామమొనర్చు నా రాజేంద్రుని యలకజాలకములనంటి వదనాంబుజముపైఁ గ్రమ్మిన స్వేదకణంబులను బల్లవపుటంబుల విపాటనమొనర్చు వనసమీరణుండు తుషారశీకరసంభృతుండయి చనుదెంచి చుంబనమొనర్చెను. రాజ్యభారమంతయు సచివుల భుజస్కంధములపైడించి కార్యాంతరముల నెల్ల విస్మరించి తదేకగతుండయి తన్ను సేవించు నాభూరమణుని, మృగయావిహారము చతురయగు కామినీమణివలెఁ దన మోహవాగురయందుఁ దగుల్కొనఁజేసి వశంవదునిగ నొనర్చికొనెను. పరిజనంబులనెల్ల వీడి యానరేశ్వరుండొకచోటఁ బ్రజ్వలితంబులగు మహౌషధీలతలు దీపికావితతులు గాఁగ సుకుమారకుసుమప్రవాళశయనంబుపైఁ బవళించి రాత్రిని వెళ్ళఁబుచ్చెను. ఉషఃకాలమునఁ బటుతరపటహనినదమ్ములకుమాఱుగ గజయూథములు కర్ణతాళంబులఁ బ్రబోధింపఁగ నానరేంద్రుఁడు నిద్రసాలించి విహంగమమధురకూజితములను వందిజనమంగళగీతంబులుగ నాలకించుచు నెంతయు వినోదించెను. అనంతరమొకతటి నప్పుడమిఱేఁడ కాంతారమధ్యంబునఁ గృష్ణసారములు సనిన తెరువునంటి, మార్గాయాసముచే వాహనంబు నురుఁగులు గ్రక్కుచుండఁ

పార్శ్వచరులకు నగపడక యా తాపసజనసమాశ్రితయగు తమసాతరంగిణిని జేరెను. అంత నానదీజలములనుండి కుండముంచినధ్వని యొకం డాతనికిఁ గర్ణగోచరమయ్యెను అది గజబృంహితమని శంకించి యా నరవరుం డాక్షణమ యాశుండాలమును వధించుతలంపుతో శబ్దము ననుసరించియేఁగు శరంబొకటి ప్రయోగించెను. రణరంగమునఁదక్క మాతంగవధం బవనిపాలురకు నిషేధంబని శాస్త్రములవలన వినినవాఁ డయ్యు నద్దశరథభూవిభుండు "బుద్ధిః కర్మానుసారిణీ" యను వచనంబుచొప్పున శాసనోల్లంఘనమొనర్చి యట్టి యకార్య మాచరించెను. విద్వాంసులుగూడ రజోగుణనిమీలితులయి యొక్కొక్క వేళఁ గాని దారులు ద్రొక్కుదురుగదా ? అంత "హా తండ్రి" యను నాక్రందనంబు కర్ణపుటంబులఁబడఁగ విషణ్ణుఁడయి యన్నరేశ్వరుం డయ్యార్తరవకారణంబారయ వెదకివెదకి దుబ్బులనడుమ ఘటంబొకటి చేతఁబట్టుకొని శరసంవిద్ధుఁడై యున్న మునికుమారునొకనింగని సంతాపభరంబునఁ దానుగూడ హృదయశల్యపీడితుండయ్యెను. ప్రఖ్యాతవంశసంభవుం డాభూధవుండంత వారువంబుడిగి నిజవంశంబును బ్రశ్నింప నమ్మునిపుత్రుఁడు జలములతోనిండియున్న తనకుండపై నానుకొని గద్గదకంఠుఁడయి యక్షరప్రాయములగు పదములతోఁ దానొక ద్విజేతరతాపసతనయుండనని వాక్రుచ్చెను. అంత నమ్మునికుమారుఁడు ప్రార్థింప దశరథుం డతని యభీష్టానుసారముగ శరీరమునుండి శరమును బెఱుకకయ యాతని నంధులగు మాతాపితలకడకుఁ జేర్చెను. తలిదండ్రుల యెదుట మరణావస్థలోఁబడియున్న యాదంపతుల యేకపుత్రునికడ కేఁగుచు నమ్మానవేశ్వరుఁ డజ్ఞానవశంబునఁ దానొనర్చిన యకృత్యమును వారికి విన్నవించెను. అంత నావృద్ధదంపతులు దురంతసంతాపంబునఁ బెద్దయుంబ్రొద్దు శోకించి కుమారుని యురంబుననాటిన శరంబు నాహంతకునిచేతన యూడఁబెఱికింపఁగ నబ్బాలుండు ప్రాణంబుల

విడనాడెను. అంత నావృద్ధతపస్వి దుఃఖభరంబున నయనంబులనుండి జాలువాఱు నశ్రుకణంబులఁ గరంబులఁబట్టి, పాదతాడితమై విషంబు గ్రక్కు నురగంబుకరణి "నావలె నీవుగూడ నంత్యదశయందుఁ బుత్రశోకంబున మరణంబు నొందు" మని యమ్మహారాజును శపించెను. ప్రథమాపరాధియగు నక్కోసలాధిపుఁడంత నమ్మునీశ్వరునిఁజూచి "మహాత్మా! పావకుండు కట్టెలతో మండి దహించినను గటికినేలకది దోహదమయి బీజోత్పత్తికిఁ గారణంబగునట్లు, కొడుకు ముద్దుమొగంబును గన్నారఁగాంచుపున్నెంబు నోచుకొనక దయాధర్మముల నెఱుంగని యీకటికివానికిఁ బరమపావనులు తా మొసంగిన యీతిట్టుగూడ జీవనమై తలిర్చుచున్నది. కరుణాలేశమయినను లేక మీపుత్రునిఁ గూల్చిన పాతకిని, నను మీరు సర్వవిధముల వధ్యుండను. ఇట్టినేనిఁక మీకేమి యొనర్పఁగలను? సెలవిండు" అని వచించెను. అంతటనత్తాపసుండు దానిఁక భార్యాసమేతముగఁ జిచ్చుఱికి, గతాసుఁడై పుణ్యలోకముల కేఁగిన తనకుమారునిఁ గలిసికొందుననియుఁ బ్రజ్వలితంబులగు నింధనంబుల వెంటనే సమకూర్పింపుమనియు నతనిని వేఁడికొనియెను. అంతలోఁ దన్నుఁజేరవచ్చిన యనుచరులచే నమ్మహారాజు మునీశ్వరుని ప్రార్థనము తత్క్షణమ నెఱవేర్పించి పాతకాచరణదుఃఖంబున ధైర్యంబు డీలుపడ, మహార్ణవగర్భమున బడబానలమువలె, నాత్మవినాశకారణంబగు మునిశాపంబు హృదయంబున నిరవుకొన రాజధానికి మరలెను.

---

—* దశమప్రకరణము *—

ప్రాకశాసనతేజుండగు నద్దశరథభూభుజుం డనూనైశ్వర్యము లఁదులఁదూఁగుచుఁ గించిదూనముగఁ బదివేలుసంవత్సరము లీయిలా

తలమును బరిపాలనమొనరించి యఖండ తేజోనిధియై వెలింగెను. కాని పితృఋణమోక్షసాధనంబును శోకతమోనుదంబును నగు పుత్రనామక దివ్య తేజంబునుమాత్రము పడయఁజాలఁడయ్యెను. ఈవిధంబుఁజూడఁగ మునుముందుప్పొంగి మహాప్రవాహంబుతోఁ బాఱుటకుఁగాను దాత్కాలికముగ నడఁగియుండు శోణానదివలె, ముందనుపమవిభవంబునఁ దన్నుఁ బ్రకాశింపఁజేయు సంతతికొఱకై మనువంశం బామహారాజు నందప్పటికణఁగియున్నట్టులు తోఁచుచుండెను. రత్నసంతతినొసంగుట కుఁగాను రత్నాకరము మథనకాలంబునకుఁ బూర్వమనభివ్యక్తమై యున్నటులు దశరథభూవిభుఁ డొకమహత్తరకారణార్థమే యింత కాలము సంతానవిహీనుఁడై యుండెను. విబుధేంద్రులును జితేంద్రియులు నగు ఋశ్యశృంగాదిసంయమీశ్వరు లంతట సంతానార్థియగు నభ్యాకాంతునిచేఁ బుత్రకామేష్టిని జేయింప నారంభించిరి.

ఆసమయంబున లోకవిద్రావణుండగు రావణునిచే వేధింపఁ బడు దేవతలాతని బాధల సహింపఁజాలక, గ్రీష్మాతపఖిన్నులగు పాంథ జనులు విశాలచ్ఛాయావృక్షంబునుబోలె క్షీరసాగరశయనుండగు నారాయణుని సాన్నిధ్యంబును జేరిరి. అమృతాంధసులట్టు లాయమృత నిధిని జేరునప్పటి కమృతనిధియగు నయ్యాదిపురుషుండుగూడఁ దన యోగనిద్రనుండి మేల్కాంచెను. ఈదృశంబగు నవిలంబము భావి కార్యసిద్ధి కెంతయు శుభసూచకముగదా!

అట్లు ప్రత్యక్షమయిన యాదివ్యమంగళవిగ్రహమును, భోగి భోగాసనంబున నాసీనమై తత్ఫణామండలోదగ్రమణిచ్ఛటలచే జాజ్వ ల్యమానమగు నప్పరమసుందరాకారమును, కమలాసనస్థయగు కమ లాదేవి దుకూలవస్త్రమునఁ గాంచీదామము నాచ్ఛాదితమొనర్చి, కరపల్లవంబుల నాస్తీర్ణముగఁ బొనర్చిన యంకతలంబున సుకుమార

చరణారవిందములం జూచు నమ్మనోహరవిగ్రహమును, వికసితార వింద వీక్షణంబులతో, బాలాతపనిభాంశుకంబుతో శరత్కాలదివసం బువోలెం బ్రారంభసుఖదర్శనంబగు నద్దివ్యతేజమును, లక్ష్మీదేవికి విలాసదర్పణంబై, రత్నాకరాంబుసారమై, నిజప్రభాపటలంబునందు శ్రీవత్సలాంఛనంబును లోంగొను కౌస్తుభరత్నంబునం బ్రకాశించు విశాలవక్షస్స్థలంబుతో విలసిల్లు నయ్యనుపమ సౌందర్యధామమును, దివ్యాభరణభూషితంబులు విటపసదృశంబులు నగు దీర్ఘబాహువులతో నయ్యంబురాశిమధ్యమున వెలుంగొందు నాభక్తజనపారిజాతమును, దానవాంగనాకపోలఫలకవిలసన్మదరాగ విధ్వంసకంబులును జేతనంబులునగు పంచాయుధములొనర్చు జయజయధ్వనులచేం బ్రబోధితంబగు నప్పరమపావనస్వరూపంబును, సమీపస్థుండై యుండు శేషునందలి సహజవిరోధంబును విడనాడి గరుడభగవానుండు కులిశవ్రణాంకితశరీరంబుతో నత్యధికవినయంబునం బ్రాంజలియొనర్చు నప్పరమశాంతాకారమును, యోగనిద్రావసానంబున సౌఖశాయనికులగు భృగువశిష్ఠాది బ్రహ్మర్షులను విమలకటాక్షవీక్షణంబుల ననుగ్రహించు నాభద్రనిధానమును-గన్నులారంగాంచి యాతెలుఁగంటు లనిమిషత్వమునందియున్న ఫలంబును నాఁడనుభవించి చరితార్థులయిరి.

అవాఙ్మానసగోచరుండును స్తోత్రపాత్రుండును నగు నద్దానవాంతకునకంత సురలెల్లం బ్రణమిల్లి యిట్లు స్తుతింపం దొడంగిరి.

" మహాత్మా! తొలుదొల్త విశ్వకర్తవై, పిదప విశ్వభర్తవై, పదంపడి విశ్వహర్తవై త్రిమూర్త్యాత్మకుండవై వెలుంగు నీకు నమస్కారము. మధురంబగు నేకరుచినిగలిగి యాకసమునుండి జాఱు వర్ష జలము, వేర్వేఱు దేశములందుంబడి వేర్వేఱురుచులం బడయునట్లు నిర్వికారుండవగు నీవు సత్త్వరజస్తమోగుణసంపర్కంబున విభిన్నావస్థల

నొందుచున్నాఁడవు. పరిశుద్ధమగు స్ఫటికము రాగద్రవ్యయోగమున నానావిధవర్ణములఁ బ్రకాశించునటు లొక్కఁడవయ్యు నుపాధిభేదంబులచే నీవనేకావస్థల వెలయుచున్నాఁడవు మఱియు నో దేవా! నీవమేయుండవై లోకంబులఁ బరిమితంబులుగ నొనరింతువు. నిష్కాముఁడవై యర్థులకామంబులొసంగుదువు అజితుండవయి సమస్తమును జయింతువు. సూక్ష్మరూపంబున నవ్యక్తుఁడవై స్థూలరూపంబులగు వ్యక్తపదార్థంబులకెల్లఁ గారణభూతుండవగుదువు. దేవదేవా! మఱియు హృదయస్థుండవయ్యు దూరస్థుండవనియు, నిష్కాముఁడవయ్యుఁ దపశ్శీలుఁడవనియుఁ బరమకృపాళుండవయ్యు నిర్ఘృణాత్మకుండవనియుఁ బురాణపురుషుండవయ్యు నజరుండవనియుఁ గఱువలు నిను వినుతింతురు. నీవు సర్వజ్ఞుండవై లోకములకు నవిజ్ఞాతుండవగుదువు. సర్వకారణుండవై స్వయంభుఁడవగుదువు. సర్వేశ్వరుండవై నిరీశ్వరుండవగుదువు. ఏకరూపుండవై సర్వస్వరూపుండవగుదువు. మఱియు * సప్తసామగేయుండవనియు, సప్తార్ణవశయనుండవనియు, సప్తార్చిర్ముఖుండవనియు, సప్తలోకాశ్రయుండవనియు, మహాత్మా! సప్తర్షిప్రముఖులు నిన్ను సన్నుతింతురు. చతుర్వర్గదాయకంబగు జ్ఞానంబును, జతుర్యుగాత్మకంబగు కాలపరిమాణంబును, జతుర్వర్ణమయంబయిన యీలోకంబును, సర్వంబు నో దేవా! భవచ్చతుర్ముఖసంజనితంబని చతుర్ముఖాదులు నిన్నుఁ గీర్తింతురు. మఱియు ముముక్షువులగు

---

* సప్తసామంబులు :— (1) రథాంతరము (2) బృహద్రథాంతరము (3) వానుదేవ్యము (4) వైరూప్యము (5) పావమాన్యము (6) వైజయము (7) చాంద్రమసము. ఇవియ గజోత్పత్తి కారణంబులు. ఇందువలననే గజములకు సామజములని పేరువచ్చినది

అగ్నియొక్క సప్తజిహ్వలు :— (1) కాళి (2) కరాళి (3) ధూమ్రవర్ణ (4) లోహిత (5) విశ్వరుచి (6) విస్ఫులింగిని (7) మనోజవ

యోగిజనంబులు హృదయారవిందకోశంబున జ్యోతిర్మయుండవై వెలుంగు నిన్ను ధ్యాననిగృహీతంబులగు మానసంబులతో వెదకుచుందురు. మఱియు నో దేవా! నీవు జన్మరహితుండవయ్యు జన్మము లెత్తుదువు. నిర్వ్యాపారుండవయ్యు శత్రుసంహారణ మొనర్తువు. నిద్రాముద్రితుండవయ్యు జాగరూకతవహింతువు. ఇట్టి నీయథార్థస్థితి నెఱుంగ నెవఁడు సమర్థుఁడు? శబ్దస్పర్శాదివిషయంబుల ననుభవించుచు దుశ్చరతపశ్చరణ మొనరించుటకును బ్రజాపాలన మొనరించుచునుదాసీనతమై మెలంగుటకును, దేవా! సర్వసమర్థుండవగు నీకుఁగాక మఱెవ్వనికిఁ జెల్లును? భిన్నస్థానములనుండి యేతెంచి భిన్నభిన్నగతుల నేఁగు గంగాప్రవాహములు సాగరునియందు సంగమించునటులు, మహాత్మా! త్రయీ సాంఖ్యాది భేదంబుల విభిన్నంబులగు పురుషార్థసాధకమార్గంబు లెల్ల నీయందు విలీనంబగుచున్నవి. చిత్తంబు నీయందు హత్తించి యాచరితకర్మంబుల నెల్ల నీకు సమర్పించి విరాగులై చరించు యోగులకు మోక్షలక్ష్మినొసంగుటకు నీవుగాక మఱి గతి యెవఁడు? మఱియు నో పరంధామా! పృథివ్యాదిరూపంబులఁ బ్రత్యక్షగోచరంబగు భవన్మహిమంబ యీపాటిదని యెఱుంగ నెవనికిని శక్యము గాకున్నది! ఇఁక శ్రుత్యనుమానైకవేద్యుండవై యగోచరుండవగు నిన్నెఱుఁగ నెవనికి సాధ్యమగును? దేవా! భవన్నామస్మరణమాత్రంబునఁ బురుషునిఁ బవిత్రునిగఁ బొనర్చుచుంటివన్నచో, దర్శనస్పర్శనాదీతరేంద్రియవ్యాపారంబుల నీవొసంగు మహత్తరఫలంబుల నదియే చెప్పక చెప్పనుగదా! సముద్రమునందలి రత్నంబులు లెక్కింపరానిచందంబునను, దరణికిరణంబులు వర్ణనసేయరానికరణిని, దేవా! యవాఙ్మానసగోచరంబులగు భవచ్చరితంబులు స్తుతికతీతంబులగుచున్నవి. దేవదేవా! నీవు జన్మంబులెత్తి కర్మంబులాచరించుట లోకానుగ్రహార్థముకాని స్వవాంఛాపరిపూర్తికొఱకుఁగాదు. నిత్యపరి

పూర్ణుండవై సమస్తమును బొందిన నీకీవిశ్వమునఁ బ్రాప్యమగు వస్తువు మఱేమున్నది ? మహాత్మా ! భవన్మహిమంబు లిట్టులుగ్గడించి మావచనంబులింతటితో విరామమునొందుట బడలికచేతనో యశక్తివలననో గాని నీగుణంబులింతమాత్రములగుటం జేసిగాదు. అనంతుండవగు నీ యనంతకల్యాణగుణంబుల ననంతుండగు నాశేషుండు నిశ్శేషముగఁ గీర్తింప నోకింతచాలునే మోగాని యల్పులము మేము వలంతులమే?"

ఇట్టులాయథోక్షజునిఁ గీర్తించి సురలాతనిని బ్రసన్నునిఁగావించుకొనిరి. వారికీర్తనంబు లాపరమేష్ఠికి స్తుతివచనంబులుగాక యథార్థగుణకథనంబులై యొప్పారెను. అంత నప్పురాణపురుషుండు కుశలసంప్రశ్న మొనరించి తమయందలి ప్రీతిని బ్రకటింపఁగ నద్దేవత లప్రాప్తప్రళయవేళయయ్యు వేలాతిక్రమణ మొనర్చి తమ్ము బాధించు రాక్షసోదధివలని భయంబు నాతనికి విన్నవించిరి. సముద్రఘోషంబును లోఁగొని వేలాతటస్థగిరిగహ్వరంబులఁ బ్రతిధ్వనుల నీను గంభీరస్వనంబుతో భగవానుఁడు వారికిట్లు వలుకఁ దొడంగెను.

ఆపురాణకవీంద్రుని కంఠాది వర్ణోత్పత్తిస్థానములనుండి బాగుగనుచ్చరింపఁబడి వెలువడుటచే భారతి యప్పుడు సర్వసంస్కారసంపన్నమై చరితార్థమైనట్లు గానవచ్చెను. దశనరుచిచంద్రికలతోఁగూడి యయ్యాదిపురుషుని వదనంబునుండి నిర్గమించు నవ్వాక్పూరము తచ్చరణతలనిస్సృవిశేషమై యూర్ధ్వముఖంబున వెల్లివారుచు గంగాప్రవాహమో యనఁ బ్రకాశించెను.

"ప్రాణికోటుల సత్వరజస్తమోగుణములలో మూఁడవది మొదటిరెండింటినింబోలె రావణాసురుఁడు మామహిమాతిశయవిక్రమంబుల నాక్రమించెనని నేనెఱుంగుదును. ప్రమాదవశంబున నొనరించిన పాపకృత్యంబునకుఁ దపించు సాధుజనహృదయంబువలెఁ

ది త్రిభువనం బెల్ల నచ్చెనటి దైత్యుని దుండగములవలన సంక్షుభితమగు చుండుట నాకుఁ దెలిసియున్నది. ఏక కార్యార్థులమైయుండఁగా నిష్కార్య మునకు మహేంద్రుం డుపేంద్రుని నన్నింత ప్రార్థింపవలయునా? అని లుం డనలునకు స్వయముగఁగాదె సారథ్యమును వహించుచున్నాఁడు. కావున నాకును విధాయకకృత్యమయిన యిప్పనికి మీరింతగ నన్ను వేఁడికొననక్కఱలేదు. అమ్మనుజాశనుండు మహాదేవప్రీత్యర్థము తన తొమ్మిదిశిరంబులను స్వకీయచంద్రహాసమునన ఖండించుకొని పది యవ మూర్ధంబును మదీయచక్రధార కుపాయనభాగముగ మిగిల్చి యున్నాఁడు. చందనవృక్షము భుజంగారోహణమును బలె నేనాదుష్ట శాత్రవుని యౌన్నత్యము నింతదనుక బితామహుఁడు వానికొసంగిన వరములకారణంబున సహించియుంటిని. ఆకుటిలదానవుఁడు నిరాదర భావంబుతో మానవులెంతపాటివారని యెంచి వారివలన నెట్టియిక్క ట్టును శంకింపక దేవతాగణమునుండిమాత్రము తనకు మరణము గలుగకుండఁ జేయుమని నిజతపస్సంతుష్టుఁడయిన విరించనునిఁ బ్రార్థిం చెను. కావున నేను దశరథమానవేశ్వరునకుఁ గుమారుఁడనై యవత రించి నిశితశరంబులతోడ నన్నిశాచరుని శిరఃకమలసముదయంబును రణాంగణమునకుఁ బూజార్హముగ నొనర్తును. కాఁబట్టి మాయావు లగు పిశాటజనంబులు స్పృశింపని యజ్ఞహవిర్భాగముల నచిరకాల ముననే యాజ్ఞికులు మీకు విధివిహితముగ సమకూర్పఁగలరు. నభో వీథిని విమానములపై సంచరించుచు నద్దనుజాధముని పుష్పకమును గాంచి పయోధరముల మఱుగునడాఁగు పుణ్యకృతులింక విగత భయులై విహరింతురుగాక! నలకూబరశాపనిబద్ధుఁడై యప్పాపా త్ముఁడు బలాత్కారకచగ్రహణ మొనర్పనందున మైలపడక యున్న సురబందీజనంబులధమ్మిల్లబంధముల నిఁక విప్పి సమ్మోదమును గాంచుఁడు.”

రావణావగ్రహంబున వాఁడియున్న మరుత్సస్యములపై నిట్లు వచనామృతవృష్టిఁగురిసి యాకృష్ణమేఘ మంతర్ధానమందెను. భూరుహంబులు తమప్రసూనంబులతో మారుతంబు ననుసరించు కరణిఁ దమతమ యంశంబులతోఁ బురుహూతాది మరుద్గణంబులంత సురకార్యోద్యుక్తుఁడయిన యాప్పురుషోత్తము ననుసరించిరి.

అంతనచ్చట దశరథధరణీశ్వరుఁడొనర్చు పుత్రికామేష్టి సమాప్తినొందఁగ ఋత్విజులెల్ల మహాశ్చర్యమునఁ జూచుచుండ హోమాగ్నినుండి యొకదివ్యపురుషుఁడుదయించెను. ఆదిపూరుషుని దివ్యతేజముప్రవేశించుటచే దుర్వహంబయియున్న పాయసాన్నంబుతో నొప్పు హేమపాత్రమును రెండుచేతులతోడను బట్టికొని యాయజ్ఞపురుషుఁడు దశరథున కొసంగెను. పయోనిధిగర్భమునుండి వెడలిన పయస్సారంబు నొకకమండులువునఁ దెచ్చి ధన్వంతరి యొసంగఁగ శతముఖుఁడు గ్రహించిన వితమున నాక్షితీశ్వరుండు ప్రాజాపత్యదత్తంబగు నప్పాయసాన్నంబును స్వీకరించెను. త్రిభువనకారణుండగు నారాయణుం డద్దశరథునందుఁ బ్రభవంబు నొందఁగోరుటచే నజ్జనవిభుని గుణగణంబు లనితరదుర్లభంబులని వ్యక్తమయ్యెను. ఇనుండు బాలాతపంబును భూమ్యాకాశములకుఁబోలె నంత నయ్యినవంశభూషణుఁడు చరుసంజ్ఞఁ బరఁగు నవ్విష్ణుతేజమును జెఱిసగంబుగఁ దన ప్రియురాండ్రకిద్దఱకును బంచియిచ్చెను. ఆనరేశ్వరుండు తనకుఁ గౌసల్య పట్టమహిషియై సన్మాన్యయగుటవలనను, కైకేయి ప్రియతమయగుటచేతను, గనిష్ఠభార్యయగు సుమిత్రాదేవి చరుభాగసంప్రదానమున వారిరువురచేతను గౌరవింపఁబడనిచ్చగించెను. అమ్మహీపాలుని యాయురాంగులిరువురును నుచితజ్ఞుఁడగు ప్రాణేశ్వరుని భావంబు గ్రహించి తమకాతఁడిడిన యాయాపాయసాన్నభాగములలో సగముఁ దమసపత్నికొసంగిరి. మదవారణంబు కటతటంబులందలి మదజలరేఖల

రెండింటియందును సమానోత్సుకతఁగలిగియుండు భృంగివోలె సుమిత్రాదేవియు సపతులిరువురయెడ సమానానురాగముకలిగి వారలఁ కెంతయుఁ బ్రేమాస్పదయయియుండెను. అమృతాభిధానంబులఁ బరఁగు సూర్యనాడు లమృతమయగర్భంబును దాల్చునటు లంతనన్నారీమణులు దేవాంశసంభవంబగు గర్భంబును ధరించిరి. అంతర్గతములగు ఫలోద్గమములతోనొప్పు సస్యసంపదలవలె వారేక కాలముననయంతర్వత్నులై యించుకవెల్లఁబాఱిన శరీరములతోడఁ దేజరిల్లిరి. అంత నక్కాంతామణులు మువ్వురును శంఖ చక్ర శార్ఙ్గ గదా ఖడ్గ చిహ్నిత శరీరములతో వామనాకారులు తమ్ముఁ గాపాడినట్లును, సుపర్ణుండు దమ్ము వీఁపుపై నెక్కించుకొని స్వగమనవేగాపకృష్టంబులయిన జలధరంబులు వెంబడింపఁగ సువర్ణపక్షరుచిపుంజముల వెదఁజల్లుచు గగనతలంబున విహరించినట్లును, లక్ష్మీదేవి, స్తనాంతరప్రదేశమున హృదయేశ్వరుండు ప్రేమతోడనిడిన కౌస్తుభమణి వ్రేలుచుండఁ గరంబున నరవిందమును వీవనగాఁగొని తమ్ము సేవించినట్లును, మందాకినీదివ్యజలంబులఁ గృతస్నాతులై పరబ్రహ్మసంకీర్తనమొనరించుచు సప్తర్షులు తమ్ముఁ బూజించినట్లును స్వప్నములఁ గాంచిరి.

దశరథుండంత భార్యలవలన నీస్వప్నప్రకారంబులవిని కరంబు సంతసించి జగద్గురునకు గురుఁడుకాఁగల భాగ్యము లభించుటచేఁ దన జన్మమెంతయు శ్రేష్ఠమైనదని భావించుకొనెను. చంద్రబింబమొక్కటయ్యు విమలజలంబులలో వివిధప్రతిబింబముల భాసిల్లునటు లొక్కఁడయ్యు విభుండా రాజపత్నుల గర్భములందుఁ బలువిభాగములతో విలసిల్లెను. జ్యోతిష్మతియను నోషధి రాత్రియందుఁ దమోనుదంబగు తేజంబును గాంచుభంగి దశరథేశ్వరుని యగ్రమహిషియు సతీతిలకము నగు కౌసల్యాదేవి ప్రసవనమయంబునఁ దమోపహారకుండగు

పుత్రకునిఁ గనెను. ఆకుమారుని శరీరాభిరామత్వముచేఁ గరంబు ప్రీతుండయి గురుండాతనికి జగత్ప్రథమమంగళంబగు రామనామం బునుంచెను. అసమానతేజంబున వెలుంగు నారఘువంశప్రదీపము నెదుట నప్పురుటింటిలోని దీపములన్నియు వెలవెలఁబాఱి కాంతివిహీనములయ్యెను. శరత్కాలమునఁ గృశించు జాహ్నవీస్రవంతి పులినతలస్థపద్మోపహారంబు చేఁబోలెఁ గృశోదరియగు కౌసల్యాదేవియు శయ్యాగతుండగు నబ్బాలకునిచే నెంతయుఁ బ్రకాశించెను. అంతఁ గైకేయికి భరతుఁడను సుశీలుఁడు జన్మించెను. వినయసంపద ధనసంపద నెంతయుఁ బ్రకాశింపఁ జేయునటు లాబాలుఁడు తల్లిని మిక్కిలి శోభిల్లఁ జేసెను బాగుగ నేర్చిన విద్య విజ్ఞానవినయంబులఁ గాంచుకరణి సుమిత్రాదేవి యంత లక్ష్మణ శత్రుఘ్నులను కవలపిల్లలఁ గనెను.

భూలోకమునకవతరించిన పురుషోత్తమునితోడ స్వర్గముగూడ వెన్నంటివచ్చినదో యన నప్పుడు జగంబంతయు దుర్భిక్షాది దోషరహితమై, యారోగ్యాది సకలసద్గుణప్రచురమై, రెండవనాకమో యన విలసిల్లెను. పౌలస్త్యపరాక్రమచకితులయిన యింద్రాదులచేఁ బాలింపఁబడు చతుర్దిశలు చతుర్మూర్తులతోడి యచ్చతుర్భుజోదయంబునకెంతయు సంతసించి భయరాహిత్యమున విడుచు నుచ్ఛ్వసితములో యన నప్పుడెల్లయెడల మారుతములు రజోరహితములై వీచెను. ధూమరహితుఁడై లోహితాశ్వుఁడును బ్రసన్నుఁడై సప్తాశ్వుఁడును గరంబు దేజరిల్లి రాక్షసబాధలవలని దుఃఖము నప్పుడు విడనాడినవిధమ్మునఁ గానవచ్చిరి దశాననుని కిరీటములనుండి జాఱు రతనముల నెపంబున రాక్షసరాజ్యలక్ష్మి యాక్షణమంద భూమిపై నశ్రువుల రాల్చుచుండెను. పుత్రజననహర్షంబున నాచరింపఁదగు తూర్యాదివాద్యకృత్యములను బుత్రవంతుఁడయిన యద్దశరథక్ష్మాకళత్రుండు ప్రారంభింపకమున్నే, యాసుకుమారోదయమున కాతనికంటె నెక్కుడుగ

సంతసించిన దివౌకసులు దివియందు దుందుభుల మ్రోయించిరి. మఱియు నయ్యమరు లమ్మనుజేశ్వరుని భవనంబుపైఁ గురిసిన సంతాన పుష్పవృష్టి యబ్బాలకుల శుభోదయసమయమున జరుగఁదగిన సన్మంగళోపచారములకెల్లఁ బ్రిప్రథమకార్యమై వెలసెను. కృతసంస్కారులయిన యక్కుమారులంత దాదుల స్తన్యంబుఁ గ్రోలుచుఁ దమకన్న మునుమున్న జనించి తమకన్నవలెనున్న జనకుని యానందముతోడ సమంబుగ దినదినప్రవర్ధమానులగుచుండిరి. హవ్యవాహనుని సహజ తేజము హవిస్సుచేఁ బ్రవృద్ధమగుపగిఁది స్వాభావికంబగు నబ్బాలుర వినయసంపద శిక్షావిశేషమున మఱింతయధికము గాఁజొచ్చెను. పరస్పరవిరుద్ధగుణవంతములగు వసంతము మున్నగు ఋతువులైకమత్యముతోడ నొక్కటఁగూడి దేవతల నందనోద్యానము నలరించు చందమున నబ్బాలురన్యోన్యసౌహార్దముతో మెలంగుచు ననఘంబగు రఘుకులంబు నెంతయుఁ దేజస్వంతముగ నొనర్చిరి. ఆకుమారులు నలువురు సమానసౌభ్రాత్రమునఁ జరించుచున్నను సంప్రీతివిశేషంబున వారిలో రామలక్ష్మణులొకజతగను నవ్విధముననే భరతశత్రుఘ్నులొకజతగను నేర్పడిరి. ఏకకార్యపరత్వముననను, సమానసుఖదుఃఖశీలత్వమునను నత్యంతమైత్రితో మెలంగు నాజంటసోదరులకు, వహ్ని పవమానులకువలెను, నిశాకర రత్నాకరులకువలెను, నొకప్పుడును నైకమత్యము సడలదయ్యెను. శ్యామాంబుదములతోడ నొప్పుచు నాతిశీతోష్ణములగు గ్రీష్మావసానదివసంబులవలెఁ దమ తేజోవినయములచేఁ బ్రజాపాలకులగు నబ్బాలకులు ప్రజలమనంబులకెంతయు ముదంబు గొలిపిరి. దశరథక్షితీశ్వరుని యాసుతచతుష్టము మూర్తీభవించిన పురుషార్థచతుష్టయమోయన మిగులనొప్పుచుండెను. గురుభక్తితత్పరులగు నక్కుమారులు నలువురును జతుర్దిశలఁ బాలించు తమగురునిఁ జతుర్మహార్ణవంబులు రత్నసంతతిచేతనుంబోలె, గురుతరంబులగు తమ

గుణరత్నంబులచే నారాధించిరి. దానవుల యసిధారలను భగ్నము నర్చు దంతములతోడ మెఱయు చౌదంతికరణిని, ఫలసిద్ధి చేనూహింపఁ దగు చతురుపాయప్రయోగముల నందమగు రాజనీతిచందమునను, కాఁడులవలె నిడుదలగు బాహువుల వెలుంగు చతుర్భుజునివలెను నారాజరాజేశ్వరుఁడు నారాయణాంశసంభవులయిన తనయులు నలువురతోడను గరమ్ము ప్రకాశించెను.

---

ప్రథమఖండము సంపూర్ణము.

## —• శుద్ధపత్రిక •—

| పుట. | పఙ్క్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 5 | 24 | ఔపథంబు | ఔషధంబు |
| 8 | 7 | తాపసుల దృశ్యములయి | తాపసు లదృశ్యములయి |
| 40 | 24 | వీఢి | వీథి |
| 59 | 21 | తోఁడ | తోడ |
| 97 | 13 | పిండాది | పిండాదిక |
| 98 | 5 | అజనవిభుని | ఆజనవిభుని |
| 108 | 1 | ధనవృష్టిత్వమున | ధనవర్షిత్వమున |
| ,, | 5 | సంనన్నయగు | సంపన్నయగు |
| 112 | 21 | దముమీఱ | దమిమీఱ |
| 116 | 25 | యూథము | యూధము |
| 118 | 4 | శిలీముఖమ రక్త | శిలీముఖ మరక్త |

---

